శ్రీ సద్గురవేనమః.

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదం బను

# సుజ్ఞాన శాస్త్రము.

శ్రీ మదచలగురుమూర్తి యగు

పోకల - శేషాచలము నాయనివారి

శిష్యుండగు

పోలకం - నరసింహం శెట్టి గారిచే

రచియింపంబడి,

తద్గురుపుత్త్రులగు

ఆశుకవి శిఖామణి

పోకల - వేంకట నరసింహారావు నాయనిచే

సవరింపఁబడినది



పైవారివద్ద ఈగ్రంథ స్వతంత్ర హక్కునుపొందిన

వెస్టువార్డు అండు కంపెనివారి,

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపఁబడినది

నెం. 12, ఇన్‌స్పెక్టరు సుబ్బారాయలు నాయుడువీధి,

చాకలపేట, మదరాసు 21.

8-వ కూర్పు 2000

రిజిష్టరుకాఫీరైట్]  1956  [వెల 1-4-0



శ్రీ కృష్ణమూర్తి



రుక్మిణీ దేవి

# విషయసూచిక.


| | | పుట సంఖ్య |
|---|---|---|
| 1. | ద్వారకాపురవర్ణన | 3 |
| 2. | శ్రీకృష్ణరుక్మిణీ సంవాద ప్రారంభము | 6 |
| 3. | సాధన చతుష్టయములు | 9 |
| 4. | చతుర్విధ పురుషార్థ లక్షణము | 10 |
| 5. | గురుమూర్తి ప్రభావము | 14 |
| 6. | దైవ లక్షణము | 17 |
| 7. | భాగవత లక్షణము | 21 |
| 8. | జీవహింస లక్షణము | 23 |
| 9. | ఆశ్రమ లక్షణము | 26 |
| 10. | కుల లక్షణము | 28 |
| 11. | పిండోత్పత్తి లక్షణము | 34 |
| 12. | ప్రాప్తకర్మ లక్షణము | 34 |
| 13. | భక్తి లక్షణము | 37 |
| 14. | కర్మ లక్షణము | 38 |
| 15. | యమదండన వివరణము | 41 |
| 16. | యోగ లక్షణము | 47 |
| 17. | అష్టాంగ లక్షణము | 48 |
| 18. | పంచముద్రల లక్షణము | 49 |
| 19. | ప్రపంచోత్పత్తి లక్షణము | 51 |
| 20. | సాంఖ్య లక్షణము | 52 |
| 21. | తారక లక్షణము | 56 |
| 22. | జీవాత్మ పరమాత్మ లక్షణము | 64 |
| 23 | తనుచతుష్టయ నిర్ణయము | 65 |
| 24. | షట్చక్ర నిర్ణయము | 66 |
| 25. | హంస లక్షణము | 71 |
| 26. | భగవంతుని విశ్వరూప లక్షణము | 78 |
| 27. | కాలప్రమాణ లక్షణము | 82 |
| 28. | మిథ్యాజగల్లక్షణము | 88 |
| 29. | మరణ చిహ్నములు | 95 |
| 30. | అచలభావము | 97 |


విషయసూచిక - సంపూర్ణము.



అచలగురుఁడు పోకల - శేషాచలస్వాములవారు



పోలకం - నరసింహంసెట్టి

శ్రీ సద్గురవేనమః

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదం బను సుజ్ఞాన శాస్త్రము.



## ప్రథమాశ్వాసము.

శ్రీ గురునాథునిన్ బరమ ఽ సిద్ధుని నద్వయు నప్రమేయునిన్ । రాగవికార దూరుని నిరంజను నిర్గుణు నిర్వికారుని । న్నాగమ వేద్యు సర్వమయు ఽ నక్షరు నవ్యయుఁ గేవలాత్మునిన్ । బాగుగఁ గొల్చి యేనవుడుఁ ఽ బ్రార్థనఁ జేతు నభీష్టసిద్ధికై ॥౧॥ తోటకము॥ మూర్తులకాదిమ ఽ మూర్తియటంచున్ । మూర్తులు వేల్పులుఽమున్నఁగదామే । మూర్తిగ ణింతురొ ఽ ముఖ్యముగా నా । మూర్తివినాయక ఽ మూర్తిఁదలంతున్ ॥ ౨॥ ఉ॥ సారసగర్భ చక్రధర ఽ శంకరనాముల నాదివేల్పులై । శారద లక్ష్మి పార్వతుల ఽ శక్తులుగాఁగొని లోకజాలము । గ్గోరియొనర్పఁగావఁ గను ఽ గూల్ప వశీకరులైన ధన్యులన్ । గూరిమిఁగొల్చి వాణి రమ ఽ గోత్రజదేవుల సన్నుతించెదన్ ॥౩॥ ఉ॥ ఒక్కపసిండి పెక్కునగ ఽ లొప్పఁగ నొక్రియ దేవదానవుల్ । దిక్కులుపంచభూతములుఽదిక్పతులు న్ముని మూర్తులుంబుధుల్ । చుక్కలుమర్త్యలింద్రరవిఽసోమనగాదిసమస్తవస్తువుల్ । మక్కువ నొక్కఁడై నపర । మాత్మను గూర్చి భజింతు నెమ్మదిన్ ॥ ౪॥ క॥ నరసుర లోకము లెల్లన । మఱియున్నను లేకయున్న ఽ మాయనెఱుఁగకే । నిరతంబు బట్టబయలగు । పరిపూర్ణ బ్రహ్మమునకుఁ ఽ బ్రణుతియొనర్తున్ ॥౫॥ తే-గీ॥ అవని భాగవతోత్తము ఽ లనఁగఁబరఁగు । నట్టి ప్రహ్లాద భీష్మగ ఽ యాంబరీష । శౌనకవ్యాసబలిశుక । జనకనార । దార్జునాది మహాత్ముల ఽ నభినుతింతు॥ ౬॥ సీ॥ పరఁగ వేమనయోగిఁ ఽ బ్రకటించిపలుమాఱు-శ్రీధరస్వామి ప్రఽసిద్ధిఁబొగడి । తివిరి శ్రీశివరామఽ దీక్షితుసేవించి-శ్రీకృష్ణదాసునిఁఽజింతసేసి । చెంచురాజాఖ్యులఽ జిత్తంబులోనెంచి - కోటప్పదేవరఽగొల్చిభక్తి । వరుసగానాంధ్రగీఽర్వాణకవులనెల్ల - భావించివేత్వేఱఁ ఽ బ్రస్తుతించి॥ తే-గీ॥ యచల భావజ్ఞులై

నట్టి యఖిలబుధుల । పాదపద్మంబులకు మ్రొక్కి భక్తిమీఱ । నతు
లవా సిదు కృపనొక్క । కృతినినిపుడు । సేయఁబూనితి గురురాయ
చిత్తగింపు ॥ ౭ ॥ తే-గీ॥ ఆంధ్రగీర్వాణతర్కశా । వ్యాకరణములు । ఛంద
వేదాది శాస్త్రముల్ చదువలేదు । గురువరోత్తమ భవదీయ కరుణఁ
జేసి । చెలఁగి యీకావ్యమేను రచింతు నిపుడు ॥ ౮ ॥ చ॥ ధరనపశబ్ద
యుక్తమయి దైవనుతంబుగఁ జేయుకావ్యమా । సరసిజబంధుఁడుం
బొడముకసద్దివసంబు విధంబు భాసిలున్ । అరయ సుశబ్దయుక్తమయి
యాత్మవిచారము లేనికావ్యమా । సరసపుఁజుక్కలుండియును చంద్రుఁడు
దోఁచని రాత్రి చందమా ॥ ౯ ॥ ఆ-వె॥ సత్యవంతునకు జక్కఁదనంబు
లే । సత్యమునకుఁ గొఱఁతరాదు । గాన నట్లు మోక్ష గ్రంథమునకు
లక్షణములతో నలఁగియున్న నాదిచెడునె ॥ ౧౦ ॥ క॥ అని యిందుఁ దప్పు
గల దిట । నని దిద్దియు నొప్పఁ జేతు రార్యులనుచు నె । మ్మనమున నెంచి
వచించెద । నెనయఁగ మజ్జన్మక్రమము నించుక దెలియన్ ॥ ౧౧ ॥
సీ॥ క్షితిఁ గందుకూరను సీమతోఁ జేరిన పమిడిపాడను గ్రామ
పథమునందుఁ । గల గోనుగుంట సద్బలిజ కులాబ్ధిం దుఁడలఘు
కర్పూర గోత్ర జలజభానుఁ । డయిన పోలకము వెంగనకు నర్సాంబస
ద్గర్భశుక్తిమ ముక్తి కంబనంగ లక్ష్మీనృసింహుండు లలినొప్పునా
తని దేవి లక్ష్మమ్మ యనంగఁ దేజరిల్లె ॥ తే-గీ॥ ధర్మగుణముల నయ్యి
రుంధతియనంగఁ । బొల్చుసాధ్వికి నమ్మహా పుణ్యునకును । బుట్టితి
మిరియేపురమునొక్క పుత్త్రియుతము । నారసింహుండ నేనందు నగ్ర
జుండ ॥ ౧౨ ॥ క॥ వరుసఁ గఁగొండయ వెంగయ । మతిరామయ యనఁ
గనక్క మాంబ యనంగాఁ । బరఁగుదురు కడమవారలు । ధరనుత్తమ
గుణులు సత్య ధనులు సధర్మల్ ॥ ౧౩ ॥ సీ॥ ధారుణి శ్రీపోతు లూరి
వీరబ్రహ్మమునకు సద్భక్తుఁడై ముదముమీఱఁ । జెలఁగె దూదేకుల
సిద్దప్ప యతనికి లీల జంగమ మర లింగమయ్యె ॥ శిష్యుఁడాతనికిని
శేషరాజననొప్ప రహినతనికిఁ జెంచు రాజుసేవ । కుండయ్యె నతనికిఁ
గోటప్పదేవర శేషాచలాహ్వయుల్ శిష్యులైరి ॥ తే-గీ॥ కోరి శివరామ
దీక్షితుఁ గొల్చెరామ । కృష్ణుఁడు మహేశ్వరుఁడతని కృపను బడసె । నత
నిఁ గోటప్ప దేవర యాశ్రయించె । నతని సేవించె శేషాచ లార్య
వరుఁడు ॥ ౧౪ ॥ మ॥ పరిపూర్ణాచల భావశీలుఁడయి తద్భావంబు గ్రంథం
బులన్ । విరచింపన్ దను శిష్యకోటి గొలువన్ విఖ్యాతినిం బొందిసుస్థి
రుఁడై చెన్నపురంబునం దెసఁగు నా శేషాచలాభిఖ్యు మ । ద్గురు

మూర్తిన్ మదినెంతు భక్తిమెయి న త్యుద్బుద్ధి నశ్రాంతమున్ ॥ ౧౫॥
సీ॥ ఒనరనేనొక్కటౌ డొకకావ్యమొనరింపఁ-దొడంగి యేకథఁజేయుఁ దోపకాత్మఁ గనుమూయు మద్దేశికుని యట్లు శ్రీహరి - నాకుఁ బ్రసన్నుఁడై నన్నుఁజేరి । రూఢిగా శ్రీకృష్ణ రుక్మిణీసంవాద-మగునట్లు నా పేర నంకితంబుఁ । జేయఁగృతార్థతఁ జెందు సర్వాఘముల్ - వాయు భవంబులు వాయునీకు॥ తే-గీ॥ ననుచుఁ జెప్పితిరోహితుండయ్యె నంత। నట్టి మేల్కాంచి యేను నానందమొదవ । నాతపంబును ఫలియించె నాదుకోర్కె । లెల్ల సమకూరె ననిపొంగి యుల్లమునను॥ ౧౬॥ చ॥ తనువు దొలంగి చూచినను దైవము దేశికుఁ డొక్కఁడంచు నా । మనమున నెంచి సర్వమయు మాటికిఁ గొల్చి ముదంబు నెక్కొనన్ । ఘనముగఁ గృష్ణరుక్మిణులఁ గారణభూతులఁ జేసి యెంతయున్ । దెనుఁగున నేఁ బ్రబంధము కృతింపఁగఁ బూనితి దైవతాఖ్యగన్ ॥ ౧౭॥ షష్ఠ్యంతములు.
క॥ సర్వోత్తమునకు గురునకు । సర్వాత్మకు నిర్మలునకు సర్వమునకున్ । సర్వేశ్వరునకు జ్యోతికి। సర్వాధారునకు హరికి సర్వమయునకున్॥ ౧౮॥
క॥ సురమునిగణ పూజితునకుఁ । బరమాత్మకు విగతగుణికి భవదూరునకున్ । దురితరహితునకు నిహపర । భరితునకున్ జిన్మయునకు భగవంతునకున్॥ ౧౯॥ క॥ రూపరహితునకు సర్వ । వ్యాపకునకు వాదభేద వర్జితునకు స । ద్రూపునకును నఖిలజగ। ద్దీపకునకుఁ గామరహిత దివ్యాత్మునకున్ ॥ ౨౦॥ క॥ నిరుపమునకు శాశ్వితునకుఁ । బరబయలగు నిర్వికల్ప పరమపదునకున్ స్థిరతునకుఁ గేవలాత్మకుఁ। బరునకు నచలునకు సర్వ పరిపూర్ణునకున్॥ ౨౧॥ కథా ప్రారంభము. తే-గీ॥ ఒప్పనంబుగ నేనిపుడు చెప్పఁబూనినట్టి గ్రంధంబునకు మొదలెట్టిదనినఁ । బుడమిలోపల ద్వారకాపుర మనఁగఁ! । బరఁగు నొకరమ్యమైనట్టి పట్టణంబు॥ ౨౨॥ క॥ పదిరెండామడలు నిడుపుఁ । బదిరెండామడలు వెడల్పుఁ । బట్టణమదియా। యుదధికి నడుమను నెంతో । ముదమొప్పఁగ విశ్వకర్మ మును గావించెన్॥ ౨౩॥ తే-గీ॥ స్వర్గవైకుంఠకైలాస సత్యలోక । ములను బురుడించు వైభవ ములనుమించి । రౌప్యకాంచన సదముల రత్నమయము । లగుచు వెలుఁగొందు గేహంబు లగణితముగ॥ ౨౪॥ క॥ కనకమణిమయము లగుచును ! గొనకొని గగనంబునంటు గోపురములచే। సనువొందులోహనిర్మిత। ఘనతర ప్రాకారసప్త కంబవ్వీటన్॥ ౨౫॥ క॥ మకరాదిసకలజలచర । నికరంబుల కునికియగుచు నెంతోలోతై। ప్రకటింపఁ జెలఁగు పరిఖయు। నకలంకంబగుచుఁ బురికి నాలుగు దెసలన్॥ ౨౬॥

చ॥ కమలదళాప్తురథ్యములకు · కంటెను వేగములైన గుఱ్ఱముల్ । అమరఁగ
దిగ్గజంబులకు · నారయమించిన హస్తియూథముల్ । యమభటకోటి
నైన మటి · యంతముఁజేయఁగఁజాలు భృత్యులుఁ । సమమగుభూధరం
బులకుఁ · జక్కని తేరులు నప్పురంబునన్॥ ౨౭॥ తే-గీ॥ దేవకాంతలరూ
పము · లైగడనోవు । నందములచేతఁ బెంపొందు · నిందుముఖులు ।
చక్కఁదనమునఁజంద్రుని · ధిక్కరింపఁ । జాలుపురుషులు గలరందు ·
లాలితముగ॥ ౨౮॥ క॥ సుందర సుకుమారత్వము।లందున నవగానవిద్య ·
లందున మహదా। నందపరమావిభవంబులఁ · గందర్పునిముంపఁజాలు ·
గణికా తతులుఁ। ౨౯॥ చ॥ ఎనయఁగ బ్రహ్మవేత్తలగు · సిద్ధమనస్కులు
భూసురోత్తముల్ । ఘనమగువిక్రమస్ఫురణ · గల్గియధర్మము లేని క్షత్రి
యుల్ । ధనమునఁనా కుబేరునకుఁ · దారును హెచ్చినటించువైశ్యులుఁ।
బనుపడసేవ్యవృత్తిగురు · భక్తియుఁగల్గినశూద్రులప్పురిఁ॥ ౩౦॥క॥ కోమ
రగు మకరతోరణ । సముదయములు వెలయుచుండు · సకలదిశలతో
ఘుమఘుమ వాసనలొదవెడి । రమణీయంబైనయట్టి · రాతెరువులతోఁ॥
౩౧॥ తే-గీ॥ వీథివీథులనంగళ్లు · విమలముగను । గామితార్థంబులెల్లను ·
గలిగియుండు । గణన సేయ గరానట్టి · మణులచేత। దానిసరిపోల్ప రాదు
ర · త్నాకరంబు॥ ౩౨॥ చ॥ కొనకొని మేడలందు బలు · గోపురపఙ్క్తు
లనాటినట్టియా । ఘనతరమైన సోమరవి · కాంత శిలా తతులందు సొం
పుగాఁ । గనుబడు నీడలంగనియుఁ · గల్వరమొందుచుఁ బెక్కుభంగులఁ।
జనములనేక సూర్యులని · చంద్రులు పెక్కని జూతురప్పురిఁ॥ ౩౩॥
తే-గీ॥ హంస కోకిల కీరంబు · లమ్మయూర । మాదిపక్షులకెల్లను · నది
యునిలయ । మగుచుఁజందన మాకంద · మాదివృక్ష । రాజిచేశోభ
చుండు నా · రామములును॥ ౩౪॥ క॥ జలజములు నల్లకలువలు।సులలి
తమగు చంద్రకాంత · సోపానగతుల్ । గలిగిబహునిర్మలోదక। ములచే
నేకాలమింకి · పోనిసరస్సుల్॥ ౩౫॥ ఉ॥ ఆపురిరమ్య హర్మ్యములు · నాపు
రికోటలుగోపురంబులు । న్నాపురిరాజమార్గములు · నాపురిసొంపు విశా
లగేహముల్ । ఆపుర రామశీమలును · నాపురదివ్యతటాకవర్గముల్ ।
ఆపురవైభవంబులును · నారయ బ్రహ్మకునైనశక్యమే॥ ౩౬॥ క॥ కోరిగ
నుంగొననెంతటి । శూరులకును వశముగాదు · శోధింపఁగనే । చోరులకు
నలవిగాదిక । నే రిపులకుఁజొరనశక్య · మిలనాప్రోలుఁ॥ ౩౭॥క॥ ఆప
ట్టణంబునకుసరి । యేపట్టణమైనజగతి · నెన్నఁగరాదా । నాపురిగాపుర
ముండెడు । నాపుణ్యులభాగ్యమింత · యనఁగావశమే॥ ౩౮॥ క॥ ఆనగర

మేలుధీరుఁడు । మానిత విజ్ఞానమయుఁడు మాయాహరుఁడున్ । నానా
లోకగురుండును । నానిగమాంతుండుకృష్ణుఁ డనఁగా వెలయున్॥ ౩౯॥
క॥ పదునాలుగు భువనంబులు । పదపడి తనయందునిలిపి బ్రహ్మాదు
లకున్ । మదిఁదెలియరాకనిర్గుణపదమున భాసిల్లునతఁడుపరిపూర్ణుండై॥
౪౦॥ తే-గీ॥ అష్టభార్యలతోడను నధికసౌఖ్య । మనుభవించుచు నిర
తంబు మునులతోడ । గోష్ఠిసల్పుచు నేమిటఁ గొఱఁతలేక । చక్రధ
రుఁడుండె నత్యంత సంభ్రమమున॥ ౪౧॥ క॥ ఆరీతి నందనూనుఁడు ।
వారక సాందీపు వలనఁ బడసినవిద్యన్ । గోరినభక్తులకిచ్చుచుఁ।గూరి
మిమీఁఅంగమార గుఱుఁడుండుతఁడున్॥ ౪౨॥ చ॥ సతతము రుక్మిణీస
తియు సాధుచరిత్రయుముక్తిఁగోరి దాఁ । బతికడభక్తకోటుకాడఁ
బాయకభక్తివహించుమార్గమున్ । హితమతిఁజూచి చూచియదియేగ
తినాకులభించుఁగాత యం । చతివయు భర్తవేఁడుటకుఁ సంశయమొం
దుచు సిగ్గుఁబొందుచున్॥ ౪౩॥ తోటకము॥ ఎన్నిదినంబులకీగతినున్న।
నున్నదెసార్థక మూరకయుంచున్ । బన్నగనప్పుడ భర్తను వేఁడన్ ।
దిన్నగనాచెలి తెంపువహించెన్॥ ౪౪॥ వ॥ అంత ఉ॥ అచ్చపలాక్షి
యాపగల యచ్యుతుఁజేరఁగ లేకయాత్మలో । మచ్చికనెంచెనిట్లుహరి
మానిని కేల యటంచు నెంచునో । యిచ్చునో లేక కారణము నీయక
యెంతయుఁగోపగించునో । హెచ్చగునాదుపూర్వఫల మెట్టులనున్నదో
యంచుఁజింతిలున్॥ ౪౫॥ సీ॥ ఎనితమోక్షమునందు వాంఛయొక్కటె
గాని - కొండొకధర్మంబుఁ గోరదయ్యె । స్నానంబుఁజేయదు చలు
వలుగట్టదు - పుష్పముల్పెట్టదు భూషలిడదు । గంధంబుఁబూయదు
కస్తూరితిలకంబు దిద్దదు కాటుకఁ దీర్చదబల । కీరంబుఁబిల్వదు కేకి
హంసలఁబ్రోవ - దలకోకిల పల్కు లాదరింప॥ తే-గీ॥ దన్నపానాది
తమలంబు లంటదతివ । భోగమును నిద్రఁగోరదు - పుణ్యచరిత। చెలు
లఁగన్నెత్తిచూడదు చెలులవలన । సేవఁగైకోదుపల్కదు చెలుల
తోడ॥ ౪౬॥ చ॥ పడఁతుక యింతకాలమును బాయకనాధుని చెంతనుం
డియున్ । దడయుట కేమికారణమొ దామును జేసినయట్టి పుణ్యమి ।
య్యెడనొనఁగూడఁగావలయు నింతికిభానుఁడుగ్రుంకునంతలో।నొడలను
బ్రాణముల్నిలుపకనోపదుతాఁగనునొక్కయేడుగన్ ॥ ౪౭॥ స్వాగతము॥
వారిజాక్షితన వల్లభుఁజేరన్ । మారుతంద్రితను మన్ననసేయన్ ।
గోరియున్నతన కోర్కెయుదీరన్ । శౌరినెమ్మదిని సారెకునెంచున్॥
౪౮ ॥వ॥ అట్టియెడ. సీ॥ నేనున్నవిభుచెంత నెలఁతపోరాదని - యోగ

నోయనుభంగి * నినుఁదుగ్రుంకె । ముద్రలై దనుగాంచుచు* ముదితయాత్తె
అఁగన్న - కరణిసాంధ్యారాగ - కాంతిదోఁచె । సకలభూతంబులు* సత్యం
బుగను నున్న - చందంబు తారకా * బృందమొప్పె । సుజ్ఞానమను వెల్గుఁ *
జూడక విడనన్న - గతినిలఁదమమెల్ల * గప్పుగొనియెఁ॥ తే గీ॥ దరుని
యజ్ఞానతమమెల్ల* దగ్ధమనుచుఁ । దెలివియను మేటిసుజ్ఞాన* తేజమమరు।
ననుచుఁజాటినగతిఁజంద్రుఁ* డంబరమునఁ॥ జెలఁగియుదయించెఁడిమి రేభ*
సింహాసముగుచు ॥౯॥ ఉత్సాహ॥ సరసమైన హేమరత్న * సౌధమందున
ప్పుడా। సరసిజాక్షుఁడంతసార* పాన్నముల్భుజించియున్। వరసుభూషణాంబ
రాదిరవస్తుశేపవాదులున్ । గరముఁదాల్చి హంసతూలి* కంబుఁచేరియుండ
గన్ ॥౧౦॥ చ॥ అతివయు రాత్రిమంచిసమ* యంబనియెంచి భుజించిమించి
సస్మృతిఁబతిఁ జేరగాఁదలచి * మంజుసుగంధములెల్ల బూసి తా । నతు
లిత వస్త్రముల్తొడవు * లాదిగఁబెట్టి త్రిలోకమోహినీ । గతిఁబొడసూపె
నాయువతీ * కాంతునిఁజేరుట వింతదోఁపగన్॥ ౧౧॥ తామరసవృత్తము॥
కలిగొనిమోదము * కాంతకునంతన్ । దొలఁగెనుశంకయుఁ * దోఁచెను
ధైర్యం । బలరె వివేకము * భక్తిన్ ముక్తిన్ । దెలియగ ముక్తిని* దీవ్ర
మునొందెన్ ॥ ౧౨॥ సీ॥ పతిదైవమనియాత్మ * భావించుసేవించుఁ *
బూజించువందనం * బుల నొనర్చు । వరునిదక్కను నన్య * పురుషుల
గలనైన - గన్నెత్తిచూడదా* కమలనయన । ధవునకుఁబరిచర్యల* దానొ
నర్చునుగాని - సేవకులను నేరిఁ * జేయనీదు । చనువిచ్చినను భర్త * సతి
గురుత్వము భక్తిఁ - దప్పదు విభునాజ్ఞ । దాటదెపుడు ॥తే-గీ॥ రామ
రత్నంబు పట్టంపు * రాణిసుగుణి । దివ్యచారిత్ర రుక్మిణీ * దేవిమిగుల।
భక్తివెలయంగఁ జనుదెంచి * పద్మనాభు । పాదపద్మములకు మ్రొక్కి *
పల్కెనిట్లు ॥౧౩॥ ఉ॥ ఓపరమాత్మ విశ్వముఖ* యో పరమేశ్వర యోప
రాత్పరా * యోపరవస్తురూపహరి * యోదురితాంతక యోకృపాసధే।
యోపరహంస సర్వసమ * యోమునివందిత యోమహాప్రభో నాపలు
కాదరించిదయ * నన్నిఁకఁ బ్రోవుము ప్రాణనాయకా ॥౧౪॥ ఆ-వె॥
సారిదిజీవునకును * సుఖదుఃఖములు రెండు । జన్మజన్మములను * సంభ
వించు । జన్మవలననేమి* సౌఖ్యంబుగనరాదు । గానజీవుఁడెట్లు * గాంచు
ముక్తి॥ ౧౫॥ క॥ జన్మంబేలావచ్చెనొ । జన్మముఁదప్పించుకొనెడు * సాధ
నమింక నీ । జన్మమునఁగలదొ లేదో । జన్మము రోసితిని ముక్తి * సాధనకొ
అకున్ ॥౧౬॥ తే-గీ॥ ఎన్నిదినములు బ్రతికిన * నేమిఫలము । కాటికేగడ
యామాయ - కాయమరయ। చచ్చిచచ్చియుఁ బుట్టంగ* జాలక్రమములు।

తిరిగిపుట్టని మార్గంబుఁ దెలుపుమిాశ॥ ౧౭॥ క॥ వరభక్తలోకరక్షక । పరిపరివిధములను నిన్నె ప్రార్థించెదనా । మొరవిని సత్రియునిద్రోయక। కరుణించియు నాదుజన్మఁ గడతేర్పదగున్॥ ౧౮॥ క॥ అనియిట్లు వేఁడు రుక్మిణిఁ । గనియాపురుషోత్తముండు కడుమోదమునన్ । దనలోనె తారుమెచ్చుచుఁ । దనసతిమది నరయఁగోరి తానిట్లనియెన్॥ ౧౯॥ తోటకము॥ భామిని నీదగు పల్కులు, నాహా! యేమివిచిత్రము ! ఇందులకెందున్ । గామితవాంఛలుగాకనుమోక్షం। బేమిపదార్థమో - యెన్నఁగదానిన్॥ ౨౦॥ ఆ-వె॥ తరుణి నీదుచక్కఁ దనమునకీయలం। కారమునకుఁదగును కలికినాతోఁ గలసిపొమ్ముమోక్ష కాంక్షనీకే టికి।సురతకేళికంటె సుఖముగలదె॥ ౨౧॥ క॥ విను బ్రహ్మానందసుఖం । బునకంటెను హెచ్చుసుఖము భోగానందం।బని వచియించుటవినమే। వనజాసనుఁడాది దివిజ వర్గములెల్లన్॥ ౨౨॥ ఆ-వె॥ అనిననిత్యమైన యట్టి బ్రహ్మానంద । సుఖముకెనయెపోల్చి చూడమదన । కేళియల్పసు ఖము కేవలం బని యన ! నింతిఁజూచి శౌరి యిట్టులనియె॥ ౨౩॥ క॥ నీమాటలు నీతేఁటలుఁ । నీ మానసవృత్తి తెగువ నీనేర్పులునున్।నీమదికింపగుఁగాకను । నామనమున కింపుగావు నళినదళాక్షీ॥ ౨౪॥ సీ॥ కాంచన నవరత్న కలిత నిర్మితమైన - మేడలున్నవి నీకు మెలఁగుటకును । వెలలేనిభూషణవితతులున్నవిదాల్ప-కనకాంబరములాది కలవుకట్ట । లీలకు హంసతూ లిక పాన్పులున్నవి - పూయుటకు సుగంధ ములునుగలవు । అష్టభార్యలలోన నధికురాలవునీవు పట్టంపురాణివై పరఁగుచుంటి॥ తే-గీ॥ వఖలభోగంబులునుగల వనుభవింపఁ । జెలులుపెక్కండ్రుగలరు నీ సేవఁజేయఁ । గూర్మి సంతతిగల దేమి కొదువనీకుఁ । నింతకంటెను మోక్షంబ దెక్కువగునె॥ ౨౫॥ క॥ సారంబుద్రివర్గము ని । స్సారముమోక్షంబుగాఁగ సర్వజనుల్ । సారంబులేని మోక్షముఁ । గోరుటయిదివెఱ్ఱితనము కోమలినీకున్॥ ౨౬॥ క॥ జగములయందుఁ ద్రివర్గము । పొగడొందు సమస్తమునకుఁ బూర్వక్రియగా । నెగడును మోక్షమునిష్క్రియ । యగుదుండఁగఁ గ్రియగ నీకుఁ బనగుపడుటెట్లో॥ ౨౭॥ సీ॥ నావుడు నావాసు దేవుని నీక్షించి - తెలివిమై రుక్మిణీ - దేవిపల్కె । నోపుండరీకాక్ష యొప్పుగానివియెల్ల- వచ్చునపుడుమనముతెచ్చినామె । పోవునప్పుడునొక్క పుచ్చినవ కైక్కనఁ-గొంచుపోవుటయు లే దెంచిచూడ । సర్వంబుమధ్యనేసంభవంబయ్యెను - సర్వంబుమధ్యనే సమసిపోవు॥ తే-గీ॥ కలిమిలేములు

శాశ్వత ఽ ములునుగావు । నీటిపై బుగ్గ తనువును ఽ నిలువఁబోదు । అఖి
లమును మాయనిత్యమై ఽ నట్టిపదముఁ । దెలియఁగోరినదానను ఽ జలజ
నాభ॥ ౧౮॥ ఉ॥ తల్లియుఁ దండ్రియున్ గురుఁడు ఽ దైవమునీవని యెల్ల
ప్రొద్దునా।యుల్లమునందునమ్మికొనిఽ యుంటిమహాత్మదయారసంబుచేఁ ।
గల్లయునిక్కమున్ దెలిపి గ్రక్కున మోక్షము నీవెయన్యమే । నొల్లను
నీదు దివ్యపద ఽ యుగ్మముదక్కను భక్తవత్సలా॥ ౧౯॥ క॥ మీకుం దెలి
యని ధర్మము । లోకంబునఁగలదెపర్వ ఽ లోకశరణ్యా।మీకరుణఁగోరి
యుంటిని । జేకొనినను నీళ్లముంపు ఽ చేర్పుము పాలన్॥ ౨౦॥క॥ నీతుల
మీఱలెఱుంగని । రీతిని మీయెదురఁగొన్ని ఽ రిక్తవచనముల్।ఖ్యాతిగఁ
బల్కితినిప్పుడు । నాతప్పు క్షమించి దయను ఽ నన్నేలుహరీ॥ ౨౧॥
తే-గీ॥ అనిన సతిఁజూచికృష్ణుఁడా ఽ హ్లాదమొంది । సఖియలెల్లను సా
మాన్య ఽ సతులెగాని । యింతినీబుద్ధిఁజూడంగ ఽ నెంతో పెద్ద । యబల
యెవ్వరు నీవలె ఽ నడుగరిట్లు॥ ౨౩॥ ఉ॥ ఎప్పుడునాదుసన్నిధిని ఽ నిందు
నిభానన నీవునిల్చి యీ । యిప్పటియట్లు మోక్షమును ఽ నెన్నఁడుఁగో
రవుకోరియుండినన్। జెప్పమునీవుమున్నుధరఁ జేసినపుణ్యము వెంటనంటి
ని । న్నిప్పుడుపొందె నయ్యదియుఽనీకునుగల్గె నమోఘవాక్యమున్॥ ఉ॥
లోకమునందు సంపదయు ఽ లోభము లేకయ పుత్రిపుత్రులన్ । గైకొనఁ
గోరుచుండుదురు ఽ గాకలమోక్షముగోరరెవ్వరున్। నీకిటువంటి వాంఛి
తముఽనిక్కముగల్గుట చోద్యమయ్యెడిన్।ప్రాకటమైన నీవిమలఽభాగ్య
మెభాగ్యము హంసగామినీ॥ ౨౪॥ క॥ రత్నములుదినుమరాళము।రత్న
ములనెగాని తినువె ఽ రాళ్లనుగాంతా। రత్నమ నీవటుముక్తికి।యత్నిం
చినదానివితర ఽ యత్నములేకే॥ ౨౫॥ తే-గీ॥ పడఁతి నీప్రశ్నత్రైలోక్యఽ
పావనంబు । అబ్జభవునకుఁదలపోసి ఽ యడుగరాని । గోప్యమడిగితి వది
యెనా ఽ కోర్కెఫలము । నదియెనా పెద్దనిక్షేప ఽ మగుధనంబు॥ ౨౬॥
క॥ సంతతము నీవునాయెడ । నెంతయునెడతెగనిభక్తిఽనెఱపుదుగాన్।
ఇంతకు నీపైదయ నది । యెంతటిమర్మంబునైన ఽ నెఱిఁగింతుఁదగన్ ।
౨౭॥ ఉ॥ మానిని విత్తమాదిగసమస్తముకంటెను హెచ్చుప్రాణముల్
ప్రాణముకంటె నెక్కువగుఽబ్రహ్మపదంబగు జ్ఞానవిత్తమున్ । ప్రాణము
నైన నిచ్చుటకుఽప్రాణములొప్పనుగానియేరికిన్ । జ్ఞానధనంబు నిచ్చు
టకుఽసాధుజనంబులు సైప రెంతయున్॥ ౨౮॥ క॥ గురుభక్తిలేనివారికి
నెఱిఁగింపఁగఁ బోల దిట్టి ఽ నిర్మలబోధన్ । గురుభక్తి గుదిరియుండిన ।
నరునకు నుపదేశమీయ ఽ నగునార్యులకున్॥ ౨౯॥ చ॥ భువినెనరైనఁ

గారణముఁ బొందఁగఁబెద్దల నాశ్రయించిన । బ్రవిమలచూడ్కివారి
నిజ భావముశోధనఁ జేసియీదగు నవరసమొల్కుభూతలముననందు
నవేయ ఫలించుసస్యముల్ । చవిటిపొలంబు దున్నియును జల్లినవిత్తులు
పండనేర్చునే॥ ౧౦॥ ఉ॥ గారవమొప్పఁబెద్దలనఁ గా శతవృద్ధులుగారు
విద్యలన్ । మీఱినవారుగారు భువి మేటి నగంబులయంతలేసివా ।
రారయఁగారుజ్యేష్ఠకుల మందుజనించినవారుగారు నూ । ధారుణిఁద
మ్ముఁదామెగను ధన్యులెపెద్దలు నిశ్చయంబుగన్॥ ౧౧॥ ఆ-వె॥ అట్టి
వారివెదకి పట్టియనుదినము । దేవదేవుఁడంచు దెలిసిగురుని । సేవఁ
జేసియతని చిత్తంబుమెప్పించి।ముక్తిగాంచవలయు మొదలునరుఁడు॥
౧౨॥ క॥ వణితామణిమోక్షమునకు । ననువొందఁగవలయుసాధనంబు
లునాల్గున్ । మునుదెలియనగునుగావున వినిపించెద వినుమువాని విధ
మునుధరణీ॥ ౧౩॥ సీ॥ వరుస నిత్యానిత్య వస్తువివేకంబు - కలిగియుం
డుట యొండు ఘనముగాను । మాత్ర వమనవిష్ఠ ములకాసలేనట్లు-
లిహ స్వర్గభోగేచ్ఛ లేనిదొకటి । సంతతంబు శమాది షట్కమ
సంపత్తి నలువొందుచుండెడు నదియునొకటి । మోక్షంబుకొఱకు న
పేక్షించుటయు ముము - క్షుత్వమన నొకటి సరవినిట్టి॥ తే-గీ॥ సాధన
చతుష్టయంబిల సంభవించు । నరుఁడె యధికారిమోక్షంబు నకును
నట్టివాఁడట్టిశిష్యునిఁ గనిపెట్టి యాదరమున।వరదయామతి బోధించ।వల
యుగురుఁడు॥ ౧౪॥ క॥ మేధావివైన నీకును । సాధనసంపత్తిగలదు
సద్గుణములకున్ । సాధుచరిత్రవునీవీ । బోధకుఁడగు దింతివిమలబుద్ధివి
గాన॥ ౧౫॥ క॥ నాగురుఁడగు సాందీపుని । వేగమే మదినిల్పియిపుడు
వెలఁదిరొనీకున్ । నాగురుమర్మముఁజెప్పెద । బాగుగవినుమింక భక్తి
భావము మెఱయన్॥ ౧౬॥ తే-గీ॥ అవనిఁబరికించిచూడ మా నవుల
యందుఁ । దీవ్రమోక్షేచ్ఛయనియును దిరముగాను।మందమోక్షేచ్ఛ
యనియు న మరునురెండు । తెఱఁగులగుచుఁ దద్విధములఁ దెలియు
మీవు॥ ౧౭॥ సీ॥ ఇల్లుగాలుచునుండ నింటిలోనిమనుజుఁ డెంతతీవ్ర
ముబైటికేగ గోరు । ఘోరకానన మందు దారితప్పిన నరుఁ డెంత
తీవ్రము మార్గ మెఱుఁగఁగోరుఁ।బులివెంబడించిన బులివాతఁబడకుఁడ-
నెంతతీవ్రము మర్త్యుఁడేగఁగోరుఁ । బాముపైకొనిరాగఁ బాముచేఁ
జిక్కక - యెంతతీవ్రము నరుం డేగఁగోరుఁ॥ తే-గీ॥ జోరులు దఱుమఁ
జిక్కక చోరులకును।నెంతతీవ్రంబు మానవుం-డేగఁగోరు । నంత వేగం
బునను బ్రయత్నంబుఁజేయు । నదియెపో తీవ్రమోక్షేచ్ఛ యనఁగఁ

బరఁగు||౧౮|| క|| ఒకకాలంబున నిమ్మహి । నొకనికినీబాధలెల్ల నొండ
వకయున్న । న్నొకయొకనికినొకయొకతఱి । నొకయొక యాపత్తుగలిగి
యుండగవచ్చున్||౧౯|| ఆ-వె|| వనితమోక్షమునకువలయుసాధనములు।
సంఘటింపఁబడక జనుడు మోక్ష । మతులితముగఁగోరు నదియండ
మోక్షేచ్ఛ । యంచుఁదెలియవలయు హంసగమన|| ౨౦|| సీ|| తాపత్ర
యాగ్ని యా తనువుదహించుచే-యిల్లంటుకొని కాలుచుంచిచూడఁ ।
దన్నుఁదా నెఱుఁగక తనువుదానను కొంచె-దండకాటవిదారిఁ దప్పు
టయును । బోరిమనమింద్రియంబులవెంటఁ బాఱుటే - వ్యాఘ్రంబు
దఱుముక వచ్చుటయును । నరయ దుర్విషయంబులంపువర్తించుటే-
సర్పంబుగదియుట సారసాక్షి|| తే-గీ|| యెలమిఁగామాది షడ్వర్గములె
యనంగ । నలరు దొంగలుపొంచుక నావివేక । మనెడు ధనమును నప
హరింపఁ గాచు । నదియె చోరులు దఱుముట యతివ వినుము||
౨౧|| ఆ-వె|| ఇట్టిబాధలెల్ల నేకకాలంబున । సంభవించునట్టి జనుఁడు
గాని । యట్టిశ్రమలఁబాపు నట్టిసద్గురుఁజేరి । గట్టిగాను ముక్తిఁ గాంచఁ
బోఁడు||౨౨|| క|| హరియిట్లు తెల్పఁగావిని । హరిణేక్షణ పల్కెనిట్టు
లంభోజాక్షా|| పురుషార్థమెన్ని భంగులొ । యెఱిఁగింపు మటన్నఁగృష్ణు
డిట్లను సతికిన్|| ౨౩|| సీ|| గణుతింప ధర్మార్థ కామమోక్షములనఁ -
బురుషార్థములునాల్గు భువిఁజెలంగు । యాత్రదానవ్రత యజ్ఞంబులాది
స - త్కర్మములుసేయుట ధర్మమయ్యెఁ । గాయంబుమిక్కిలి కష్టించి
యుక్తిచే-నర్థంబుఁగూర్చుట యర్థమయ్యెఁ బొలఁతుల కూటంబుఁ
బుత్రులసౌఖ్యంబుఁ। గావలెనను వాంఛ కామమయ్యె|| ఆ-వె|| నీత్రి
వర్గమరసి నిత్యంబుగాదని । యచలగురునిభక్తి నాశ్రయించి । బ్రహ్మ
మెఱిఁగి జన్మ బంధంబులను బాసి । ముక్తిఁగనుట బుధులు మోక్ష
మండ్రు||౨౪|| క|| పురుషార్థంబుల నందగుఁ । బొరిఁబొరి ధర్మార్థ కామ
ములనెనుమాడున్ । బరమ పురుషార్థమనఁగను స్థిరముగ మోక్షంబె
యంచుఁ జెప్పుదు రార్యుల్||౨౫|| తే-గీ|| చెలఁగి ధర్మార్థకామముల్
జీవకోట్ల । కన్నిఁటికి నాచరింపగ నగునుగాని । మహిని మోక్షంబు
మాత్రంబు।మానవులకు । నాచరించఁగఁదగినది యరసి నూడ|| ౨౬||
క|| జన్మములకెల్ల మానవ । జన్మంబే యెఱుకగల్గు జన్మమగుటనీ।జన్మ
మునముక్తిగాంచక । జన్మముకడతేరదన్య జన్మములందున్||౨౭|| క||
జన్మంబురోసియుఁకనే । జన్మంబునురాకమున్నె జనుఁడుపరమునన్ ।
దన్మయమందిన మఱలను । జన్మంబులు లేక జన్మ సాఫల్యమగున్||౨౮||

క॥ నరజన్మమెత్తినందుకు । నరగున మోక్షంబుగనుకొ * సార్థకమ్మయ్యెన్ ।
మఱియితరజన్మములలోఁ । బరమరయఁగ దెల్వి లేక * ప్రచురించుటచేన్॥
చ॥ గరిమసమస్తజీవతతి * కంటెను మానవుఁ డెక్కుడందురన్ । గరితలు
గాను బుట్టుటల * కంటెను బూరుషజన్మ మెక్కుడౌఁ । బురుషులయందు
శాస్త్రపరి * బోధనపండితుఁ డెక్కుడందురన్ । మఱినతిగోప్యమైన పర *
మార్థ మెఱింగిన ధన్యులుత్తముల్॥౧౦౦॥ ఆ-వె॥ పరమగురునికరుణం *
బడసిన సతులైనఁ । బురుషులైన షండ * పురుషులైన । మాచకమ్మలైన *
మంచులు చండాలు । రైన ముక్తిఁగందు * రంధులైన॥ ౧౦౧॥ చ॥ తను
వుపటుత్వముఁ వదలి * తాతయునై వెతగాకమున్నుగా । ఘనకఫవాతపై
త్యములు * గప్పి మతిభ్రమరాకమున్నుగాఁ । జనివడి కాలకింకరులు *
పైఁబడి తన్గొని పోకమున్నుగాఁ । గనఁదగు నాపరాత్పరునిఁ * గాయముఁ
బాయకయున్న యంతలోన్॥ ౧౦౨॥ ఆ-వె॥ సతుల సుతుల హితుల *
సంపదఁజుట్టాల । నమ్మి తన్నుఁదాను * నరయలేక । భ్రాంతినొందువాని *
బ్రదుకెల్లను బిసిని । కాయలోనిపురుగు * గతిదలంప॥ ౧౦౩॥ ఉ॥ గట్టిగ
మోక్ష కాంక్షయును * గల్గనె గల్గదు భూమి నేరికిన్ । అట్టి విచారమెవ్వ
నికి * నైననొకానొక వేళఁగల్గినన్ । గట్టడి నేఁడు రేపనుచుఁ * గాలముఁ
బుచ్చునుగాని ముక్తిచే । పట్టఁడు బ్రహ్మకల్పములు * పాయక తా నిల
నుండునట్లుగన్॥ ౧౦౪॥ క॥ మంచివచనములు విషమగు । మించినకో
పంబువచ్చు * మిక్కిలిపగసా । ధించెదరు బుధులపల్కులు । మంచివి
యని తెలియలేరు * మందాత్ములొగిన్॥ ౧౦౫॥ సీ॥ కప్పకు నిలఁగల *
కమలతేనియ యేల - పందికిఁ బన్నీరు * గంధమేల । షండునకును మంచి *
సౌందర్యవతియేల - నంధునకు మెఱుఁగు * టద్దమేల । కుక్కకు వపరంజి *
కుళ్లాయియేలకోఁ - తికిని ముత్యాల ప * తకము నేల । కోమరొప్పఁ బిడు
దుకు * గోక్షీరమదియేల - పేదపురుగునకు * బెల్లమేల॥ తే-గీ॥ చెవిటి
వానికి మృదుగాన * చవుల వేల । రూఢిఖరమునకు నమృత * రుచుల వేల।
తివిరి గాడిదకును దివ్య * తీర్థమేల । మంకుజనులకు నిజమోక్ష * మార్గ
మేల॥ ౧౦౬॥ ఆ-వె॥ జంబుకమున కేల * స్వర్గలోకంబును । గలయరత్న
ములుపికికంబు కేల । మాచకమ్మ కేల * మదనశాస్త్రంబును । మందమ
తుల కేల * మంచిబోధ॥ ఉ॥ చోరజనంబులం దెఱినిఁ * జోరుల చందము
గందు రెంతయున్ । జారులు సెల్లవారలను * జారులకై వడిఁ జూతురెన్నఁ
గాఁ । గ్రూరులు సర్వమానవులఁ * గ్రూరులరీతిని సెంతురట్టులే। నారకుఁ
గాంతురజ్ఞులును * సద్గురులన్ దమవంటివారుగన్॥ ౧౦౭॥ సీ॥ మాటసే

ర్చినవాని * బూటకుండనియంద్రు - మాటలాడకయున్న * మందుఁడంద్రు।
సతులతో భాషింప * జారపురుషుఁడంద్రు - జారుండుకాకున్న * షండు
డంద్రు । వన్నెవల్కలుగట్ట * బలుహొయల్ గాఁడంద్రు - గుడ్డమాసిన
వాని * మడ్డియందు । రరయఁజక్కనివాని * నంనగాఁడందురు - రూపి
గాకున్నఁగు * రూపిఁయంద్రు॥ తే-గీ॥ కల్లనిజమంద్రు నిజమును * గల్ల
యందు । రిట్లునరులకు సహజంబు * లట్లుగాన । సర్వజనులకు నిలలోన *
సమ్మతముగ । నడువలేరెంతసాధులు * నైనజగతి॥ ౧౦౯॥ చ॥ జనముల
కెల్లలోకమున * సమ్మతిగానడువంగఁగోరిదా । నెనయఁగనెల్లవారిమది *
కింపుఘటింపఁగఁబోవనెంచువాఁ। డనువుగవెండినెవ్వరిని * హర్షమునొం
దఁగజేయలేకతాఁ । జెనఁటి యనంగ నన్నిటికిఁ * జేటువహించినబుద్ధి
హీనుడై॥ ౧౧౦॥ ఉ॥ మంచిగుణంబులేమికిని * మంచినిఁజెడ్డగఁజెడ్డమం
చిగా । నెంచుచునుంద్రులోకమున * నెంచిననేమగుఁజెడ్డఁజెడ్డయే ।
మంచియు మంచియేయగును * మానినియిత్తడికాంచనంబుగా । నెంచిన
నౌనెహేమమును * నిత్తడిగాఁగన నౌనెయట్టులన్॥ ౧౧౧॥ ఆ-వె॥ పేడ
బెల్లమనిన * బెల్లంబుగాఁబోదు । పేడయన్నగుడము * పేడగాదు। పేడ
పేడె యగును బెల్లంబుబెల్లమే।జ్ఞానిజ్ఞానె మూఢ * జనుఁడుజనుఁడె॥౧౧౨॥
క॥ జ్ఞానులనుజూచి యిలన।జ్ఞానులదెగడుదురుబుద్ధి * జాడ్యతదిగువన్ ।
శ్వానములకోట్లుమొఱిగిన । నేనుఁగుపైనున్నవాని * కేమిభయమికన్ ।
౧౧౩॥ సీ॥ ఘనునినీచుండన్నఁ * గాఁబోడు నీచుండు । ఘనుఁడన్న
నీచుండు * ఘనుడుగాడు । అంచను బకమన్నఁ * గొంచకానేరదు-గొంచ
నంచ యనఁగ * నంచగాదు । అవనిభూషణదూషణాదిత్రిరస్కారముల
రయఁగాదేహ * మునకుఁగాని । యాత్మకులేవురూ * పాతీతమైనామ-గుణ
వర్జితంబయి * కుదురకతన॥ తే-గీ॥ నెవ్వరేమన్ననాత్మకు * నేమికొదువ ।
పరులుభూషింపలేనట్టి * వాసిగాదు । పరులుదూషింపహెచ్చైన * వన్నె
చెడదు । ధరణినొందరు మోదఖే * దములుబుధులు॥ ౧౧౪॥ క॥ ఎవరే
పల్కులుపల్కిన । నవిసాధులువినియు వినని * యట్టులఁదామీ।భువిని
నటింతురువారలు । భవనాశస్థితులులేని * భావనులగుటన్॥ఆ-వె॥ తెరవ
మానవులకుఁ * ద్రికరణశుద్ధిలే । నట్టికతనమాయ * నమ్మివివిధ । గతు
లపెక్కునమ్మ * కంబులుచెప్పిన । నమ్మతేరు నిజము * నళిననేత్ర॥౧౧౫॥
ఉ॥ చచ్చినవారె ధన్యులని * చాలనుతింతురు లోకమందునన్।జచ్చిన
వారలున్మగుడ * జన్మకురాక యె యున్నధన్యులే । చచ్చియునెప్పటట్టు
లనె * జన్మములెత్తుదు రట్లుగావునన్ । జచ్చియుఁజావకుండియును।సౌఖ్య

ము లేదిఁక ము క్తిగాన కే॥౧౧౭॥ ఆ-వె॥ గురునిఁ జేరగల్గి * గు ర్తుగాఁబర
మును దెలియఁగల్గినొప్ప * తెలివిగల్గి। మొనసిమృగములట్లు*మూఢులై
మిన్నక। చెడుదు రల్పమతులు * సిద్ధముగను॥౧౧౮॥ క॥ విహగములు
మింటి కెగయుట। సహజంబగునేలదూరఁ * జాలవటువలెన్ ॥ బహువి
ధమాయలఁబొందుట। సహజముమూఢులకుము క్తిసాధ్యంబగునే॥౧౧౯॥
సీ॥ అర్థంబు భూములు। నార్జించఁగాదీఱు - ఘనమందిరంబులు * గట్టఁ
దీఱు। సతులతో భోగింపసౌఖ్యమొందఁగఁదీఱు। సుతుల వేడుక లెల్ల *
జూడఁదీఱుఁ। బుట్టుముచ్చటలను - బ్రొద్దుపుచ్చఁగఁదీఱుఁ। దిరముగాఁ
బొరుగిండ్లు * దిఱుగఁదీఱుఁ। గార్యంబుఁ బెంచుచు*గలహమాడఁగఁదీఱుఁ।
జెలువుగాఁబరుల దూషింపదీఱు॥ తే-గీ॥ కోరినిచాత్ములను నెల్లఁ * గొల్వఁ
దీఱు। మందమతులగు నీదుష్ట * మానవులకుఁ। బవలురాత్రియుఁదీఱదు *
పరమగురుని। చెంత జేరఁగఁబరమార్థ * చింతఁ జేయ॥ ౧౨౦॥ చ॥ భరిత
తటాకనీరములు * పానముఁ జేయక వాయసాదులున్ । మఱిగిన కుంభ
తోయములు * మోదమురంజిల గ్రోలుకై వడిన్ । నరులును జన్మకర్మ
ములు * నాశమొనర్చెడి ము క్తిపీడియున్ । బరిబర్ధి నీచమార్గములఁబట్టి
నటింతురు క ర్మతంత్రులై॥ ౧౨౧॥ తే-గీ॥ మనుజులందఱు నొకలోక *
మం దేయున్న। నొకరిలోకంబులో నెన్న నొకరుగల్గ। రెవరిలోకంబువా
రిదే * యెంచిచూడ। నొక్కలోకంబులోనుండు * నోపరెవరు॥౧౨౨॥
క॥ చోరులకుఁ జోరచింతయు। జారులకును జారచింత * జగతీశులకున్।
బోరాటంబులచింతయు। సార వివేకులకుఁ గల్గు * సద్గతిచింతల్॥౧౨౩॥
చ॥ కమలమునందుఁ దేనియకుఁ * గా బహుదూరముపోయి గ్రోలు నా।
భ్రమరమునట్లుబోధగను * ప్రాజ్ఞుఁడు తా గురుఁడెందునుండినన్ । కమ
లముమీఁదఁగప్పయును * గల్గిమరందముగాననట్టు లా । కుమతులెఱుం
గలేరు పర * గోప్యము సద్గురు చెంతనుండియున్॥ ౧౨౪॥ ఆ-వె॥ గురు
నిమహిమ దెలియు * గురు భ క్తునకుఁగాక। యితర జనులకెల్ల * నేమి
యెఱుక। తేనె తెరలజాడఁ * దేనెటీగకుఁగాక। యితరమక్షికాళి *
కెఱుకపడునె॥ ౧౨౫॥ క॥ మెఱుఁగైనయద్ద మంధుని। కరమునఁదాల్చి
యును మోము * గనలేనట్లా। గురుఁడు తమయొద్దనుండియు। గురుమ
ర్మము దెలియలేరు। గ్రుడ్డిజనంబుల్॥ ౧౨౬॥ ఆ-వె॥ కడఁగిదర్పణంబె *
గానని యంధుండు। తనదు వదనమెట్లు * గనఁగనేర్చు। గురునిఁగానలేని *
గ్రుడ్డివాఁడిలలోనఁ। బరముగాంచుటెట్లు * పంకజాక్షి॥ ౧౨౭॥ క॥ అద్ద
ముపాడఁగను వానికి। నద్దంబున వానిరూప * మగుపడు విధమా। పెద్ద

లఁబొడఁగనినప్పుడె। తద్దయుఁబరమార్థమతఁడు*తప్పక గాంచున్॥ ౧౨౮॥
క॥ అనసద్గురుని ప్రభావం। బన నెట్టిదొ దెల్పుమనిన*బడఁతికినిదయా।
వనధియగు నందనందను। డును జెప్పఁదొడంగె నిట్టు*లున్నవిధంబున్॥
౧౨౯॥ క॥ గురుఁడనగాఁ బరుడనఁదగుఁ। బరుఁడనగాఁ గేవలాత్మ*
పరిపూర్ణుఁడగున్। బరిపూర్ణుఁడె గురుఁడగు న। గ్గురుతెఱిఁగినవాఁడె
జగతి* గురుఁడగుఁదరుణీ॥ ౧౩౦॥ క॥ పరుడగు నాభగవంతుని। వరు
సఁదెలుపునతఁడె సుగురు* నరుడెవఁడైనన్ గుఱిదెల్ప నేరకుండిన।
గురుఁడెట్లగువాఁడు పశువు* కుంభినిలోనన్॥ ౧౩౧॥ ఆ-వె॥ తల్లిదండ్రి
గురుఁడు* దైవంబనుటచేతఁ। దల్లిబిడ్డకెట్లు* తండ్రిఁజూపు। నట్లుగు
రుఁడె శిష్యు* నకుదైవమును జూప। వలయుఁజుమ్మియట్టి* వాఁడెగు
రుఁడు॥ ౧౩౨॥ క॥ గురుఁడే యజహరి రుద్రులు। గురుఁడేయింద్రుండు
దివిజ* కుముదాప్తరవుల్। గురుఁడే సర్వమయుండగు। గురునకునితరం
బులేదు* కోరివెదకినన్॥ ౧౩౩॥ క॥ పరమాత్మ నెఱుగఁజేసిన। గురుఁ
డేభగవంతుఁడిలను* గుర్తెఱిఁగిన యా। గురుఁడే యిహపరములకును।
గురుఁడగు నాగురుఁడె గురుఁడు* గురువులకెల్లన్॥ ౧౩౪॥ క॥ గురుమ
హిమదెలియనెవ్వరి। తరమగు దేవతలకైన* దలఁపఁగవశమా। హరి
హర ధాతలునాదిగ। గురుపదమే గతియటంచుఁ* గొల్తురనిశమున్॥
౧౩౫॥ తే-గీ॥ మఱి గురువర్ణంబు మొదలింటి* మాయదాని। నడఁచున
ట్టిదయ గురు వ* ర్ణంబుగాన॥ నరయ గురు శబ్దమీభువనంబులకును।
మించినది గురుమహిమచు* నెంచవశమె॥ ౧౩౬॥ క॥ నరుఁడెట్లుగురుఁ
డగునని। గురుమర్మము దెలియలేక* కూయు కుమతులా। నరులకుఁదె
ల్పునె పశువులు। నరయంగాఁ దెల్పకున్న* నరుఁడేగురుఁడా॥ ౧౩౭॥
తే-గీ॥ నరుఁడుగురుఁ డెటులగునని* యనిన వినుము। నరకులంబుఁ
బుట్టిన* నరుఁడు లెస్స। గురుకులంబున మెలఁగిన* గురుఁడెయగును। అన్య
జాతికీటం బళి*యైనయట్లు॥ ౧౩౮॥ క॥ ధరణిసమస్తముకంటెను। గురుఁ
డధికుడు స్మరణకంటె* గుఱియధికంబౌ॥ గుఱికంటె మిగులుముక్తియుఁ।
బరికింపగ ముక్తికంటె* భక్తిఘనంబౌ॥ ౧౩౯॥ క॥ ముక్తికి మూలము
భక్తియు। భక్తికిమూలంబు ముక్తి* బ్రహ్మాదులకున్। ముక్తికిగురుఁడే
మూలము। భక్తియె లేకున్నముక్తి* పడయఁగవశమే॥ ౧౪౦॥ చ॥ సుర
మునియక్షకింపురుష* సోమ దివాకర మూర్తులింద్రుడున్। గరుడభు
జంగదిక్పతుల* కల్మషదానవ సిద్ధసాధ్యకి। న్నరవర రాజమంత్రు
లును* నాదిసమస్త జనాళికి యిలన్। బరమ పవిత్రమైనదియు* భక్తి

యగాదె తరింపఁజేయఁగన్ ॥ ౧౪౧॥ క॥ గురుమహిమ యిట్టిదనుచును। గుఱు తెలుఁగఁగ లేకమాయకొకూపములోనన్। జొరనయ్యెనరులుసద్గురు। మఱుగెఱుఁగకయున్న ముక్తికొ మార్గముగలదే॥౧౪౨॥ఆ-వె॥నిక్కమైన గురుడు । చిక్కుటకష్టంబు । టక్కుగురులకెందు కొ లెక్కలేదు । అరయ కాంచనంబు । నరుదులోకంబునఁ । గల్లపసిడిలేదె కొకొల్లగాను॥ ౧౪౩॥ తే-గీ॥ వసుధదైవంబుఁజూపిన కొ వాఁడెగురుడు । గనినయాతండె శిష్యుండు కొ గడఁకతోడఁ । బరముఁజూపింపకయెగాడుకొపరమగురుఁడు। చూడకయెగాఁడు శిష్యుండు కొ సుస్థిరముగ॥ ౧౪౪॥ చ॥ సరసుల చెంతఁ జేరినను కొ సాధు గుణంబులువచ్చు నేరికిన్ । దురితజనాళిసఖ్యమునకొదుష్ట గుణంబులుగల్గు నెట్లన । న్నిరవుగ వర్షబిందువులు కొ నిల్చిన రేగడనీరు త్రియ్యనా । సరసిజనేత్రచౌటఁబడికొచవ్వలు నువ్వులుగావె యిమ్మహిన్॥ ౧౪౫॥ ఆ-వె॥ సలిలతైలచేల కొ ములకు సుగంధసూ।నముల చెల్మితావికొ నవివహించు । సరణిసూరిజనుల కొ సాంగత్యమున వచ్చు । సద్గుణములు మూఢ కొ జనులకైన॥ ౧౪౬॥ క॥ ఖ్యాతిగ సద్గురుజేరియు। జ్యోతినిఁగవ లేక బాహ్య కొ చోద్యంబులచేఁ । గోఁతులవలెఁ జరియించెడి । పాతకు లకు నెట్లుగల్గు కొ భవ్యగుణంబుల్॥ ౧౪౭॥ క॥ అని తెల్పగురుమహా త్మ్యము । వినియద్భుతమంది బ్రహ్మకొవిద్యయనంగా । వినియుండ నెట్టి దోయది । వినిపింపు మటన్నసతికి కొ విభుఁడిట్లనియెన్॥ ౧౪౮॥ ఆ-వె॥ అబల బ్రహ్మవిద్య కొ యనఁగ వేఱొక్కటే । బ్రహ్మనెఱుఁగునదియెకొబ్రహ్మ విద్య । యదియ సర్వకర్మ కొ లడుగంటగాఁజేయు । జన్మబంధములను కొ సమయఁజేయు॥ ౧౪౯॥ క॥ విద్యలకెల్లను మొదలిటి । విద్యయు భావింప బ్రహ్మవికొద్యయె యఁకనే । విద్యలు దానికిసమమగు । విద్యల నరయంగ లేవు కొ విశ్వములోనన్॥ ౧౫౦॥ ఆ-వె॥ బ్రహ్మపదముదెలియఁ కొ బడు విద్యయదిగాన । బ్రహ్మవిద్యయంచుఁ కొ బలుకఁబడియె । నట్టివిద్యగురునికొ యనుమతివడసిన । యతఁడె బ్రహ్మవేత్త కొ యనఁగనొప్పు॥ ౧౫౧॥ క॥ అఱువది నాలుగు విద్యలు । వరుసగ మద్గురునివలనఁ కొ బడసితినేనున్। మఱియావిద్యలచేతను బరమార్థముఁబడయ రాదుకొపరికింపంగన్॥౧౫౨॥ క॥ ధర నావిద్యలనేర్చిన । నరులకు నెటువంటిపనులు । నగుఁగావుననా। గిరినొక్క వ్రేలనెత్తితి । విరివిగనేనింకవట్టికొవిద్యలగాదే॥ ౧౫౩॥ తే-గీ॥ అట్టివిద్యలచేఁ గాదె కొ యరయఁబదియు । నాఱువేలగు గోపిక కొ లంద ఱికిని ॥ నన్నిరూపులఁ దోఁచితి కొ నాకునింక । సాధ్యమునుగాని పను లెవ్వి కొ జగతి లేవు॥ ౧౫౪॥ క॥ కలయే విద్యలు సర్వము । కలయే

యెంతంత పనులు ƺ గావించిననా । కలఁబాయఁ ద్రోయనట్టిది ॥ గల
యంగా బ్రహ్మవిద్య ƺ గాంచఁగవలయుఁ॥ ౧౫౫॥ తే-గీ॥ బ్రహ్మ సూ
త్రంబుగాన నా ƺ బ్రహ్మవిద్య । సాధ్యమునుగాక విడిచిరిƺసర్వజనులు ।
సకల కార్యంబులును జేయƺ శక్తియున్నఁ। బడయరాదది మర్మంబు ƺ
బ్రహ్మ విద్య॥ ౧౫౬॥ క॥ సురపతికి వాణిపతికిని । సిరిపతికిం గౌరి
పతికి ƺ సిద్ధపతులకుఁ । ధరణీపతులకు మించిన । దరయంగా బ్రహ్మ
విద్య ƺ యగుసుమ్మ గాక్షీ॥ ౧౫౭॥ తే-గీ॥ వివిధకార్యంబులును జేయు ƺ
వేళనరులు । బ్రహ్మవిద్యయె యిదియని ƺ పల్కుటరయఁ । బరƺగనీపను
లివియెంత ƺ బ్రహ్మవిద్య । నాచరింపగ రాదను ƺ నర్థమయ్యె॥ ౧౫౮॥
క॥ కోటికి విద్యలు నేర్చినఁ । గూటికె సరిపోయె బ్రతుకుƺకుంభినిలోనా ।
నాటకధారునిఁ గన్గొను । పాటియదే । బ్రహ్మవిద్యƺవడయంగఁదగుఁ॥
౧౫౯॥ క॥ పట్టినను బ్రహ్మవిద్యయె । పట్టఁగవలెఁగానియితర ƺ పామర
విద్యల్ । పట్టుపడి మరల మరలను । బుట్టియుఁ జావంగ నేల ƺ బూటక
మాయఁ॥ ౧౬౦॥ తే-గీ॥ కాననా బ్రహ్మవిద్యను ƺ గాంచుటకును।సర్వ
కాలంబు గురుసేవ ƺ సల్పునట్టి । ధన్యులకుఁ గాక యన్యుల ƺ తరమె
తెలియఁ । గష్ట సాధ్యమా నావిద్య ƺ ఘనులకైన॥ ౧౬౧॥ ఉ॥ చక్కఁ
గనిల్చి ధీరతను ƺ సద్గురుబోధను నాయుధంబుచేఁ । గుక్కనుజంపిసూక
రము ƺ గూల్చి మదేభము గెంటిముప్పుర।న్నుక్కడఁగించి శత్రువుల ƺ
నోపిక నార్వురఁద్రుంచిమాయలన్ । జిక్కక మేటిబ్రహ్మమునుƺ జెంది
నవారికిఁ గల్గుమోక్షముఁ। ౧౬౨॥ ఆ-వె॥ తాపత్రయములఁ ƺ తల్లడి
ల్లుచు నీవ । ణత్రయముల వాస ƺ నాత్రయాది । బద్ధులగుచు నరులుƺ
బడలుత్రయావస్థ । లోనజిక్కి మాయƺగానలేరు॥ ౧౬౩॥ చ॥ తనువుల
నెంత పెంచినను ƺ దప్పదు మృత్యువు వచ్చునెప్పుడో । పనుపడఁగుక్క
నక్కలకుఁ ƺ బాల్పడు మేనులమ్మ యిమ్మహిన్ । మనుజులు మాయలం
బడుట ƺ మక్షికముల్ మధుకాంక్షఁబోయి యం । దెనయఁగఁజొచ్చియు
న్వెడల ƺ నేరక చిక్కిన చందమౌఁ దుదన్॥ ౧౬౪॥ సీ॥ సకల యజ్ఞ
ములాది ƺ సతతంబుఁ జేయుట – నఖిల విద్యలునేర్చి ƺ యధికుఁడౌట ।
భూమిఁబండించుట ƺ భూచక్ర మేలుట – కొలువుండుటకు పొట్టకూటికొ
అకె । గాని ముక్తికిఁగాదుƺఘనముగా బహురీతిఁ – గడగండ్లుపడ నేల ƺ
కడుపుకొఱకుఁ । గ్రిమిమృగ పశుపక్షి ƺ కీటకాదులనెల్లఁ – జెలఁగి
యేయత్నముల్ ƺ నేసిబ్రతుకుఁ । గాన వాంఛింపకయెƺతృప్తిగల్గుఁగు
నంచు । గట్టిగాఁ దెలిసి పరంబు ƺ గానకున్న । నితర జీవులకంటెను ƺ

నెన్నఁదరుఁడు । నధముఁడెకాని పరికింప నధికుఁడగునె॥ ౧౬౫॥ ఉ॥
తల్లులు దండ్రులాప్తులును దారసుతాదులు బంధుసోదరుల్ । కల్లగు నేరి
కెవ్వరికి గారడి మాయ యటంచు రందఱుఁ । గల్లని యన్నమాత్ర
మున గారడిమాయయు లీడఁబోవునే । కల్లనిజంబెఱుంగక యెగంధ
గజేంద్ర సమానగామినీ॥ ౧౬౬॥ క॥ అనినఁ ద్రిమూర్తులె దైవము ।
లని వారల నామజపము లను ప్రతిమారా । ధనలునైన ర్తరు ఫలమే।
మని యడిగిన సతికిఁగంస హరుఁడిట్లనియెఁ॥ ౧౬౭॥ తే-గీ॥ దైవమొ

—: దైవలక్షణము. :—

క్కండె యనుమాట ధాత్రిలోన । సహజముగఁ బల్కుదురు సర్వ
జనులు నతఁడు । నెందు నున్నాఁడొ యెవ్వరు నెఱుఁగలేరు । అతనిఁ
గానకజగమెల్లనంధులైరి॥ ౧౬౮॥ చ॥ విరివిగ బ్రహ్మదైవమని విష్ణు
నియల్లని యీశ్వరుండునా । హరిహాయుఁడంచు విఘ్నపతి యంచుఁ
జెహోవయటంచు భూతముల్ । తరణి సుధాకరాద్యనల తారలశక్తుల
నాది గొల్తురి । తెఱఁగున నంతకంటె మును దేవుండులేకయే వీరుపు
ట్టిరే॥ ౧౬౯॥ క॥ శ్రీవనితయంచుఁ గొండఱు।భావింతురు వాణియంచుఁ
బలువురు గౌరీ । దేవియని కొండఱిట్లుగ । వేవేల విధంబులాత్మవిధము
దెలియకఁ॥ ౧౭౦॥ ఉ॥ పట్టుగమూడుమూర్తులను భాను నిశాకర దేవ
దైత్యులఁ । దిట్టతసాగరంబులును దిక్పతు లెల్లయుఁదారలుఁ గిరుల్ ।
నెట్టనఁబంచభూతములు నింద్రుఁడె హోవయు నెల్లలోకముల్ । పుట్టక
ముఁ గలందునుమి పుట్టును గిట్టును లేనిదైవముఁ॥౧౭౧॥ సీ॥ అజఁడుదై
వంబని యనుటమాత్రమెగాని – వానికి జన్మరూ పములుగలవు ।
విష్ణుదైవంబని వివరించుటేగాని – వానికి జన్మరూ పములుగలవు ।
శివుఁడుదైవంబని చింతసేయుటె గాని వానికి జన్మరూ పములు
గలవు । మఱియు నింద్రునిదైవ మని వచించుటెగాని–వానికిజన్మరూ
పములుగలవు॥ ౧౭౨॥ తే-గీ॥ దలఁపఁగాను మీనాద్యవతారములును ।
దైవములన జన్మము లవ తారములకుఁ । గలవగుట జన్మరూపముల్
గల్గినట్టి । వార లెవ్వరుగారు దై వములు జగతి॥౧౭౩॥ వి॥ చ॥ పరఁగ
నెహోవయాదిఁజను పండొకటిం దినకన్నఁదిన్నచో । సరగున నాతనిన్న
తడు సంతతి పాపులుగా శపించుటఁ । నరకమునుండి సద్వ్రతునివక్రమ
వర్తికి మోక్షమిచ్చుట నరయఁగదైవ మెట్లగును నాతఁడు మేనువహిం
చియుండఁగఁ॥౧౭౪॥ చ॥ వరుసగనల్ల వేదములు వ్రాసిమహాత్ముదు
కిమ్మటంచుఁదా।నిరవుగ దేవదూతలకు నిచ్చినభంబుననుండిపంపుటఁ।

ధరణిని లేక యుండుటను § దైవము తా నెటులయ్యె నాతఁడుర్ | దిరముగ
నింద్రియంబులును § దేహము గల్గిన వాఁడె చూడఁగన్ ‖ ౧౭౩‖ ఆ-వె‖
ఏమి లేనివాని § కేమియు లేదు సం | కల్పమున్న యపుడె § గల్గు మనము |
మనము గల్గినపుడె § మఱి యింద్రియములుండు | నింద్రియంబులున్న § నెగ
డుఁదనువు‖ ౧౭౪‖ క‖ తను వెపుడు గలిగియున్నదో | జనియించిన వాఁడె
యతఁడు § చావును బొందున్ | జననాది మరణముల చే | తను బరఁగిన
వాఁడు నెట్లు § దైవంబు నగున్ ‖ ౧౭౫‖ ఉ‖ గట్టిగ సర్వజీవులును § గర్మ
వశంబున జన్మమొందఁగాఁ | బుట్టినవాని దేవుఁడని § బుద్ధిదలంచుట
ధర్మమార్గమే | పుట్టిన దెల్ల మాయ యగుఁ § బుట్టనిగిట్టని వాఁడు దేవుఁడౌ |
నట్టివిధంబు గానకను § నందఱు గ్రుంకిరి మాయ వారధిన్ ‖ ౧౭౬‖ తే-గీ‖
దైవ మెవ్వండొ వానినే § దలఁచవలయుఁ గాని వారల భావింపఁ § గారెవ
రును | వెలయఁ దమ తండ్రి యుండఁగ § వేఱెయొకనిఁ | దండ్రి మాఱుగ
భావింప § దండ్రి యగునె‖ ౧౭౭‖ క‖ శ్రీవిభుని నజుని శంభుని | దేవేంద్రుని
దేవతలను § దేవుల టంచున్ | భావింప నేల తమలో | దేవుఁడు వెలుగొందుచుం
డ § దివనిశి యనకన్ ‖ ౧౭౮‖ క‖ ఎందునఁ జూచిన దేవుఁడు | సందేహము లేక
యుండ § సర్వమయుండై | యెందో కలఁడని వెదకెడి | మందాత్ములకె
ట్లుముక్తి § మార్గము గల్గున్ ‖ ౧౭౯‖ క‖ గురుమూర్తి కరుణ లేకయె |
పరతత్త్వముఁ గాంచరాదు § బ్రహ్మకునైనన్ | నరులెంత వారలైనను దర
మగునే తమకుఁ దామే § దర్శింపంగన్ ‖ ౧౮౦‖ క‖ రామా యని శివశివ
యని | వేమాఱులు నోట గొణఁగి § విపరీతముగా | నేమి ఘటించిరి
యాత్మా | రామునిఁ గనుఁగొనక ముక్తి § రాదు తలంపన్ ‖ ౧౮౧‖ ఆ-వె‖
అన్న విన్న మనిన § నాఁకలి దీరదుఁ | తినినఁ గాని కుత్తు § దీఱిపోదు ‖
కాశి కాశి యనినఁ § గాశికిఁ బోరాదు | దీప మన్న వెలుఁగు § రూపు గాదు |
౧౮౨‖ సీ‖ కూడు నీళ్ళంటని § వాఁడు దేవుడంద్రు-ప్రీతినై వేద్యముల్ §
పెట్టు టెట్లు | దివ్యాన్నములు పెట్టఁ § దినునె యా దేవుండు § దినకున్నఁ
బెట్టినా § దిప్పలేమి | తమకుఁ బెట్టెడువాఁడు § దైవమే యందురు-తాము
పెట్టుట యెట్లు § దైవమునకుఁ | దామ్ర మృణ్మయ లోహ § దారు పాషా
ణాది-ప్రతిమల సేవింప § ఫలము గలదె | బయలు గానక నీరీతిఁ § బ్రజలు
సేయు | చిత్రముల నెల్ల మర్కట § చేష్టలనుచు | నింతయును మాని § నిజ
గురుచెంతఁ జేరి | పరముఁ గాంచిన మోక్షంబుఁ § బడయవచ్చు ‖ ౧౮౩‖
ఆ-వె‖ దైవమునకు బదులు § దారులోహశిలాది | తతులఁ బెట్టికొల్వ §
దైవమగునె | పసిఁడికి త్తడినుము § బదులుగాఁ బెట్టినఁ | బసిఁడి యగునె

వట్టి ✤ భ్రాంతిగాక॥ ౧౭౮॥ సీ॥ అయమాత్మ బ్రహ్మమహా ✤ నను వేద
వచనంబు-గలిగియున్నట్టియా ✤ కారణమునఁ। బ్రతిమార్చనముకంటెఁ ✤
బరఁగనాత్మారాధ - నము విశేషంబగు ✤ నట్లుగాన । నాత్మ రూపం
బున ✤ నఖిల దేహములందు - భగవంతుఁడేయుండి । ప్రబలుకతనఁ ।
దలఁపంగనాత్మ సం ✤ తర్పణంబేపర - మాత్మ సంతర్పణం ✤ బగును
గాన॥ తే-గీ॥ నరులచేఁ గల్పితంబునౌ ✤ నాత్మలేని । ప్రతిమ లర్చించి
సంతుష్టి ✤ పఱచుటెట్లు । లిష్టఫలములు తమకివి ✤ యిచ్చుటెట్లు। నరుల
చేష్టలు దలపోయ ✤ నవ్వుబాట్లు॥ ౧౭౮॥ ఏ॥ సీ॥ జ్ఞానమార్గమెఱుంగ ✤
జాలని జడులచేఁ-బ్రతిమార్చనంబులు ✤ ప్రబలమాయె । జ్ఞానంబుగురు
నిచేఁ ✤ గాంచినధన్యులు - ప్రతిమలారాధింపఁ ✤ బరఁగరెవుడు ।
మూఢులై ప్రతిమలఁ ✤ బూజించుటేగాని - చెప్పనే మోక్ష సం ✤ సిద్ధి
తెరువు । విశ్వంబులోనాత్మ ✤ వేత్తనుసేవించి-పూజించిసాష్టాంగ ✤ ములు
నొనర్ప॥ తే-గీ॥ సాంఖ్యమును దారకామన ✤ స్కములఁదెల్పి । జ్ఞాన
మార్గం బెఱిఁగించి ✤ కడకు నచల । భావమెంతయు సూచించి ✤ ప్రజల
మోక్ష । గతినిఁజెందఁగఁజేయును ✤ గాక గురుఁడు॥ ౧౭౮॥ ౭॥ ఉ॥ తేఁకువ
సర్వమేనులకు ✤ దేవుఁడె తారక మాచు నెప్పుడు । స్నేక మయాత్మరూప
మున ✤ నెందునజూచిన నందెయుండఁగా । లోకులు వేఱు భ్రాంతినవ ✤ లోక
నసేతురువానిఁగానకే । మేఁకనుజంకఁబెట్టుకొని ✤ మేదినినారయు గొల్ల
చందమై॥ ౧౭౯॥ సీ॥ తామున్నచోటను ✤ దైవంబు లేదని-పామర జను
లుర్వి ✤ భ్రాంతులగుచు । శ్రీరంగమునుగాశి ✤ చిత్రకూటముసేతు - మేటి
తిరుపతులు రామేశ్వరంబు । కంచి తిరువళ్లూరు ✤ గయప్రయాగలు
జగ - న్నాథంబు భద్రాద్రి ✤ యాదిగాఁగఁ ✤ గల స్థలంబులకెల్ల ✤ వల
గొని పలుమాఱు - భ్రిమ్మరులై ప్రజలు ✤ దిరుగుచుంద్రు । కమలమిత్రు
నిందుఁ ✤ గానని యంధుండు । కాశికేగియైనఁ ✤ గానఁగలఁడె। దైవమిచ
టగాంచు ✤ ధన్యాత్ముఁ డెందైన । నిందుఁజూచినట్టే ✤ యందుఁజూచు ॥
౧౮౦॥ క॥ఇందున లేఁడని దేవుం। డందందునఁ దిరుగుచుండు ✤ రజ్ఞానులిల
న్నిందందు నెందు సర్వమునందునఁగలఁడంచుజ్ఞాని ✤ యారయుచుండున్ ॥
౧౮౧॥సీ॥ మిక్కిలిగఁ జదివి ✤ మిడుకుచుందురుగాని - తమలోనిదైవంబుఁ ✤
దలఁపలేరు । తీర్థయాత్రలకెల్లఁ ✤ దిరుగుచుందురుగాని - తమలోనిదై
వంబుఁ ✤ దలఁపలేరు । జపతప వ్రతహోమ ✤ సరణిఁజేతురుగాని-తమలోని
దైవంబు ✤ దలఁపలేరు । యజ్ఞదానాదుల ✤ నాచరింతురుగాని-తమలోని
దైవంబుఁ ✤ దలఁపలేరు॥ తే-గీ॥ బూటకములెల్లసల్పనో ✤ పుదురుగాని।

కడఁగితమలోని దైవంబుఁ గాంచలేరు । చొక్కముగ సర్వవస్తువుల్
చూడనేర్చి । తన్నుఁజూడంగనేరని కన్నుఁబోలె॥ ౧౮౮॥ క॥ నేనునేన
నుచు నెప్పుడు । మానక వచియించుచుండు మానవుఁడరయన్ । నేనెవ్వఁ
డన నితనుఁడాఁ గానఁడు దేహంబె తాను గాఁగనుఁగొనుచున్ ॥౧౮౯॥
క॥ హరిహరధాతలకైనను । గురుఁడే దెల్పంగవలయు గురుమర్మంబున్ ।
నరులెన్ని పాట్లుపడినను । గురుమర్మము దెలియవశమె కుంభినిలోనన్ ॥
౧౯౦॥ క॥ కొండలు వైకుంఠముపైఁ । గొండలు కైలాసమందుఁ గొండ
లు స్వర్గం బందునఁ గొండలు నజపుర । మందున భ్రమగొందురవియు
మాయఁగఁగనుమీ॥ ౧౯౧॥ చ॥ అరయఁగ సత్యలోకమునకై శ్రమలేటికి
నందు ధాతకున్ । దరమిడి వచ్చునూనములు దప్పునె పుత్రినిఁ బొందినం
దుకై । వరసుతులందఱుద్ధనను వంచన జేయరె మన్మథారిచే । శిరమును
గొట్టఁగాఁబడఁడె సిద్ధముగాఁ బరమేష్ఠి యెంతయున్॥ ౧౯౨॥ క॥ ఘన
మే వైకుంఠంబనఁ । బనివడి యచ్చోటద్వార పాలకులనఁగా । నొనరిన జయ
విజయాదులు చని మరలను మరలి రారె జన్మంబులకున్॥ ౧౯౩॥ ఆ-వె॥
చింతసేయ నేఁడు శివలోకమునకును । బ్రాప్తమునకుమించు ఫలము గలదె ।
వెండికొండమీఁద వెలయఁగనుండిన । నీశ్వరుండు భిక్షమెత్తవలసె॥
౧౯౪॥ ఉ॥ మానవులింద్రభోగముఁ మానసముంతురు స్వర్గనాథుఁడున్ ।
గానని సౌఖ్యమన్యులకుఁ గల్గునె గౌతమశాపవహ్నిచే । మేనునఁ జీము
రక్తములు మెండుగ యోనులు గల్గియుండఁడే । తానొకపద్మనాళమున
డాఁగఁడె శక్రుఁడు పెద్దకాలమున్ ॥౧౯౫॥ క॥ తమకుంగలిగిన నిడుములు ।
సమయంగాఁ జేసికొనఁగఁ జాలని వారల్ । తమకెట్లు సుఖములిత్తురు । తమ
ప్రాప్తము కొలఁదిగాక తామెందున్నన్ ॥౧౯౬॥ ఆ-వె॥ జన్మసహితు
లైన జనులకునెల్లనీ । పదవులందు భ్రాంతి పరఁగుజన్మ । శూన్యులిట్టి
తుచ్ఛ సుఖములుఁగోరరు । స్థిరపదంబువారు చెందుకతన॥ ౧౯౭॥
క॥ మూర్తులనంగను గుణములె మూర్తులుగానెన్నుటకును మూలము
నవియే । మూర్తులపని తమదాఁటఁద్రి । మూర్తులెయని గుణములకును
మూఁటికివచ్చెన్॥ ౧౯౮॥ ఆ-వె॥ అగయరూపుఁజేయు నదియకారము
దానిఁ । బెంచునది యుకార మెంచిచూడ నదియు లయముఁజేయు నది
మకారంబగు । వీనిమూఁటిచేత విశ్వమొప్పు॥ ౧౯౯॥ క॥ పరమేష్ఠి హరి
హరాదులు । పరికింపఁగ వారివారి పట్టణములకున్ । దొరలగుచుఁ
బుణ్యజనులకు । స్థిరభోగములిత్తురంచుఁ జెప్పుటవలనన్ ॥౨౦౦॥ ఆ-వె॥
మూఁడుపురములకును ముప్పురప్రభువులై । యలరుచుంటయు నిజ మన

ఘులైన ప్రజలకొఁఅకుఁ జేయు ౹ పదవులునవిమాయ । వలనఁగల్పితంబుల్
వాజాక్షి॥ ౨౦౧॥ క॥ వారలువారిపురంబులు । నారయఁ ద్రిగుణముల
వలన ౹ నైరేగాకన్ । వేఱద్ది పదవులకు నధి । కారులుగా కెపుడుగారుల్
కర్తలువారున్॥ ౨౦౨॥ ఆ-వె॥ అరయమూర్తులాది ౹ యఖిలంబుఁద్రిగు
ణాది । కములచేతనైన ౹ క్రమమువలనఁ । గర్తలెవ్వరిందుఁ ౹ గారనిగ
ట్టిగాఁ । జెప్పవలసెనిట్లు ౹ చిగురుఁబోణి॥ ౨౦౩॥ క॥ నిరతిముమూర్తి
త్రయమును। గరమరుదుఁగ బ్రళయమనెడుల్ గాఢసుషుప్తిన్।బొరలినశిం
చుచునుండఁగ। నెఱివీరలెకర్తలంచుల్ నెట్లనవచ్చున్ ౨౦౪॥ క॥ చూపును
నామముశక్తియు । వ్యాపారముపత్నిపుత్ర ౹ వాంఛలచేతన్। జూపబట్టి
పోవుమూర్తులు । ప్రాపింపఁగ మాయగాని ౹ బ్రహ్మం బగునే॥ ౨౦౫॥

—: భాగవతలక్షణము :—

చ॥ అనవుడు నుర్విభాగవతు ౹ లందరు వారల భావ మెద్దియో । వన
ములనున్నయోగులకెల్ వాసగమోక్షమటంచుదాన స । ద్ఘనవ్రతయాగ
తీర్థముల ౹ కంటెను సద్గతిలేదటంచు నె । ట్లనెదరు వారిపద్ధతులనానతి
యిమ్మనశౌరి యిట్లనున్॥ ౨౦౬॥ క॥ సతి నీవడిగిన ప్రశ్నయు । నతివిమ
లము నివడిగిన ౹ యదియేగాకీ । క్షితిలోన మాయవాదుల। గతులెల్లను
నీకుఁదెలియఁగావినిపింతున్॥ ౨౦౭॥ ఆ-వె॥ భాగవతులమంచుఁ ౹ బర
మార్థమెఱుఁగక । ప్రబలితిరుగువారు ౹ భాగవతులె। భాగవతమనియెడుల్
పదమునకర్థంబు । పరఁగఁదెలియువారె ౹ భాగవతులు॥ ౨౦౮॥ క॥ భాయ
నఁగభక్తియనియును । గాయనఁగాజ్ఞానమనియుల్ గణుతింపఁదగున్।వాయ
నవైరాగ్యంబని। తాయనమాయనఁగఁబరంగుల్ తత్వముముక్తిన్॥ ౨౦౯॥
ఆ-వె॥ భాగవతమనినను ౹ భగవంతునకునాఖ్య యలరుచుండునట్టి యర్థ
మెఱిఁగి ౹ భక్తిమీఱనట్టి ౹ భగవంతు నెఱిఁగిన। భక్తులెవ్వరైన ౹ భాగవ
తులె॥ ౨౧౦॥ క॥ భాగవతార్థము దెలియక। బాగుగ నిలమేము భాగ ౹
వతులమటంచున్ । రాగిలుచుండెడివారలు । భాగవతోత్తములుగారు ౹
పామరులరయన్॥ ౨౧౧॥ ఆ-వె॥ వసుధజ్ఞానభక్తివైరాగ్యపరతత్వ।మార్గ
ములనుముక్తిమార్గుఁడగుచు।విగ్రహార్చనాది ౹ వేల్పులభ్రమవీడి । పర
ముగన్నవారె ౹ భాగవతులు॥ ౨౧౨॥ తే-గీ॥ ఎలమిఁదిరుమణిశ్రీచూర్ణ ౹
ములను దిద్ది।తులసి పూసలు మెడనిండఁ దూఁగియాడ । పట్టువస్త్రంబు
లనుగట్టి । భ్రమసితిరుగు । పామరులు నెన్నఁటికిఁగారు ౹ భాగవతులు॥
౨౧౩॥ క॥ సుర పలల సేవసతులును । పురుషులు భువి నగ్నలగుచు ౹
భోగింతు రదే।పరమని వావులుదలఁపక । ఖర శుని సూకర మృగములుల్

గలయ వెయిట్టుల౯॥ ౧౯౧॥ ఆ-వె॥ మాసపుష్పరసము ఽ మలమూత్రవీర్యాది।
కమ్ములె ముక్తియించుఁ ఽ గలుపువాఁడు। శ్వపచ సూకరాది ఽ సముఁ
డగుఁగాక స। స్నానవుండెయతఁడు ఽ మదిఁదలంప॥ ౧౯౨॥ ఆ-వె॥ అవని
నష్ట పూర్తు ఽ లని తీర్థవల్లని। నీచ వస్తువులను ఽ నెసఁగఁగూర్చి కలిపి నీటఁ
ద్రావ ఽ ఘటశుద్ధియానె యు। శుద్ధవస్తువుల ఽ శుద్ధతనువు॥ ౧౯౩॥ఎ॥
ఆ-వె॥ అయ్యలు పెరుమాళ్లు ఽ నారగింపులు సేసి। గాని మెక్కఁబోరె ఽ
కడుపునిండ। నారగింపు లెన్ని ఽ యైనను నాఁకలి। చెడదు కుడువకున్న ఽ
విడదుత్తుత్తు॥ ౧౯౪॥ బి॥ క॥ కూరిమి వర్ణాశ్రమములు! గోరికనీమంబు
లాదిఁ ఽ గొని భ్రమయక హృ। త్సారసమునఁ దనుఁగాంచిన। వారెవ్వరు
నైన భాగ ఽ వతులనఁ జెల్లుఁ॥ ౧౯౫॥ నెలఁతా వైష్ణవధర్మం। బలరఁగఁ
గనువాఁడు చూవె ఽ భాగవతుండౌ। నిలనిట్టి నీచవర్తన। లలి వేణీ సేయు
నాతఁ డార్యుఁడగునే॥ ౧౯౬॥ క॥ దురితాచారంబనఁదగు। మఱియు మ్మ
ధుమాంస సంగమాది క్రియల౯। దొరంగి నధర్మపు వర్తనఁ। బరువడిఁ గై
కొన్నవారె భాగవతు లిల౯॥ ౧౯౭॥ క॥ శశివదన నీకుఁదక్కను। విశ
దముగాఁ దెలియు తత్వ ఽ విదులకు దక్క౯। పశుతుల్యులైన జనులకు।
వశమే దెలియంగ భాగ ఽ వత ధర్మంబుల౯॥ ౧౯౮॥ ఆ-వె॥ ఊరనున్న ముక్తి ఽ
నొందఁగా రాదని। విపినమునకు నేగు ఽ వెఱ్ఱినరుఁడు। నడవియుందె నెపుడు ఽ
విడువక చరియించు। మృగవిహంగములకు ఽ మేలుగలదె॥ ౧౯౯॥ చ॥
జడభరతుండు రాజ్యమును ఽ సర్వము వీడియు మోక్షకాంక్షచే। నడవికి నేగి
జింక తగు ఽ లాటము చేతను లేడిజన్మము౯। బడసియుఁ గొన్ని నాళ్ళకును
బాసి శరీరము విప్రజన్ముఁడై। కడపట ముక్తినొందె నిఁక ఽ గానలనున్నను
ముక్తి గల్గునే॥ ౨౦౦॥ తే-గీ॥ ఇల్లు నాలిని వర్జించి ఽ యిలను విడినఁ।
గందమూలంబులను దిని ఽ గాన నున్నఁ। దపన శీతంబులకు నోర్చి ఽ తపసి
యైనఁ। గాయమును జిక్కఁ జేసిన ఽ మాయ దెగునె॥ ౨౦౧॥ క॥ తనుఁదాఁ
గనుఁగొను పురుషుం। డనయంబు నింటనున్నఁ ఽ నందును ముక్తి౯।
దనుఁదాఁగానని మనుజుఁడు। వనమునఁ గల్పంబులున్నఁ ఽ బడయునె
ముక్తి॥ ౨౦౨॥ ఆ-వె॥ మనసు కారణంబు ఽ మఱియెందునున్నను। నిండ్లు
నడవి ముక్తి ఽ నియ్య గలవె। మనసు లేనివాఁడు ఽ మందిరమున నున్నఁ।
గానమున నున్నఁ ఽ గార్యమేమి॥ ౨౦౩॥ క॥ ఆఁకటి కన్నము గుడువక।
యాకులు కాయలును నమల ఽ నదిమోక్షంబే। యాకుల నెల్లను మేసెడు।
మేఁకలకును ముక్తి గలదె ఽ మేదినిలోన౯॥ ౨౦౪॥ క॥ నెఱిఁగూడు నీళ్లు
ముట్టక। పరువడిఁ బై చీర లేక పసరము లీల౯। దిరిగిన మోక్షము గల్గునె।

పరికింపఁగ వారి వ్రాత | ఫలమదిగాక౯॥ ౨౨౫॥ సీ॥ ఆదియందె నరుల | కన్నంబు బుట్టించె-బసులకుఁ గల్పించె | పచ్చిపూరి। ఫణికి నాహారంబు | పవనంబుగాఁ జేసె-నెఱ్ఱలకును మన్ను | నేర్పరించె | వేఱుపుర్వులకెల్ల | వేఱులు గావించె-మేఁకల కలరించె | నాకులెల్ల । మధుపాళి కెల్లను | మకరంద మొనరించె-పేడ పుర్వులకెల్లఁ | బేడఁ జేసె । నిట్టు లాహారమే జీవి | కెట్టు లెట్టు । పెట్టవలె నట్టు దైవంబె | పెట్టియుండఁ। దమకు సృష్టించు నన్నంబుఁ | దాము దినక యితర యాహారములు గొన | నేమిఫలము॥ ౨౨౬॥ తే-గీ॥ ఆత్మలింగంబు సేవింప | నలవిగాక । దొంగపశువుకు మెడబొండఁ | దొడఁగినట్లు। కంఠమున లింగకాయలు | గట్టినంత। మాత్రమున ముక్తిఁ గంపు రే | మంకు జనులు॥ ౨౨౭॥ క॥ పరమార్థముఁ గనఁ జాలక। కొఱమాలిన నరులు గర్మ | గురుముద్రలచే। నిరుభుజములు గాల్పింతురు। పరగంగా ముక్తిగలదె | పశువులుగాక౯॥ ౨౨౮॥ తే-గీ॥ భూతి దేహంబునకు నెల్లఁ బూసి। హరిణ చర్మవల్కల రుద్రాక్ష | పరులు కాయ । పలువలును గమండల దండ | ములను నోలిఁ। బూనినంత నె మోక్షంబు | పొందువడునె॥ ౨౨౯॥ క॥ దానముల జన్మశూన్యము। గానేరదు నృగునకంటెఁ గలరే బహుగా । ధేనువులు భూము లిచ్చిన । భూనాయకుఁ డూసరెల్లి | పుట్టువ్రఁగాఁడే॥ ౨౩౦॥ ఉ॥ వట్టి వికారమర్త్యులుప | వాసమదెట్టి దెఱుంగఁజాలకే। యట్టి యభీష్ట వాసరము | లన్నము మానివటింతురాఁకలిం। బట్టఁగ లేక ప్రాణిమల | భక్షణఁ జేసియుగాదె తృప్తుడౌ । నిట్టి వ్రతంబులు౯ సలుప | నేమిఫలంబగు మానవాళికి౯॥ ౨౩౧॥ ఆ-వె॥ మదిర కుంభమునకు | మదిరంబుచే శుద్ధి । పొందనట్లు బుద్ధి - పూర్వకముగ । జీవహింసఁ జేసి | గావించుయాగంబు । పాప వృద్ధిగాని | ఫలము గలదె॥ ౨౩౨॥ క॥ తెలివి విహీనులు కొందఱు। నిలలోఁగల శక్తులకును | నింపెసఁగంగ౯। దలపోయఁగొన్ని జీవులబలియిత్తురు దోషమనక | ఫలమదియగునే॥

## జీవహింసలక్షణము.

౨౩౩॥ క॥ ధరజీవ హింసకంటెను। నిరయము వేఱొండు లేదు | నిఖిలమునందు౯ । బరమాత్మ కల్గుఁ గావున ।. నరునకుఁ దగదెట్టి ప్రాణి | నంతముఁ జేయ౯॥ ౨౩౪॥ ఆ-వె॥ యజ్ఞ మనఁగ నాత్మ | యజ్ఞంబు గావింప | వలయుఁగాని గుణ | వంతులెల్ల । జీవహింసతోడఁ | జెలఁగెడు యజ్ఞంబుఁ । జేయఁ బోలదెంత | చెనటులైన॥ ౨౩౫॥ చ॥ కొనకొని యెన్ని ప్రాణులను గోతురొ మానవు లన్ని మాఱులు౯। దనరఁగ వాని రూపములఁ | దాము వహింతురు మానవాకృతుల్ । గనునవి వారిచేతఁ దెగు | కై వడివానినిఁ

గోయుఁగాబరున్ । గనుఁగొనదాము సేయునల కర్మఫలంబులురిత్తవోవునే।
౨౩౬॥ క॥ అనదుష్ట సింహ వృశ్చిక । ఘనులాదివధించు టెల్లఁ బాపము
గాదె। మనుజు లిది సేయవచ్చునె। యనఁ బడఁతుకఁ జూచి పల్కె హరి
ప్రీతుండై॥ ౨౩౭॥ క॥ పరమాత్ముఁ డన్నిటను నా।దర మొప్పఁగ సముఁడు
నగుచుఁ బవన్నెఱింగిన స।త్పురుషుఁడుతానై వెల్గుచు। మరి సకలమునందు
సాక్షిమాత్రుండ గుటన్॥ ౨౩౮॥ చ॥ తనరంగ దుష్టజంతువులు ధాత్రి
ననేకుల కెగ్గుసేయుఁగా। వున వినుదుష్టశిక్షణము బొల్పుగనీ యిల శిష్టర
క్షణం।బులు నొనరింప ధర్మ మగుఁ బొంద దధర్మము దుష్టప్రాణులన్ ।
జనులకు మేలు గోరియును జ పినఁ జంపఁగ వచ్చు నిమ్మహిన్॥౨౩౯॥
ఆ-వె॥ అట్లు చంపకున్న నవికొన్ని ప్రాణుల। బాధసేయుఁగొన్ని పర
గఁజంపుఁ । గాన సకలజీవగణసౌఖ్యముగ దుష్ట।జీవతతులనొంపఁ జెంద
దఘము॥ ౨౪౦॥ క॥ తొలియవిచేసిన దుష్కృత।ములవలనను దుష్టజన్మ
ముల నొందుటయు । న్నిలజనులు గవినవానిని। బొలియించుట వానివాని
పూర్వకృతములే॥ ౨౪౧॥ క॥ తననుం బొరిగిన నెదిరిం । చిన వానినిఁ
ద్రుంప నఘము నందువలన షట్లనుడమున్ దగమృత్యువు । నొనరించెడి
వానిఁజంప నొప్పగు జగతిన్॥ ౨౪౨॥ ఆ-వె॥ ఒరుల తెరువుపోక
యొంగనీటఁగొన్నియు । నుర్వి గొన్ని బ్రతుకు నోరులేని । సాధుజంతువు
లను జంపుట ధర్మమే । మాంసభక్షణంబు మఱిఁగి ఖలులు॥ ౨౪౩॥
క॥ తీర్థస్నానము లాడఁగ । సార్థకమును గలదెయందు జలచరములకే।
సార్థకము వచ్చునంతెటి । సార్థకమే గల్గునట్టి స్నానంబులచేన్॥౨౪౪॥
ఆ-వె॥ తనువుతోడ స్వర్గ మునకుఁబోయినవారె। ధన్యులంద్రుతెనువువిడగి
లినపుడె। చావుగల్గు పిదప జన్మంబు గలుగును। గాన ముక్తి పదము। గాదది
యును॥ క॥ సుతులిలను లేనివారికి । గతులే లేవందురెపుడు కర్మవిశా
రుల్ । సతిసుతులు లేపి మారుత । సుతుఁడును నాభీష్మనృపతి సుగతిం
గనరే॥ ౨౪౬॥ ఆ-వె॥ గృహమునందు నుండి యిలకులంబుననుండి ।
యిహమునందు నుండి యింపుమీఱ। సతుల సుతులతోడి సంగముమిథ్య
యటంచుఁ । గాదె సూరిజనులు గనుటనుగతి॥ ౨౪౭॥ క॥ సతిపొందు
గోరకుండిన। యతఁడేమహనీయుఁడందు రాషండునకున్। సతివాంచ లేదు
గావున । నతడునుగానవచ్చు నిలమ హాత్ముండరయన్॥ క॥ మతముల
కన్నిఁటికిని మా।మతమే హెచ్చనుచు వాదమాడుదురెవరున్। మతముల
కందని పరమును । మతిఁగానఁగ లేనివారి మతమేమిటికిన్॥౨౪౯॥ తే-గీ॥
భూతి రుద్రాక్షలును లింగ ములును దాల్చు । నవియుఁ వనమాలవే

యుట నామములును। బెట్టుటయుఁ బట్టుపుట్టముల్। గట్టుటయును। నాది
చక్రాంకితంబులు నగుట భ్రాంతి॥ ౨౪౦॥ క॥ స్థిరకాల జీవులగుచును। ధర
నుందురు కొందఱనుచుఁ దలఁచెద రజ్ఞుల్। తరుణీమణి జాతస్యా। మరణం
ధృవమన్న శ్రుతిని మనమున్ వినమే॥ ౨౪౧॥ క॥ స్థిరకాల జీవులనఁగను।
నుఱుతరముగఁ దనువుతోడ నుండుటయునుగా। దరయఁగ దేహము చెడి
నను। బరమైతా ముంట నాశ భవములు లేకన్॥ ౨౪౨॥ తే-గీ॥ జనము లె
ల్లను జూచి యాశ్చర్యమొందఁ। బ్రాణమును బట్టి తానగు ప్రాణము
నను। నంబువులమీఁదఁ గూర్చున్న నధికుఁ డగునె। నిలిచియుండవె బుడ
కొల్లు నీటిమీఁద॥ ౨౪౩॥ క॥ కాళ్ళంట జడలు గడ్డము। గోళ్ళాదిగ బెంచి
పుట్టగోచియు నమరన్। వ్రేళ్ళ జపమాలఁ ద్రిప్పుచు। నూళ్ళూళ్ళను దిఱుగ
ముక్తినొందంగలరే॥ ౨౪౪॥ తే-గీ॥ దేహమును మాయయని తన్నుఁ
దెలియ లేక। పవనభక్షణఁ జేయుచుఁ బాము రీతి। నీచ కాయంబు బహు
నాళ్ళు నిలుప నేల। ఫణియు బ్రతుక దె వేయేండ్లు ఫలముగలదె॥ ౨౪౫॥ క॥
వాయువుల వశముఁ జేసుకఁ। బాయక యిలమీఁదఁ జదలు పదమున
నిలువన్। మాయను బాయఁగ వచ్చునె। యాయంబర సీమంబులుఁగు
లాడనె యెపుడున్॥ ౨౪౬॥ ఆ-వె॥ మానభాషలరయ మది వికారము
లంచు। దెలిసి పరముజాడఁ దెలియ లేక। మాటలాడ కెపుడు మానంబు
చేనాలి। ముచ్చువలెను దిఱుగ ముక్తుఁడగునె॥ ౨౪౭॥ క॥ ఊరూరు దిరిగి
పఱులకు। గారడి మహిమలను జూపఁగలదే మోక్షం। బేరీతిఁ గల్గు మాయల।
గారడివానికి నిముక్తిఁ గలదే తలఁపన్॥ ౨౪౮॥ ఆ-వె॥ ఆశ్రమంబు లేమి
యనరాక సర్వంబు। నిండియున్న పరము నెఱుఁగ లేక। యిలను నాశ్ర
మంబు లిచ్చునే ముక్తిని। మూలమెఱుఁగలేని మూఢులకును॥ ౨౪౯॥
క॥ నేలం బవళించుటయును। రేలును భుజియించుటన్న రీతులు లేకన్।
పాలు ఫలాదులు గొనుటయుఁ। గీలెఱుఁగని మాయజనుల క్రియలు త
లంపన్॥ ౨౫౦॥ ఆ-వె॥ హోమగుండములను నొనరించి హెచ్చుగా।
నాజ్యధారలిడుచు నగ్నిలోన। ఘోరముగను వేదఘోషలు గావింతు।
రందుఁగానఁబడు నె నాత్మ తెఱవు॥ ౨౫౧॥ క॥ సతిసుత గృహవిత్తంబులఁ।
జతురత విడనాడి నేను సన్యాశినన। న్నతఁ డెపుడుఁ గాఁడు దేహము। సత
తము గొని తిరుగునపుడె సకలము నుండున్॥ ౨౫౨॥ క॥ సంసారమనఁగ
దేహమె సంసారమనంగ గాదు సతిసుత గృహముల్। సంసారమును చువద
లిన। సంసారే తనువు విడువ సన్యాసియగున్॥ ౨౫౩॥ క॥ వనితా దేహా తనూ
జుల। ధనకనకాభరణవస్తుతతులను నెల్లన్। బనిపూని విడువవచ్చును। దను

వును విడనాడ వశమె ధర నెవ్వరికిన్॥౧౬౪॥క॥తనుఁదా గాంచుచునుం డిన|జనుఁడే సన్న్యాసిగాని సకలమునున్నన్|దనుఁదా గానక తిరిగెడు జనుఁడును సన్న్యాసిగాఁడు సకలము విడినన్॥౧౬౫॥ క॥ క్షితిఁ గొందఱు శాస్త్రంబుల|నతులితముగఁ జదివి జ్ఞాన మది యెఱుఁగరుపో|సతతము గురుకృప గలిగిన | సతి చదివినఁ జదువకున్న సమముక్తియగున్॥ ౧౬౬॥చ॥తలలను బోడిఁజేయుటయు దాల్చుట నామ విభూతులున్ జడల్|గలయదిగంబరుండగుట గట్టుట కంబళి కాయవల్కముల్|బలువగు క్షుత్పిపాసలను బట్టి కమండలదండ ఛత్రముల్ | పొలుపుగ వ్యాఘ్రచర్మములఁ బూనుట డంబముగాక ముక్తికే॥ చ॥ చలనపు మాయ విశ్వమును సత్యమటంచు నమ్మువారికే|కలుషపు తంత్రి వేషమును గావలె గాని దలంచిచూడఁగా| నిలఁ బరమాత్మ తత్వమును నింపుగఁ గాంచియు సర్వవృత్తులున్|గలయని చూచువారలకు గల్లరి వేషము లెల్ల నేటికిన్॥ ఆ-వె॥అనినఁ బంకజాక్షి యాయదుకులవిభు|నరసి యాశ్రమంబు లనఁగ నెన్ని|యాశ్రమముల లోన నధికంబు నెయ్యది | యెఱుఁగఁ జెప్పుమనిన నిట్లనియె॥

—: యాశ్రమ లక్షణము. :—

౧౬౯॥ క॥ వనితా వానప్రస్థం | బును నవధూతంబు సరస ముగ సన్న్యాసం | బును బ్రహ్మచర్య మిన్నిఁటి | కిని గార్హస్థ్యంబు తల్లి కీర్తింపఁ దగున్॥౧౭౦॥ క॥ సకలాశ్రమముల వారికి | నిఁక గార్హస్థ్యంబు రక్షణీయం బగుటన్ | బ్రకటింపఁగ గార్హస్థ్యము | నకు సరిగావంద్రు బుధులు నఖిలాశ్రమముల్॥౧౭౧॥ ఆ-వె॥ నిజము దెలియునట్లు నిజగురుసందర్భ | మింత లేక గల్గె నిన్ని విధము | లైన మార్గములను నదియున్న నరులకు | నౌను నొక్కమార్గమందతికిని॥౧౭౨॥ క॥ క్రతుతీర్థంబులకంటెను | క్షితిదానవ్రతములాది సేయుటకంటెన్ | మతములకన్నిఁటికంటెను|నతులితభాగ్యంబు దెలియు టాత్మపదంబున్॥౧౭౩॥ ఆ-వె॥ నిజము దెల్పునట్టి నిజగురుంగానంగ | లేక మాయఁజిక్కి లోకులెల్లఁ|గర్మగురులఁజేరి కర్మకుఁబాత్రులై | చచ్చి పుట్టుచుండు సహజముగను. ౧౭౪॥ ఉ॥ మానినిగ్రుడ్డి కంధుఁడును మార్గముఁజూపఁగ లేని కైవడిన్ | జ్ఞానములేని మందునకు జ్ఞానవిహీనుఁడు ముక్తి దెల్పునే | కానని వానికక్షులను గల్గిన వాఁడెఱిఁగించు పోలికన్|జ్ఞానములేని మూఢునకు జ్ఞానియె చూపును ముక్తిమార్గమున్॥౧౭౫॥ తే-గీ॥ జ్ఞాని యజ్ఞానియొక రూపు గానఁబడిన | వారివారల భావముల్ వేఱు వేఱు | ఉప్పుకప్పుర రూపంబు లొక్కటిగను | నుండినను రుచు లేఱ్వేఱు నుండునట్లు॥

౨౭౬॥ ఉ॥ దీపముగల్గు గేహమునఁదీ ప్తిం గనంబడు సర్వరూపముల్ । దీపము లేక యెద్దియును ॥ దేజ మెసంగనియట్టులేదికిఁ । బ్రాపుగ దేహి దేహమును బాయక మున్నుగ ము క్తిగానకఁ । దీపమువంటి తెల్వియునుఁ దీటినపిమ్మట ము క్తిగందురే॥ ౨౭౭॥ ఆ-వె॥ దేవుఁడన్న మాటఁ దెలియు నందఱికిని । మాటవలన నేమి ॥ మాటవచ్చె । వాని నెఱిఁగినట్టి వానిని సేవించి । దేవుఁడన్నగు ర్తుఁ దెలియవలయు॥ ౨౭౮॥ క॥ పేరెఱిఁగినవాఁడొ క్కఁడు। కూరిమిఁదన చెంత రాఁగఁ గు ర్తెఱుఁగునెయా। పేరుగలవాఁడె వీడని వార కతని నెఱిఁగినట్టి వాఁడు దెలుపకఁ॥ ౨౭౯॥ ఆ-వె॥ అబ్ధిఁ దరియఁ గోరియులనావికునిఁబోడఁ । గన్నయట్టులోడ నున్న జనులు । మాయయను నెడువార్ధి మానక దాఁటించు। జ్ఞానగురుని నరులుఁ గానవలయు॥ ౨౮౦॥ క॥ దినశుద్ధి దెలియఁగోరిన । ఘనపంచాంగంబు ముఖతఁ గావ లెనిఁక దే। నను గానట్టుల జ్ఞానము। గనఁదగు సద్గురునివలనఁ గాదితరమునఁ॥ ౨౮౧॥ శా॥ ఏ వేళఁ గురుమూ ర్తి పాదములనే యే వారలుఁ గొల్తురో । నేవారిఁ మహనీయ మూ ర్తులనుచు న్నెల్లప్పుడుఁ గొల్తునా దేవాదీశునకై న వారి మహిమఁ దీపింపరాదగ్గురుఁ । భావింపఁ దగుఁ గొల్వలేని నరులఁ బాటింపరాదెన్నఁడుఁ॥ ౨౮౨॥ సీ॥ కులశ్రేష్ఠులము మేము ॥ కుల హీనుఁడగువాని-గురుఁడని మదినెట్లుఁ గొ లుచుంచు దేహాభిమానులై ॥ దిరుగువారలుము క్తి-గన లేరు యుగములకై నగాని। వసుమతిరాళ్ళలో వజ్రంబు ప్రబవించి – కులహీనమయ్యె నే గొప్పగాక । * పాలమున్నీటి లోపల విషము జనించి – కులమేమి ఘనతయ్యె ॥ గుణము లేక । గాన నింతకు గుణమూలే ॥ కారణములు గాని కులమెందు హేతువు ॥ గాదటంచు । నెంచి దేహాభిమానంబు । ద్రుంచి పరమ ॥ గురుని సేవించువారలు పరముగంద్రు॥ ౨౮౩॥ ఉ॥ దేవరహస్య మెంతయును దెల్పెటి మోక్షము దెల్పునార్యులఁ । భావముజాతియుఁ గుణము ॥ పద్ధతులాదిగ నెంచనేటికిఁ । గోవు సుధాంబుపూరములు ॥ గోరినపాలనె గొంచఁగాఁదగుఁ। గోవుబలంబు సన్నమను ॥ కొమ్ములు రొమ్ములు నెన్న నేటికిఁ॥ ౨౮౪॥ ఆ-వె॥ భువిన నేకజన్మ పుణ్యవశంబునఁ । గాని నరులుగురునిఁ గానలేరు॥ పుణ్యహీనులకును ॥ బుద్ధిఁదలంచిన । దొరక దెన్నఁటికిని గురుపదంబు॥ ౨౮౫॥ ఉ॥ కూరిమి మర్త్యులందునను ॥ గోటికి నొక్కఁడు గోరు మోక్షముఁ । గోరినవారియందునను ॥ గోటికొకానొకరుండు సద్గురుఁ। జేరి విము క్తిఁగాంచు గురుఁ ॥ జేరినవారలఁ గోటి కొక్కరుం । డారయ

* పాలమున్నీరు — క్షీరాబ్ధి.

జన్మశూన్యుఁ ఽ డగు నందజేకిఁ గడ తేజ శక్యమే॥ ౨౮౬॥ క॥ నాపుడుఁ గులమను నదియును। నేవిధమున సంభవించె ఽ నెచ్చునుదగ్గఁ।భూవలయమందు జపములు। భావించుట యేమి కతనఽబద్మదళాక్షా॥౨౮౭॥ క॥ ప్రజ్ఞాప్రజ్ఞవివర్జిత। సుజ్ఞానవిశాలనేత్ర ఽ శుభగచరిత్రా। యజ్ఞప్రశస్త శోభిత। యజ్ఞానధ్వంసపరమ ఽ హంసోత్తంసా॥ ౨౮౮॥ మాలిని కుటిలమద వినాశా ఽ కోటిసూర్య ప్రకాశా।పటుదరవరతత్వా। పంచభూతప్రభుత్వా। చటులదురితదూరా ఽ సర్వవేదాంతవాసా। ఘటనఘటనధారీ ఽ కామశూన్యప్రచారీ॥

గద్య॥ ఇది పోకల - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్రనారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీ కృష్ణ రుక్మిణీ సంవాదంబనుఽసుజ్ఞాన శాస్త్రంబునందుఁ బ్రథమాశ్వాసము,



# శ్రీ కృష్ణ రుక్మిణీ సంవాదం బను సుజ్ఞాన శాస్త్రము.

## ద్వితీయాశ్వాసము.



క॥ అక్షరరూప వికార వి।లక్షణశుద్ధాంతరంగఽలలిత శుభాంగా కుక్షిపద భరిత త్రిభువన।రక్షా రాజాధిరాజ ఽ రాజ పరాత్మా॥ ౧॥ వ॥ అవధరింపు మవ్వాసుదేవుం డత్తలోదరి కిట్లనియె॥ ౨॥ క॥ తరుణీమణికులమనునది। పరిపరివృత్తులను గలైఽబహురామములఁ।బరికింపఁ గులము వేఱొక॥ తెఱఁగున గల్గినదిగాదు ఽ దెలియుమ యింకఁ॥ ౩॥ ఆ-వె॥

కు ల ల క్ష ణ ము,

వృత్తివలనఁ గాక వేఱొక్క విధమున। గులము గలైనంచుఽగోరిచూడఁ। గులము పరమహంస ఽ కులమయ్యెనందఱు। కులములేనిబ్రహ్మ ఽ కులజులైరి॥ ౪॥ క॥ కులశ్రేష్ఠులమని నీల్గెడు।పలుగాకులు దెలియలేరు పరమార్థంబుఁ।కులమేరోఁతనిరోసిన।కులశ్రేష్ఠుండతడెతత్వఽగోఁవిదుఁడరయఁ॥ ౫॥ ఆ-వె॥ సప్తధాతువులును ఽ సమమయ్యె సమయోని।నరయ నుద్భవంబు ఽ నాత్మజీవ। సమము దలంచిచూడ ఽ సర్వదేహంబులు।నొక్క

టయ్యెఁ గులముఽనొకటిగాదె॥ ౬॥ క॥ కమలముఖిచీముశోణిత । మెము
కలు నరములును దోలుఽ మెదడును మాంసం । బమిత మలమూత్రఁరో
తల నమరిన దీకాయ మెన్నఽనగుబొట్లు సుమీ॥ ౭॥ ఆ-వె॥ ముట్టలోనఁ
బుట్టె ఽ ముఱికి కాయంబును । ముఱికి కాయమందె ఽ ముట్టుపుట్టె ।
ముట్టుకొంప యిట్టి ఽ ముఱికి దేహంబున । కేమికులము గలుగుఽ నెంచి
చూడ॥ ౮॥ క॥ ముట్టున బుట్టిన కులమిది।ముట్టన రోయంగ నేలఽముగ్గురు
మూర్తుల్॥ముట్టునఁ బుట్టిరిగాదే। ముట్టును లేకున్న నరులుఽపుట్టంగలరే॥
౯॥ ఆ-వె॥ ముట్టునందె సురలు ఽ మునులు దిక్పాలకుల్ । ముట్టునందె
జగముఽమునిఁగితేలు।ముట్టునందె నిలిచి । మూలంబుఁదెలిసిన । ముట్టుఁ
బాసి సర్వఽము క్తుఁడగును॥ ౧౦॥ క॥ ముట్టుఃకులంబని తెలియక।ముట్టునికడ
నుండిసతులుఃఽమూన్నాళ్లైనన్।ముట్టుఃవిడసిళ్లనాడినఁ । జట్టకులోఁగల్గుము
ట్టుఽసమయునె యదియున్॥క॥తానెప్పుడు పరిశుద్ధుఁడు।మేనెప్పుడుముట్టు
బొమికె ఽ మేనెన్నఁటికిన్ । గానేరదుపరిశుద్ధియు। మానకయుదకములఁ
గోటి ఽ మాఱులువడినన్॥ ౧౨॥ ఆ-వె॥ సతులుపతులుఃగూడిఽ రతిసేయ
శుక్లశో । ణితములొనరి పిండ ఽ ము తనరెనుగ । వరుసమూత్ర గవిని ఽ
వచ్చిరండఱునిందు । ఘనకులంబు నేది ఽ కానిదేది॥ ౧౩॥ ఎక్కువమా
కులమని బహు । నిక్కంగానేలబిందు ఽ నెత్తురుకులమే । నిక్కముగనై రి
యంపఱు । నెక్కువ తక్కువలునెన్నఽనేమున్నదిఁకన్॥౧౪॥ తే-గీ॥ వీర్య
రక్తంబులను గాక ఽ వెలఁదియోని । మార్గమునఁగాక యింకొక్క ఽ
మార్గమునను।భవమునొంద నెక్కువయని ఽ పల్కవచ్చు ; నందఱారీతిఁ
బుట్టిరి ఽ యధికమేమి॥ ౧౫॥ చ॥ అరుదుగ దంతికీటకముఽలందున శ్వాస
మునందు ధేనునన్ । నరసురలందునన్ శ్వపచుఽనందున విప్రునియందు
నింతులన్ । బురుషుల భిన్నభావమునుఽబొందక సర్వసమత్వమాత్మగా।
నరయుచునుందు రార్యులును ఽ నల్పులు భేదములెంతు రన్నిఁటన్॥౧౬॥
ఆ-వె॥ అబల సర్వరూపుఁ ఽ డైన యనంతుని।దుష్టులెఱుఁగలేని ఽ దోష
మునను । భిన్నభావములను ఽ భేదంబులెంతురు । నిఖిలమాత్మయంచుఽ
నెఱుఁగలేక॥ ౧౭॥ సీ॥ క్షితి వసిష్ఠుఁడు సూర్వఽశికిఁ గల్గె నతనికి-నాయ
రుంధతియందు ఽ నవతరించె । శక్తియు వానికిఁ జండాల ఽ సతియందు-
సంభవించెను బరాఽశరుఁడనంగ।వానికి శంబర ఽ వనితయందుదయించె-
వ్యాసుండు పరికింప ఽ భాసురముగా । నరయఁ జాకితకును ఽ నారదుండు
జనించె ఽ బోయెకు వాల్మీకిఽపుట్టెఁగాదె । యసుర కులమునఁ బ్రహ్లాదుఁఽ
డలరె వీరు । కులముచేతను గాంచిరే ఽ గొప్పతనము । గుణముచేతనే

సద్బ్రహ్మకులజులనఁగ । నఖిలజగములఁ బూజితులైరి గాక ॥ ౧౮ ॥ చ ॥ ఇల
ధృతరాష్ట్ర పాండు ధరణీశులు ముండలకుద్భవించరే । పొలుపుగ దాసిగ
ర్భమునఁ బుట్టడె యావిదురుండు నెంతయున్ । గలుగరె యన్యవల్లభుల
కాదరమొప్పఁగఁ బంచపాండవుల్ । కులము ఘనంబె వీరలును గొప్పవహిం
చరె లోకమందునన్ ॥ ౧౯ ॥ సీ ॥ కలశంబులోన నగస్త్యుండు ప్రభవించె-
గాధికి నుదయించె గౌశికుండు । జింకకడుపున ఋష్యశృంగుండు గలి
గెను - గవికి నుద్భవమయ్యె గౌతముండు । శ్వపచ వంశమునందు
జన్మించె సాట్యుండు తగ మతంగునకు మతంగమౌని । మండూకము
నకును మాండవ్యముని గర్గ-ముండకా కౌండిన్యముని జనించె । శుక
మునకును బుట్టె శుకయోగి భావింప । జంబుకంబునకును జంబుకుండు ।
ఖరమునకును బొడమె గార్గేయుఁడెంతయు । శ్వానమునకుఁ గల్గె శౌన
కుండు ॥ ౨౦ ॥ క ॥ జ్ఞానమె బ్రహ్మత్వంబ । జ్ఞానమె శూద్రత్వమనుచు
జ్ఞానంబాత్మన్ । బూని తమజన్మ లెట్టివి । గానున్నను బ్రహ్మవిధులు గారె
మునీంద్రుల్ ॥ ౨౧ ॥ ఆ-వె ॥ జగతి యేతనేని చండాలుఁడైననుఁ । బ్రభు
వుఁగాగ నెన్న బడినరీతిఁ బ్రహ్మపదముగన్నఁ బంచమకులుఁడైన ।
బ్రాహ్మణుఁడనఁగ బడును జూవె ॥ ౨౨ ॥ క ॥ వరక్షత్రియుండునైన యిల ।
పరిపాలన లేనివానిఁ బ్రభువన రన్లే । ధరణీసుర వరుఁడైనను । బర
మార్థము లేక గలదె బ్రహ్మత్వంబున్ ॥ ౨౩ ॥ ఆ-వె ॥ గుణము గల్గెనేని
కులముతోఁ బనియేమి । కులము నెంచ నెల్ల గుణము లేమి గుణము
లేనిదాని కులమేమి ఘనమగుఁ । గులము వాసి దెచ్చు గుణముగాదె ॥
౨౪ ॥ క ॥ తెలివిజడత్వంబుల యెడఁ । దలఁపగా వచ్చుఁ దారతమ్యము
లెందున్ ॥ గులమునకు నెంచవచ్చునె । యలరంగా హెచ్చుతగ్గుల
భేదములన్ ॥ సీ ॥ శూద్రవనిత భూమిసురుఁడు తద్భూసుర కాంతను
శూద్రుండు గలిసెనేని । శూద్రనాతికిని భూసురపతికిని బుట్టు - బిడ్డ
లకును జాతి భేదమున్నె । కుక్కవిజాతియౌ గొర్రెను బొందినఁ
గుక్క పుట్టదు వేఱు కులమగుటను । నుర్విమానవులెల్ల నొక జాతి
గావున- నెన్న నేసతినైన నింపుమీఱ ॥ తే-గీ ॥ నేపురుషుఁడైన మించి
రమించెనేని । నరులుగాఁ బుట్టుదురు గాక నక్క కుక్క । జన్మలగు
దురె యీనర జాతియందు । జాతిభేదంబులెన్నుట రీతియగునె ॥ ౨
౫ ॥ ఆ-వె ॥ భువిని గోత్రభూజములకు భేదంబగుఁ । గాని గిరికిగిరికిఁ గలదె
వేఱు । నరకులంబునకును నఖిలంబు వేఱైనఁ । దమకులంబువారు తమ
కు వేఱె ॥ ౨౬ ॥ క ॥ జనములు నందఱు నొకకుల । మని తెలిసినవాఁడె

జగతి * నగ్రకులుఁడగుఁ | మనుజుల భేదములెన్నుచు | గొనకొనినటి
యించువాఁడె * కులహీనుఁడగుఁ॥ ౨౭॥ ఆ-వె॥ పునుఁగుగల్గుపిల్లి *
పునుఁగుపిల్లియ యగుఁ | బునుగులేక కాదు * పునుఁగుపిల్లి| గుణములు
న్నహీన*కులజుఁడు హెచ్చగు|గణములేక నగ్ర*కులజుఁడగునె"౨౮॥ చ॥
తపమును యాగతీర్థములు | దాన మహింసయు వేదపాఠముఁ | జప
మును శాంతముఁ వ్రతము*సత్యముహోమము స్నానసంధ్యలుఁ|నిపుణ
తమీఱ నల్పు ధర * నిర్జరుకంటెను దత్వవేత్తయా | శ్వపచుఁడు
నుత్తముం డమల * జన్ముఁడు నాతఁడె బ్రాహ్మణుండగుఁ॥ ౨౯॥ సీ॥
పడఁతిదానముచేత*బ్రాహ్మణత్వము వచ్చె-ననిన నన్యులుగూడ * నాచ
రింత్రు | జన్నిదంబులుదాల్ప * సంభవించెనటన్న-నన్యులు కొందఱు*నవి
ధరింతు | రెఱువు తెల్పులఁగూర్చి*యొసఁగెనన్నను నన్య-కులములలో
ననే * కులును గలరు|జీవ తెలుఁపులఁగూర్చి * చెందిరన్నను జీవ జెలుపు
లఁదఱియందు*దేజరిల్లుఁ|గర్మమునుగూర్చివచ్చె నాఁ * గర్మఫలము |
తెల్లవారికిఁ దమభంగి * నెగుచుండు | దేహమన నందరికి..గల్గు*దెగిన
తనువు|నాత్మజుఁడు గాల్పఁగా బ్రహ్మ*హత్యపొందు॥ ౩౦॥ ఆ-వె॥ కుల
మువలన ననినఁ * గోమలివారి వం|శజులు ఋషులుపుట్టు*సరణివినవె |
పడఁతియట్టుగాదు * బ్రాహ్మణభావంబు | జ్ఞానసంగ్రహమున * సంభ
వించు॥ ౩౧॥ ఆ-వె॥ అనినఁ దత్వవెఱుఁగు*నతఁ డెవ్వఁడైనను|బ్రాహ్మ
ణుండె యసంగ*బరఁగుచుండ|మఱియు నగ్రవంశ*మందుఁబుట్టినవారె |
బ్రాహ్మణుల మటంచుఁ * బల్కుటెట్లు॥ ౩౨॥ సీ॥ అనిన రుక్మిణిపల్కు*
లద్భుతంబుగ నెంచి పద్మదళాక్షుండు*పల్కెనిట్లు | కువలయ మందునఁ*
గొందఱె బ్రాహ్మణు-లఁగ వచ్చుటయెట్టు * లనినవినుము | అలనేతి
బీఱకాయనియు బెల్లపుగొండ-యని సువర్ణముఖియు * ననియుఁవచ్చు |
నందులవ్యవహార*నామంబులేకాని - ఘృతగుడకనకంబు*లెన్నఁగలవె|
యట్లు వ్యవహారమున నామ*మరయనొకటి | గలుగుచేకాని బ్రహ్మాధి*
కారమందుఁ | గొండఅందునఁ గనుపడ * దందునైనఁ | గొండఱుందురు
పరతత్వకోవిదులును॥ ౩౩॥ క॥ వీరలవంశజులును ము|న్నేరీతినిఁ బుట్టి
యున్న*నిజబ్రహ్మంబుఁ | జేరియు బ్రాహ్మణులైరా| పేరేవీరలకువచ్చె *
బెంపొందసిలఁ॥ ౩౪॥ ఆ-వె॥ నేతిబీఱకాయ * నెయ్యిలేకున్నను|నాఖ్య
యొప్పుచున్న * యట్లుజగతి | వీరలిపుడు బ్రహ్మవిదులు గాకున్నను |
బూర్వ వాడుకయును * బోకవచ్చె॥ ౩౫॥ చ॥ పరగవిధాత సద్వదన *
బాహుల నూరుపదంబులందునఁ|వరుసగ బ్రహ్మక్షత్రియులు*వైశ్యులు

శూద్రులుఁ బుట్టిరంచు నే । నరులును జాతిభేదముల ॰ నాత్మఘటించెద రిట్లు పుట్టినన్ । గరిమను నొక్క బ్రహ్మమునఁ ॰ గల్గినవారికి భేదమున్న దే॥ ౩౮॥ ఆ-వె॥ పనసవృక్షమందు ॰ ఫలములు శాఖాగ్ర ॥ మునను నడుమ మూలమ॰ములనుగల్గు। నెగువ దిగువ పండు ॰ లెవ్వియైనఁ బనసపండ్లు గాక వేఱు॰పండులగునె। ౩౯॥ చ॥ హరిఁబోరి పాదయుగ్మమునఁ ॰ బుట్టినవారలు శూద్రులైన చో। హరిచరణంబునం గలిగి॰నట్టిది గంగ సురాదిశూద్ర ముల్నరుడుగ నట్టిగంగ నిల॰నంటగవచ్చునె నగ్రజనులుల్। సరగుణగారె శూద్రులును ॰ స్నానము పానము లాచరించిరె॥ ఆ-వె॥ అదియుఁగాక యింక ॰ నజుని పాదాంగుష్ఠమునను దక్షుఁడు దయ ॰ మొందెగాదె। యతఁడు బ్రహ్మజాతి॰యున నెట్లుపొగడొందె। నతఁడుగాఁడె శూద్రుఁ॰డరసిచూడ॥ ఆ-వె॥ వందనంబు సేయు ॰ వందనంబు నడుగుల॥ మీఁదఁబడును గాని॰పాదములును । మొగము మీఁదఁ బడియు ॰ మ్రొక్కు పుపూజార్హ । మగుట పదము లెక్కు॰వనఁగఁ బరఁగె॥ క॥ పదనోద్భవు లెక్కువయని। పదజనితులు తక్కువనుచుఁ ॰ బల్కఁగ నేలా । వదనంబు ముఖ్యమైనను। బదహీనులు సర్వహీన ॰ పాత్రులుగారే॥ ౪౧॥ చ॥ అనుపమశాస్త్రవాక్యముల ॰ యర్థమెఱుంగఁగ లేక తప్పు భా । వనల నొనర్తు రిజగతి॰వర్ణ చతుష్టయ మాది పంకజా । సను ముందార్యగోరుపద ॰ సంభవులాట యబద్ధమెంతయున్। వినుమికఁ వానియర్థములు ॰ వేఱుగనున్న వియుంగనా మణీ॥ ౪౨। సీ॥ షట్కర్మనిరతులై ॰ సకలవేదపురాణ శాస్త్రముల్ విప్రులు ॰ చదువుకతన । మహిజనాళికి ధర్మ॰మార్గముల్ దెల్పుచు - వాక్కుచేతనె తాము॰బ్రతుకువలన । నట్టివాక్కులు మోము॰నందుంట నాస్యంబు-వలనఁ బోషణమొందు॰వారుగాని। యాననంబున జనన ॰ మైన వారలుగారు-పరికించి చూడంగఁ॰బద్మగంధి । క్షత్రియులుశస్త్రశస్త్రాదిక॰ చయముఁ దాల్చి । భుజబలంబున రక్షణం ॰ బొందువలన । బాహుబలమున జీవించు ॰ వారుగాని । బాహులందునఁగల్గిన ॰ వారుగారు॥ ౪౩॥ తే-గీ॥ వరుసవాణిజ్యవృత్తిచే ॰ వైశ్యులెవుడు । తొడలు సూఁతగఁ గూర్చుండఁ ॰ బడుటజేసి యూరువులపూన్కి జీవించు ॰ వారుగాని । యూరువులయందుఁ బొడమిన॰వారుగారు॥ ౪౪॥ ఆ-వె॥ మెలతఁ శూద్రులకును॰ మెండుగాఁ గృషికిని । బాదచారివృత్తి ॰ వలయుఁగానఁ । బాదచారివృత్తి ॰ బ్రతుకువారలుగాని। పాదమునను గల్గు ॰ వారుగారు॥ చ॥ అరుదుగ ధాత్రి పద్మినియు॰హస్తిని చిత్తిని శంఖినీయనం। బరఁగెడునాల్గు జాతులును ॰ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులం । దరయఁగల్గునింతు

లెడ కనట్లుసమస్తకులంబులందునన్ । బరఁగ గణింపఁ గల్గుదురు-బ్రాహ్మణ
క్షత్రియవైశ్య శూద్రులున్ ॥ ౭౬॥ క॥ నిజముగను బ్రహ్మసృష్టినిఁ । బ్రజ
లెల్లను నెంచిచూడ బ్రహ్మకులంబే। నిజముడిగియన్యవృత్తులు । భజించుట
వలనజాతి భంగముగల్గెన్ ॥౭౭॥ ఆ-వె॥ సర్వజనులు బ్రహ్మ జాతియే
యైనను । రాజ్యమేలుక తన రాజులనియు । వర్తకంబుఁజేయ వైశ్యుల
నియుఁగృషి।సల్ప శూద్రులనియు సంభవించె॥ ౭౮॥ క॥ రాజిలు సత్వ
గుణంబులఁ । బోఁజేసివికారకామ భోగప్రియతన్ । లోఁజేసియుగ్రసా
హస। రాజసగుణిరైన కతన రాజనఁ బరఁగెన్ ॥౭౯॥ ఆ-వె॥ జ్ఞానసత్వ
పరత మాని రజస్తమో।గుణములొంది ధనముకూర్చువాంఛ । లోభ
మోహములను లోఁగొని వాణిజ్య।మాచరింప వైశ్యుఁడనఁగనొప్పె॥
౮౦॥ క॥ తన మొదటిజాతిధర్మం । బునుదొలఁగి యశౌచ హింస బొంకు
లచేఁ గ్రూ । ర్యనుపమవృత్తితమోగుణుఁ । డునునగుట శూద్రుడనఁగ
నుర్విం జెలఁగెన్ ॥ ఆ-వె॥ జ్ఞాన దాన శౌచ సత్యక్షమాహింస।భూతద
యలు నంత్య జాతునందుఁ।గలిగియున్న నతఁడు గాఁడు చండాలుండు।
నుత్తముఁడగు । బ్రాహ్మణుండుగాని॥౮౨॥ ఆ-వె॥ జ్ఞానసత్యములను
మాని హింసానృత।జారచోరకపట క్రూరవృత్తి। నొనరసల్పుబ్రాహ్మ
ణుండైన చండాలుఁ।డతఁడె చూడఁగాను నరకుఁడు॥ ౮౩॥ క॥ కుల
ములు దలఁపఁగఁబుట్టుక।వలనను వచ్చినవిగావ వసుమతి జనముల్ పొలు
పొందఁజేయువృత్తుల । వలనను సంభవములయ్యె వర్ణింపఁగన్ ॥౮౪॥ సీ॥
గణుతింపఁగా విశ్వ కర్మకులజుఁడొక్క తాఁడికేవురు కూర్మి తన
యులైన।వరుసకమ్మరశిల్ప వడ్రంగముగ నాల-కంచరంబాదిగాఁ గల్గు
పనులు । నొక్కొక్క నందనుం డొక్కొక్క పనిఁజేయ-వారికి వేర్వేరు
వచ్చుపేరు।లొరులుహాలికవృత్తినొనరింపరైతులు-వాణిజ్యమొనరింప-
వర్తకులని-చెప్పుదురెవరేవృత్తినిఁ జేసి రేని।వారివారల నాపేరువచ్చు
చుండు । నవనివృత్తులచేఁగల్గు నాఖ్యలెటుమిఁ।గులములనఁ బోల్చుచుం
దురు కుటిలమతులు॥ ౮౫॥ ఆ-వె॥ ఘనుము కమ్మరీఁడు మను బ్రహ్మ
మయుఁడు వ।డ్రంగి త్వష్టకంచరంబు శిల్పి।పరఁగ నెన్నఁ గాశి పనివాఁడు
విశ్వజ్ఞుఁ । డరయఁగ నగసాలయగుసుగాన॥క॥ ఇలఁ బంచబ్రహ్మలకును।
కలిగిన వారెవరుగారు గన బ్రాహ్మణులున్ ।గులమున నప్పంచబ్ర।హ్మలు
నైననుగారు బ్రహ్మ భావులుగాకన్ ॥౮౭॥ క॥ అనవిని స్త్రీ పురుషాదుల।
జననము భేదంబులెట్లు సంభవమయ్యెన్ । వినిపింపుమనిన దుక్కీశగని
నవ్వుచుఁ జెప్పఁదొడఁగె గంసహారుఁడున్ ॥ ౮౮॥సీ॥ స్త్రీపురుషోత్పత్తి

—: పిండోత్పత్తి లక్షణము. :—

జెప్పెద వినుమింకఁ-దరుణిముట్టైనదైయె ఽ దవదినంబు। మొదలు జేసి దివసఽ
ముల గర్భమొనరిన । నాతికి నుదయించు ఽ నాత్మజుండు షట్కాష్ట దశ
మాదిఽసరివాసరములందుఁఽబాలతికిఁ జూలైనఁఽబుత్రిగాంచు । మఱియుఁ
బురుషుని శుక్లఽమధికరించినయోని-వలనొప్పనల్లనిఽవర్ణముగను। మెలఁత
శోణితంబు ఽ మిగులైన నెజ్జని । చాయయగును రెండు ఽ సమమునైన।
సంభవించుచుఁద్రు ఽ చామనవర్ణమై । బిసరుహాక్షులకునుఽబిడ్డలిట్టు॥గీ॥
క॥ పురుషుని వీర్యస్ఖలనం । బిరువుగనగు వేళఁ జెదరి ఽ యిరుబిందువులై ।
తరుణి యుదరంబుఁ జొచ్చిన ఽ నరుదారఁగ జంటబిడ్డ ఽ లగుదురు సతికిన్॥
౬౦॥ సీ॥ రతిసల్ప ఋతువేళ ఽ రవినాడి గొమరుఁడౌఁ – గుముదాప్తుఁడు
నడువఁ ఽ గూతురగును। తరణినాడి యునింగి ఽ తత్త్వమందుఁ జరింపఁ బుట్టు
నపుంసక ఽ పురుషుఁడగుచు ఽ శశినాడి పాఱినఁఽజదలు తత్త్వంబునఁ-గాంత
యౌనది మాచ ఽ కన్యయగును । నిఁక సుషుమ్ననుగూడిఽయినచంద్రు
లుండినఁ। బంగ్వంధ వెడమూఁగఽబధిరులగుదు। రనిల తత్త్వమందుఽనతివకుఁ
జూలైన । నమిత ప్రసవ వేదఽనంబు గల్గు । నగ్నితత్త్వమందుఽనైనను
గర్భంబుఁ । జెడును నిశ్చయంబు ఽ చేడియలకు। ౬౧॥ క॥ మాయను జెం
దియు నీగతిఁ । బాయక స్త్రీ పురుషులగుచుఁ ఽ బశుకీటక । దుష్టాయ
ములెత్తుచు జీవుఁడు । మాయను బాయంగలేడు ఽ మానినివింటె।౬౨॥
సీ॥ క్షణభంగురంబని ఽ చర్చింపలేక యీతనువు శాశ్వతమంచుఁఽదలఁచి
నరుఁడు । భ్రాంతుఁడై యిలఁదానుఽబ్రతికినన్నాళ్లును-మోహవారాశినిఽ
మునిఁగియుండుఁ బగటికాలము కుటుం ఽ బాది సంరక్షణ-కును ధనధాన్య
ముల్ ఽ గూర్చుకొనుచు ఽ రాత్రికాలము సతీ ఽ రతులచేఁ గొంతయు –
గలల నిద్రలఁగొంత ఽ గడపుకొనుచు । నంతలోఁజచ్చు బహుగర్భఽనర
కములను । గాంచు సుఖదుఃఖ జన్మాదిఽకములఁ బడుచు । గాలమూరక
యీరీతిఁ ఽ గడుపుఁగాని । తాను గడతేరు మార్గంబుఁఽదలఁచఁడెపుడు॥క॥
అనవుడు మరణము నిల్పెడు । ఘనులెవ్వరునైనఁ గలరె ఽ గల్గువిపత్తుల్।
చనఁజేయన నినఁగాంతకు। ననుమోదముతోడఁ గృష్ణుఁడపుడిట్లనియెన్।
చ॥ అరయఁగ నూఱువత్సరము-లాయువటందురు మానవాళికిన్ । హరు

—: ప్రాప్తకర్మలక్షణము. :—

వుగ బాల్యమందుననో ఽ యౌవనమందునో వార్ధకాననో । పురమునఁ
గాననంబుననో ఽ భూరుహ మగ్నిజలంబు లందునో। మరణమె నిశ్చయం
బుసుమి ఽ మానదు ధాత్రినిఁ ప్రాణికోటికిన్॥౬౩॥ క॥ మరణము వచ్చిన

వేళను। ధరఁ దూఱినజలధిఁ జొచ్చిఽదాఁగిననైనన్ । మఱిమింటికెగసిపోయినఁ । బరమాయువు నిల్వవళ మెఽబ్రహ్మకునైనన్॥ ౧౬॥ క॥ ప్రతిదేవతకును మ్రొక్కిన । బ్రతుకనివాఁడెన్నటికిని ఽ బ్రతుకఁడు జగతిన్ । బ్రతికెడువానికి మ్రొక్కిన । బ్రతుకును మఱి మ్రొక్కకున్న ఽ బ్రతుకును గాకన్॥ ౧౭॥ చ॥ మఱిమఱి యౌషధంబులను ఽ మంచివి మంచివి యారగించినన్ । బరువడిఁ జెందు కర్మ పరి ఽ పక్వము గాక యెపోవు జాడ్యముల్ । వరుసగ మంత్రయంత్రకులు ఽ వైద్యులునాయతకోట్లువచ్చినన్ మరణము పూర్ణమై చనెడు ఽ మానవునిం బ్రతికింపలేరిలన్। ౧౮॥ చ॥ తడయక యింటిమూలలను ఽ దాఁచినద్రవ్యమువోవువీధిలోఁ । బడినను నుండుబొమ్మదియుఁ ఽ బ్రాప్తముగల్గినఁ జిక్కువానికే। కడుబలుఁడైన బంధువులుఽ కాపుగనున్నను జచ్చునింటనే। నడవిని దిక్కులేని నరుఽడైనను రక్షణ మొందుచుండెడిన్॥ ౧౯॥ తే-గీ॥ దైవయోగంబు దెలియంగఁ ఽదరమె సర్వ। జీవులను నెల్లఁ దనకుఁదఽ సృష్టిఁ జేయుఁ । బోషణముఁ జేయు సర్వంబుఁ ఽ బొలియఁ జేయు । నాతఁడే మూలకారణం ఽ బఖిలమునకు॥ ౨౦॥ ఆ-వె॥ నేనెకర్తనంచుఽ నెంచును మనుజుండు। తానెకర్తయైనఽ దైవమేల । యైన పనులకెల్ల ఽ నైనను దాఁ గర్త। కాని పనులకేల కర్తగాఁడొ॥ ౨౧॥ క॥ తనయిష్టము సమకూరినఁ ॥ దన ప్రజ్ఞయటంచు నరుఁడుఽ దలఁచుచునుండున్ । దనదలఁపు నెగడకుండినఁ । దన ప్రారబ్ధంబటంచు ఽ దైవముఁ దూఱున్ ॥ ౨౨॥ తే-గీ॥ ఎవరి కేవేళ కేమిఽ యెట్లులెట్లు । జరుగవలెనా తెఱంగున ఽ జరుగుచుండ । నహముచేతను దమప్రజ్ఞఽ యనుచుఁ గాని। యెవరికైనను గర్తృత్వఽ మేమిగలదు॥ క॥ సముదయ కాలమునందున । సమయుని నెడన్ లేకయుండుఽ స్వాతంత్ర్యంబుల్ దమకెట్లుగల్గు మధ్యను। భ్రమగాని మూన్నాళ్లమిట్టిఽపడుజీవులకున్ ॥ ౨౪॥ క॥ చావును డగ్గఱఁ జావక । యేవిధకష్టములఁ బడక । యిలసుఖియై తాఁ। జావవలెనన్నయప్పుడె । చావంగావలయుఁ గర్త । జనుఁడైయున్నన్॥ ౨౫॥ తే-గీ॥ కష్టములె వచ్చునో సుఖమే ఽ గలుగఁబోనో । యెఱుఁగ శక్యమె యేవేళ ఽ కేదియేది । ప్రాప్తమానదె తమకర్మ ఽ ఫలములంచు! నెఱుఁగవలయును నిలలోన ఽ నెవ్వరైన॥ ౨౬॥ ఉ॥ కూరిమిమీఱ మానవులు ఽ గోరుచునుందురు సౌఖ్యమెప్పుడున్ । గారవమొప్పఁ గష్టములుఽ గానలెనంచును గోరరెవ్వరున్ । గోరకవచ్చు గష్టములు ఽ కోరినరావు సుఖంబులేరికిన్। వారల పాపపుణ్యములెఽవారికొనర్చును గష్టసౌఖ్యముల్॥ ఆ-వె॥ అతివవానివాని ఽ ఋతుకాలమునఁ బుష్ప। ఫలము లెట్లుదోఁచు-పాదపములఁ।

గర్మతరులనట్లు।గల్గును సుఖదుఃఖ|ములును నప్రయత్న । ముగను ద
ఱిని॥ ౭౮॥ తే-గీ॥ అరయఁ దమపూర్వపుణ్యంబు । లనుభవించు । కాల
మున నల్పులకునైన।గల్గు సుఖము|పరఁగఁ దొలిజన్మమునఁ జేయు|పాప
ఫలము|ననుభవించకున్నను దీఱ।దధికులైన॥ ౭౯॥ క॥ ఇలను హరిశ్చం
ద్రుండును|నలుఁడాదిగఁ బొందినట్టి।నానాకష్టం । బుల నెవ్వరైన జగ
తినిఁ|దొలఁగించిరె కర్మఫలము । దుడిచినఁబోనే॥ ఆ-వె॥ కర్మఫలము
చేత।గష్టసుఖంబులు । లనుభవింపఁ జేయ।నదియుఁబాప॥ ౮౧॥ క॥ నేనే
గలఁడె దుఃఖసుఖంబు ! లనుభవింపఁ జేయ|నదియుఁబాప॥ ౮౧॥ క॥ నేనే
కర్తయటన్నను|మానవునిఁ జూచి కర్మ।మాటికినవ్వున్ । నేనీ రేడుజగం
బుల । లోనను గల ప్రాణికోటి।లోఁ జేతునన౯॥ ౮౨॥ సీ॥ కర్మాను
బంధానఁ । గల్గును సంగంబు - కర్మాంతకాలాన । గతమునొందుఁ ।
బెండ్లాము బిడ్డలు।ప్రియబంధులు హితులు।దల్లిదండ్రులు నన్న।దమ్ము
లంచు । సాధనంబు గృహంబు।నాభూము లివియంచుఁ గర్మతంత్రమున
న । జ్ఞానవశత|నీ జీవ తనువులే । నిక్కంబుగానెంచి - చిక్కంబులోఁ
బిట్ట।చిక్కుభంగి । జనుఁడు మిథ్యయైన - సంసారమునఁజిక్కి । యదియె
సత్యలోక।మదియె స్వర్గ|మదియె విష్ణులోక।మదియె కైలాసంబు|గాను
నమ్మి ముక్తి।గానలేఁడు॥ ౮౩॥ ఆ-వె॥ సంచితంబు కతన।జన్మంబు గలి
గెను । జన్మవలనఁ గలిగె।స్వానుభవము । స్వానుభవము వలన । జన్మ
ప్రాప్తియె గాన । సంచితంబె విత్తుజన్మమునకు॥ ౮౪॥ కం॥ హారమగు
సంచితంబుల । భారంబును దొలఁగఁదొలఁగు । ప్రారబ్ధంబు దొలంగిన|
తోరపునాగామి జన్మ । దొలఁగు నరునకు౯॥౮౫॥ ఆ-వె॥ కలుగుచుండు
బుద్ధి।కర్మానుసరణిగాఁ । జిత్తమనుసరించి । చేయుపనులు । సేఁతననుస
రించి । చెందుఫలంబును । గడవలేరు కర్మఁ । బుడమి నరులు॥౮౬॥క॥
అన ఫలము పురుషయత్నం|బును లేక యెదైవమిడునొ।పురుషునియత్నం
బున నేఫలము లభించునొ । యనియడిగిన శకటదైత్య । హరుఁడిట్ల
నియె౯॥ ౮౭॥ క॥ కొందఱు పౌరుషమే ఫల|మందురు దైవమనికొందఱ
అందురు మఱియు౯ । గొందఱు భూతన్యాయం । బందురు దెలియకను
గర్మ।పద్ధతులబలా॥ ౮౮॥ తే-గీ॥ జోకతోఁ బురుషయత్నంబు । లేక
యున్న|దైవమేరీతి ఫలమును । దమకునిచ్చుఁ|దాము యత్నంబుఁజేసిన।
దైవమొసఁగు । వారివారల కర్మాను।సారముగను॥౮౯॥ క॥ వనజాక్షి
పురుషయత్నం|బును గలిగియు దైవయత్న । మును లేకఫలం| బొనరదు
మనుజప్రయత్నం । బులు లేకయు దైవయత్న।ముగలిగియున్న౯॥ ౯౦॥

తే-గీ॥ ధరణివంటిది పురుషయ త్నంబు బీజ। మరయఁగా దైవసహా కారమవియు రెండు। నేకమైనను ఫలియించు నిష్టసిద్ధి। యట్లుగాకున్న ఫలమీయ దండ్రు బుధులు॥ ౯౧॥ క॥ వినుధాత్రి లేనిబీజం। బును బీజములేని క్షేత్రమును నిష్ఫలమ। ట్లనుపమకార్యఫలంబును। గనుటు త్తది పురుషదైవికము లొనరకయున్॥ ౯౨॥ తే-గీ॥ చమురునింకిన దీపంబు సమయుపోల్కి। మనుజుఁడును గార్యయత్నంబు మానినపుడె॥ వరుసగఁ దొలగిపోను దై వానుకూల। మనియెడు నదృష్టమెంతయు వనజగంధి॥ ౯౩॥ క॥ మనుజుఁడు యత్నముఁ జేయక। తన ప్రాప్తంబనినఁ దనకు దైవంబెచటన్। గొనివచ్చి పెట్టు యత్నం। బనువుగఁ గావింప వారి భాగ్యము పిదపన్॥ ౯౪॥ ఆ-వె॥ అగ్నికొంచమైన ననిలంబునఁ బ్రబల। మైన చందమునను మరి సుకర్మ। వృద్ధినొందుచుండు వెలయ దైవానుకూ। లమున యత్నమున ఫలంబు గలుగు॥ ౯౫॥ క॥ మును సత్కర్మం బించుక। యును జేయక యత్నములను నొనరించినయా। తనికిని దైవముతోడ్పడఁ॥ డనువుగఁ గర్మముల నీయఁ। డతనికి ఫలమున్॥ ౯౬॥ క॥ వినుపౌరుషంబుకంటెను। ఘనమగు దైవంబుముఖ్య కారణము ఫలం। బునునైనఁ బౌరుషంబును। మనమలరఁగ దైవదత్త మనఁదగు నదియున్॥ క॥ అన భక్తియెన్ని తెఱఁగులు। వినిపింపుమదియు నెట్టి విధముననగు నే। యనవునఁ గల్గును జ్ఞానము। మనుజునకన నింతిఁ

—: భక్తిలక్షణము. :—

జూచి మాధవుఁడనియెన్॥ ౯౭॥ ఆ-వె॥ వినుము భక్తి మూఁడు విధములునగు బాహ్య। భక్తియన ననన్య భక్తియనఁగ। నెసఁగుఁ బంకజాక్షి యేకాంత భక్తినా। వెలయుఁ దద్విధంబుఁ దెలియవలయు॥ ౯౮॥ ఆ-వె॥ శ్రవణకీర్తనంబు స్మరణంబుఁ బాదసే। వనము నర్చనంబు వందనంబు। నతుల దాస్యసఖ్య మాత్మనివేదనం। బనఁగ నవవిధములు బాహ్యభక్తి॥ ౧౦౦॥ క॥ పరమయము విశ్వమనియును। బరమా విశ్వమయుమనియుఁ బరమున కన్యం బరయఁగ లేదని హృదయము। స్థిరమాటయనన్య భక్తి సిద్ధము తరుణీ॥ ౧౦౧॥ క॥ పెదపులు గదలింపం మది। సదయతఁ బరమాత్మఁ గూర్చి చక్కఁగ మదినిం। పొదవఁగఁ దదేకనిష్ఠగ। నదియగు నేకాంతభక్తి హంసవిహారీ॥ ౧౦౨॥ క॥ విను సత్కర్మాచరణం। బున భక్తియుఁ బొడలుదానఁ బొందును జ్ఞానం। బును కర్మ లేక భక్తియు। మును భక్తియ లేకగాదు మోక్షపదంబున్॥ ౧౦౩॥ ఆ-వె॥ వరసు కర్మ పిండెవంటిది దానిచేఁ బడయు భక్తి కాయ వంటిదరయ। దాని

వలనఁగల్గు జ్ఞానంబు భావింపఁ । బందువంటిదగును బద్మనేత్ర॥ ౧౦౪॥ ఆ-వె॥ కర్మయనెడు పిందె గతమైన భక్తియుఁ గాయ లేదు పలఁపఁ గర్మయనెడు । పిందె చెడకయున్నఁ బెంపొందు భక్తి కాయ। యదియుఁ జెడినఁ గల్గు దాత్మఫలము॥ క॥ వనితా కర్మము భక్తియు। నొనరింపక జ్ఞానమొంద నోప రెవండ్రుఁ । విను మొదలుఁబట్టి వృక్షం । బును బ్రాకక యగ్రమునకుఁ బోవఁగలరే॥ ౧౦౫॥ ఆ-వె॥ నిట్టనిలువుగాను నిలుచున్నవాఁడు గూ । ర్చుండి పండుకొనిన సుఖమునొందు । పరఁగ నట్లనిలిచి పడుకొనఁబోయిన। వసుధఁగూలి శిరము వ్రయ్యఁగాదె॥ ౧౦౬॥ క॥ మునుభక్తిలేనిజ్ఞానం। బును జ్ఞానము లేసి భక్తి బొందరు ముక్తిఁ జను లంటు। నట్లుగావునఁ। గనఁ దగునిల జ్ఞానభక్తి కర్మములట్లుఁ॥ ౧౦౭॥ ఆ-వె॥ కర్మచయమువలనఁ గల్గును జ్ఞానంబు । జ్ఞానంబునను బాయుఁ గర్మచయము । కర్మమునకుదవ్వు జ్ఞానియు భావింప జ్ఞానికొనరదవ్వు కర్మచయము॥ ౧౦౮॥ క॥ అని తెల్పు చక్రపాణినిఁ। గనుఁగొని గర్మంబులెన్ని గతులగుఁ గర్మం । బన నెద్దియనిన రుక్మిణి । కినిఁ దెల్పఁగ నిట్టులనియెఁ

—: కర్మలక్షణము. :—

గృష్ణుం డెలమిఁ॥ క॥ కొందఱు కర్మము పద్ధతు। లందరు మఱి కొందఱిలను నదియు ద్వివిధమా। నందురు తద్ద్వివిధముల నిటఁ। బొందుగ వినిపింతు వినుము పూర్ణేందుముఖి॥ ౧౧౧॥ తే-గీ॥ మొదట లౌకిక వైదికములనఁ గర్మ రెండు పద్ధతులందు రా రెంటియందు । లోక కార్యంబులను నెల్ల జోకతోడ । నాచరించుట లౌకికం బండ్రు బుధులు॥ ౧౧౨॥ వ॥ ఓ యిందుముఖీ యందు వైదికంబు నిత్యనైమిత్తిక కామ్యనిషిద్ధప్రాయశ్చిత్తంబులను కర్మంబులైదువిధంబులని చెప్పుదురిప్పుడు వానిచందంబుఁ దేటపడ వివరింతు నాకర్ణింపుము॥ ౧౧౩॥ తే-గీ॥ దేవతర్పణమును వైశ్వ దేవహోమ । స్నాన సంధ్యాభివందన జపతపంబు । లర్థిసత్కారములు నాదిగ నాచరించు। నదియెపో నిత్యకర్మంబ నంగనొప్పు॥ ౧౧౪॥ తే-గీ॥ తలఁప సంక్రాంతి నుత్తర దక్షిణాయ । నముల నర్థమహోదయ విమల పర్వ । దినములను స్నానజపములను దీర్చుకొనుట । యాదినైమిత్తికపుఁ గర్మమనఁగఁ బరఁగు॥ ౧౧౫॥ ఆ-వె॥ రమణి యశ్వమేధ రాజసూయాధ్వర । పౌండరీక సోమ మాది గల్గు । యాగములను బ్రీతి నను నొందఁజేయుట । కామ్యకర్మమనఁగ గణుతికెక్కు॥ ౧౧౬॥ క॥ పరధనహార పరనిందా। పరదారాగమన మద్యపానవిచేష్టా। పరహింసానృతచలత । స్కరమాది నిషిద్ధకర్మ గాఁ దెలియదగుఁ॥ ౧౧౭॥ క॥ జల

వాయువర్ణభక్షణ|సలుపుట వనవాసముంట · చాంద్రాయణముల|సలుపుటయుఁ దీర్ఘయాత్రలు । నిల ప్రాయశ్చిత్తకర్మ·నియతి యనఁదగుౘ॥ ౧౧౯॥ వ॥ ఇంకను నిషిద్ధకర్మంబునకుఁ బంచగవ్యాది కర్మంబు లాచరింతురని చెప్పి యోకాంతామణీ యిప్పుడిరుమూడు దెఱంగులకర్మ తెఱంగెఱింగించితి నింక సుకర్మ దుష్కర్మ జ్ఞానకర్మంబులను నీ ముత్తెఱంగుల కర్మ చందంబెఱిగింతు వినుమని యిట్లనియె॥ సీ॥ గుడిగోపురములాది · కూపతటాకముల్ – ధరణినిల్పుట సూన్మ · తాత్ముఁడౌట| తగ నన్నదాన సత్రము తేర్పరించుట- సదమలాధ్వరములు · నల్పుటయును । నేకనారీవ్రతా · న్మితుఁడుగానుండుట – నిలనహింసావిషయ · నియతుఁడౌట । నర్థిబంధువుగురు · నాలిఁబోషించుట – నిత్యసత్క్రియలాది · నెఱపుటయును దైవభక్తియు బుధసేవ·ధర్మవృత్తి|నాచరించుట తీర్థాది|యాత్రలకును । జనుట సత్కథల్ వినుటయుఁ · జదువుటయును । నాదిగఁగలది సత్కర్మ · యనఁగనొప్పు॥ ౧౨౦॥ సీ॥ పితృ మాతృలను గాసి·పెట్టుటయును జీవ-హత్యయు జ్ఞాతిద్రోహ·హాదికమును|బరసతీసంగంబుఁ·బరదూషణంబునుబరధనచౌర్యంబు·బరవిరసముఁ|దీఱనిక్రోధంబు· దేవవిద్వేషంబు–గురువంచనంబును · గుజనమైత్రి|నన్నృతంబుగపటము· నార్యకార్యంబును–మద్యపానము జూద·మాడుటయును । వేదదూషణ సత్ప్రవృత్తి·విడుచుటయును । బరుల తేజంబు కోర్వమి · బ్రల్లదనముఁ । బొరయుటయు నాత్మవినుతియు · దురితచేష్ట । లాదిగఁగలది దుష్కర్మ·యనఁగబరఁగు॥ ౧౨౧॥ సీ॥ సతిసుతహితబంధు · సంసారమునఁ గల్గు – ననుభవంబులు మాయ·యంచుఁ దెలిసి|శమసౌచదమసత్య · సద్గుణసహితుఁడై – సద్గురూత్తముపాద · సరసిజములు । సేవించి నిరతంబు · సేవఁజేయుచు గురుకరుణచేఁ దన్నుఁదాఁ·గాంచి తెలివి|తనువు నింద్రియమును · తాను గానని యాత్మ-తత్వమే తానని·తగ నెఱింగి|మఱియు సత్కర్మదుష్కర్మ·మనఁగ·బరఁగు । బీజములరెంటి జ్ఞానాగ్ని · వేల్చి తాను । మానకను సచ్చిదానంద · మయుఁడునగుట । జ్ఞానకర్మం బనఁబడు · సారసాక్షి॥ ౧౨౨॥ చ॥ చెలువుగఁజేసి|పుణ్యములు · చెందుచు నుందురు పుణ్యలోకముల్ । కలుషము లాచరించియును · గాంతురు నూయమలోక బాధలౘ|బొలువుగఁ గష్టసౌఖ్యములు · పొందుచునుందురు మర్త్యలోగతిౘ । గలుషము పుణ్యముౘ దొఱఁగి · గానరెయార్యులు జన్మశూన్యముౘ॥ ౧౨౩॥ ఆ-వె॥ అనినఁ గష్ట సుఖము · లవని జనించియే । నరులు కర్మఫలము · ననుభవింప । నరయఁబడవు· తేల·నరకంబునిం కేల । యనినఁ

గాంతకనిమె ఽ నాత్మవిభుఁడు॥౧౨౪॥ సీ॥ వనజాక్షి యాస్వర్గ ఽ వైకుంఠ కైలాస - బ్రహ్మలోకాది సత్పదవులకును। బోవఁజాలినయంత ఽ పుణ్యముల్ సేసిన - వార లాయా లోక ఽ వైభవములు। వడయుదు రాపుణ్య ఽ పదవులకును నేగఁ-జాలని సుకృతంబు ఽ సల్పునట్టి। జనులు మర్త్యమున నే ఽ జనియించి తమతమ - పుణ్యముల కొలఁది ఽ భోగములను। బొందుచుండెద రీ రీతిఁ ఽ బుణ్యుఁ బోణి। పుణ్యలోకంబులకు నేగు ఽ పుణ్యులైన। వారి వారలపుణ్యముల్ ఽ వరుసఁగుడిచి। మగుడి జన్మింతు రీ యుర్వి ఽ మనుజుల గుచు॥ ౧౨౫॥ సీ॥ బహుపాపములు సేయు ఽ పాపాత్ములకునైన - స్వల్ప పాపమొనర్చు ఽ జనులకైనఁ। బోక తీఱదు యము ఽ పురి కంత్యకాలాన నాదండధరు శిక్ష ఽ కర్హమైన। నటనరుల్ బాధింతు ఽ రా శిక్షకును జాల-నట్టివారలు యము ఽ నాజ్ఞ మరల। ధరణిఁబుట్టియు రాజ ఽ దండన రుగ్మ దా - రిద్ర్యముల్ విషమృగో ఽ పద్రవములు। నాదిగాఁగాంతురది గాక ఽ నరకలోక। పాత్రులయి శిక్షతగుభంగిఁ ఽ బడసియంతఁ। బక్షికీటక క్రిమిమృగ ఽ పశువునాది। జన్మములు నొందుచుందురీ ఽ జగతిలోన॥ ౧౨౬॥ క॥ నావుడు కాయముఁబాసియు ఽ జీవుండేలాగు పోవు ఽ జెందును బదవుల్। ఏవిధమునొందు బాధలు। భావించియుఁ దెల్పుమనినఁ ఽ బరమాత్ముఁడనుః ॥ ౧౨౭॥ సీ॥ కలయందుఁ దానేగి ఽ ఘనముగా నొకచోవి - విధసౌఖ్యము లనుభ ఽ వించినట్లు। లీ మేనువిడనాడి ఽ యీలోకము మఱచి-యతిసుకుమార దే ఽ హములు దాల్చి। పుణ్యాత్ములగువారు ఽ పుణ్యలోకముఁకు ఽ నరుదెంచి భోగంబు ఽ లందఁగలరు। స్వప్నానఁ రానొక్క ఽ సదనంబునకుఁబోయి బహుకష్టముల నెల్లఁ ఽ బడినరీతి। దేహములఁ బాసియతరా ఽ దేహములను। బడసియీలోకజాలంబు ఽ మఱచి ఖలులు। పోయియమలోక శిక్షలు ఽ పొందగలరు। నిశ్చయంబింతయును భామి ఽ సి లలామ॥ ౧౨౮॥ క॥ అనవుడు భూలోకసుఖం। బునకును నాపదవులకును ఽ బోల్పఁగ భేదం। బునుగలదె దెల్పుమనుసతిఁ। గనిక్రియ మునినిట్టులని యెఁ ఽ గమలాక్షుండుః॥ ౧౨౯॥ సీ॥ ఘనముగా భూలోక ఽ జనులకందఱికంటెఁ - బరికింప హెచ్చు భూ ఽ పతిసుఖంబు। భూపతినూ ఱేండ్లు ఽ భువిని ననుభవింప - నతులితానందమై - నట్టిసుఖము। మును దేవతాసుఖ ఽ మునకొక్క కనురెప్పపాటు కాలములకు ఽ సాటిగాదు। భూలోక సుఖమేడఁ ఽ బుణ్యలోకంబుల సుఖమేడఁదిలపోయ ఽ సుందరాంగి। యమితపుణ్యంబు లనుజేయు ఽ నట్టివారు। గాకయీలోకసుఖములు ఽ గాంచగలరె। యట్టిపదవులకును జాల ఽ నట్టినరులె। పుడమిపై

రాజులాదిగాఁ ~ బుట్టుదురుగ॥ ౧౩౦॥ ఆ-వె॥ సుదతి యిలవిగాని ~ సుఖ మదిగనుక నే।పదవులందునెల్ల ~ భ్రాంతిపడుట । యిలను వాక్కురైన ~ దలపోయ నరకంబు।గోరువారు~గలరెసారసాక్షి॥ క॥ ఎంతటి పుణ్యముఁ జేసిన।నంతటి ఫలమొందుఁగాక ~ నరులకు నిలనౌ ~ క్కింత సుకర్మము సేయక । యెంతగఁ గోరినను రావు ~ హెచ్చు సుఖంబుల్॥ ౧౩౨॥ క॥ భూజనులకెల్ల వారికి । రాజత్వము చేయుబుద్ధి~రంజిల్లుచుండుఁ। రాజత్వ మెట్లు సేతురు । భూజనులరయంగ స్వల్ప~పుణ్యులుగానన్॥ ౧౩౩॥ క॥ రాజునకుఁ గల్గుచేతులు భూజనులకులేదె యతని ~ పుణ్యంబదియున్ । భూజనులకెట్లుగల్గును । రాజత్వము సేయుటకును ~ రాజీవాక్షీ॥ ౧౩౪. ఆ-వె॥ అఖిలజనులుతన్ను ~ ననుసరించియుఁ గొల్చు।నంతఫలమురాజ~ నాచరించె । నంతఫలముఁ జేయ ~ నట్టివారలు రాజ్య । భోగములను గోరఁ ~ బొందనగునె॥ ౧౩౫॥ క॥ నావుడు యమలోకంబున । నేవిధకర్ములకు మఱియు~ నేయేశిక్షల్ । గావింతు రనుచుఁ బల్కిన।నా వికచదళాక్షిఁజూచి~హరియిట్లనియెన్॥ ౧౩౬॥ క॥ వనజాక్షి పుణ్యచరితము। వినిపింపఁగవచ్చునీవు ~ వినంగావచ్చున్।మును పాపజనుల వర్తన। లను

## యమదండనవివరణము.

వినఁదగనైన వినుము ~ లని నెఱింగింతున్॥ ౧౩౭॥ సీ॥ కలుషాత్ములకు నంత్య~కాలంబునందునఁ - గాలదూతలు గదా ~ ఖడ్గపాశ । ధారులై భీకరా~కారులై తమచుట్టు-ముట్టడించియుఁ బాశ-ములనుజుట్టి । పట్టికల్వర మొందఁ~బ్రాణముల్ పెకలించి-యాతనా దేహంబు ~ లఁదముఁజేర్చి। నీళ్లనుబ్బలిగండ్ల~నిప్పుగుండంబుల - రాళ్లగుట్టలముండ్ల ~ రాసులమిత । తేళ్లుపాములు బెనగొను ~ తెరువులందు। నడచుఫుట్టంగ నడిపించి ~ యఘజనాళి। మొఱలువెట్టంగ యమలోక ~ మునకు దూత । లట్లుగొంపోయి యముమ్రోలఁ~బెట్టినిలువ॥ ౧౩౮॥ క॥ శమనుం డెవరెవరికనే । క్రమమున దండింప నాజ్ఞ~గావించునో యా।క్రమమున బాధలు పెట్టుదు।రమరంగా యమునిభృత్యు ~ లదియెట్లనిన్॥ ౧౩౯॥ఆ-వె॥చెలఁగివేఁటకతన ~ జీవుల హింసించు । పాపిజనుల నోడలు~బడలఁగొట్టి। యుక్కుటింపములను ~ నురువడిఁ గోతురు । వెక్కివెక్కియేడ్చి ~ మ్రొక్కలిడఁగ॥ ౧౪౦॥ క॥ తలిదండ్రుల బాధించిన । తులువనువడిఁ గ్రాగునూనె ~ తొట్లను వరుసన్।బలుమాఱు వేసిముంతురు । మలమలమాడంగ మేను~ మఱి వడఁకంగన్। ౧౪౧॥ ఆ-వె॥ జాతులెన్ని నట్టి~చండాలునకు సర్వ । యెంగిళులను మెసవ ~ నెసఁగఁబెట్టి। యతిభయంకరంబు ~ నైన చీఁకటి

కోప । యమదూ తొంటిమంతు ఽ రడలువాడన॥ ౧౮౨॥ క॥ పరులకు
నెగ్గొనరించిన । దురితాత్ముని బాపమనక ఽ దుష్టఫణులచే । మరిమరి
వృశ్చికములచేఁ । గఱపింతురు బొబ్బలిడుచు ఽ గాసిల్లంగన్ ॥౧౮౩॥ ఆ–వె॥
జారవృత్తిసల్పు ఽ జనసంతతుల భగ్గు । భగ్గుమండులోహ ఽ ప్రతిమలకును।
వడలియార్వఁబట్టి ఽ యంటింతురటు తొంటి । కామసుఖములిందుఁ ఽ
గాంచుఁడంచు॥ ౧౮౪॥ క॥ జ్ఞాతుల ద్రోహముఁ జేసిన। పాతకులను నంటఁ
గట్టి ఽ పశుచర్మములన్ । రోఁతగు దుర్గంధపు మల । పూతులఁబడఁద్రో
తురంత ఽ నోయనికూయన్॥ ఆ–వె॥ నిండుచెఱువులకును ఽ గండి వెట్టియు
నీళ్లు। వెడలఁగొట్టినట్టి ఽ జడులఁబట్టి। పరశుధారఁదలలు ఽ వగులంగ వేతురు।
కుయ్యొమొఱ్ఱోయంచుఁ ఽ గూఁతలిడఁగ॥ ౧౮౫॥ క॥ తెరువులకుఁ గంప
వేసిన । నరులను దలక్రిందునిలిపి ఽ నయనములందున్ । మరి దేహమందు
నెల్లెడ। నరువంగా నినుపముండ్లు నాటింతురొగిన్॥ ౧౮౬॥ తే–గీ॥ కచ్చ
కును గాలుద్రవ్వుచు ఽ గలహమునకుఁ । దిరుగువారల వడిఁబట్టి ఽ తెగువ
మీఱ। గడుభయంకర శక్తివర్గములచేత । సమిలి ద్రింగంగఁ జేయుదు ఽ
రాఱ్ఱు తెసఁగ॥ ౧౮౭॥ క॥ క్షితిని దురాపేక్షలుగల । మతిహీనుల కశన
మునకు ఽ మసిబిడి సీసం। బతిగాఁగాచియు శిరముల । నతులితముగఁ గోతు
రాత్మ ఽ లలమటనొందన్॥ ౧౮౮॥ ఆ–వె॥ మున్ను దేహసౌఖ్య ఽ మును
గోరి ప్రాణులఁ । జంపి జన్మములను ఽ సల్పువారిఁ । గఱకు త్రిశూల ఽ
ఖండఖండంబులు । గాఁగఁగోతురచట ఽ గాలభటులు॥ ౧౯౦॥ క॥ వారుణి
పానమొనర్చిన। క్రూరుని యమదూతలట్టె ఽ గొంపోయి క్రిముల్ । బారాడు
మూత్రగుండము। లోకయమునఁ ద్రోతురందు ఽ లోనల్లాడన్॥ ౧౯౧॥ తే–గీ॥
చెలఁగి గృహములు దహనంబు ఽ సేయుఖలుని। గుజ్జుదీసియుఁ దలఁబెద్ద ఽ గుం
డునెత్తి। వీధివీథులఁ ద్రిప్పియు ఽ। విషమయాగ్ని। గుండములఁ ద్రోతురత్యంత
ఘోషఁజెంద॥ ౧౯౨॥ క॥ పరధనముతస్కరించిన। నరులనసిపత్రవనము ఽ నం
దునవిడియున్ । బరువులు పాఱింతురుతమ। విరువంకలఁ దెగియుఁగండలిలపై
బడఁగన్॥ ౧౯౩॥ ఆ–వె॥ గురునిందసేయు ఽ ఘోరపాపాత్ముని । నట్టె
నూఱుయోజ ఽ నములుపొడవు। కొఱ్ఱుమొనయ నోటఁ ఽ గ్రుచ్చి వ్రేలా
డంగఁ । జేతురతఁడు వెఱపుఁ ఽ జెందియేడ్వ॥ ౧౯౪। క॥ నమ్మించి మోస
పుచ్చిన। యమ్మనుజాధములఁబట్టి ఽ యాగ్రహమెసఁగన్ । హుమ్మని నేలకు
వంచియు । సమ్మెటలన్ గొట్టుదురుగ ఽ శమనుని దూతల్॥ ౧౯౫॥ ఆ–వె॥
తగవుమాలి సభను ఽ దాబక్షపాతియై। మాటలాడునట్టి ఽ మంకుజనుని ఽ
గగనమందుచుండు ఽ నగముపై నెక్కించి । పడఁగఁద్రోతురాత్మ ఽ బడలు

కడఁగ॥ ౧౫౬॥ క॥ తెంపున విషమిడి యసువురి।కంపిన దుర్జనుల నగ్నిఁ బంబంబులకుర్।బెంపెల్లఁ దూలఁగట్టుదు। రింపుచలింపఁగ భటులుకృపహీన కరుణులై॥ ౧౫౭॥ ఆ-వె॥ దైవభక్తిలేని కృతంత్రజ్ఞులనుబట్టి। మశకమత్కుణాది కృమక్షికములు। గలుగు ఘోరమైన కృగాఢాంధకూపాన। ద్రోతురందుఁగూలికృదుఃఖమొందఁ॥ ౧౫౮॥ క॥ పరులను దూషించినయా।నరులను జిహ్వాలఁదునుముచు కృనాయమదూతల్। మరి యినుపముక్కు కాకులఁ।బోరిబోరి గుంపులనుగూర్చి కృపొడిపింతురొగిన్॥ ౧౫౯॥ ఆ-వె॥ అనృతములను నాడుకృనట్టి చండాలుని।మజ్జమాంసరక్త కృమకరమీన।వాసమైనయట్టి కృవైతరణీనది। యందుఁ బడఁగవైతు కృరడలుపుట్టఁ॥క॥ ఇలను బతివ్రతయగు స।త్కులకాంతను విడచినట్టి కృకుటిలమనుజునిన్। నిలువెల్లఁ దోలుదీసియుఁ।బలలము కుక్కలకుఁ గోసి కృపడవేతురడర్॥ తే-గీ॥ ధనికుఁడై త్రిసకర్థికి। దానమీని। కుజనునకుఁ గ్రొత్తసున్నఁబుఁ కృగుడువఁబెట్టి। పరిఁగఁ బల్లేరుకాయల కృపాన్పుమీఁదఁ। బండఁబెట్టుదురో యనికృబాధఁజెంద॥ ౧౬౨॥ క॥ మానిని సత్కథ లెన్నఁడు।వీనులఁ జొరనీనియధము కృవిడువకవడిగా। సూనెంబొంగఁగగాచియు। వీనుల లోఁబోతురమిత కృవేదననొందన్॥ ౧౬౩॥ ఆ-వె॥ ఒకని కలిమిఁజూచి కృయోరువఁజాలని। పశుసమానుఁబట్టి - బాడిసలను। జెక్కుచుంద్రు తనువు కృచిదురులై మరలను। నొక్కటిగనుగూడు కృచుండునదియు॥ ౧౬౪॥ క॥ దండింపఁదగని సాధుల। దండించిన పాతకులను కృదనపాశములన్। దండిగఁజుట్టియు మరిమరి। దండనగావించు యముఁడుకృదారుణశక్తిన్॥ ౧౬౫॥ ఆ-వె॥ బ్రహ్మవిదులఁజూచికృపరిహాసమొనరించు। పాతకులనుబట్టి కృపాపమనక।నరకఁగాయమెల్లకృజల్లెడకంతలు। వడఁగ నలుగుగముల కృబొడుతురందు॥ ౧౬౬॥ క॥ భూతలిబులశుచిఁజేయని। పాతకుబేతాళభూతకృబ్రహ్మదనుజదుర్। వ్రాతముల కొప్పగింతురు। ఖ్యాతిగ నవి పవలురాత్రి కృఘాతలుపెట్టన్॥ ౧౬౭॥ ఆ-వె॥ మేషకుక్కుటముల కృమృగపక్షిపశుసూక। రాదుల నిలఁగోసి కృయనుభవించు।నట్టివారిఁబట్టికృయారీతిఁగోయుదు। రక్కజముగ దూతకృలంబుజాక్షి॥ ౧౬౮॥క॥వలలూఁతలగాలంబుల। జలచరముల యుక్తిఁబట్టుకృజనులనుసుడియల్। గలిగిన మరపెట్టెలయం।దులవైచియు మరలు ద్రిప్పుకృదురు పొడిగాఁగన్॥౧౬౯। తే-గీ॥ ఒకఁడు సత్కార్యమును జేయ కృనుద్యమింప। నదియుఁగానీక చెడఁగొట్టు కృనట్టివాని। రాశిపోసిన సున్నపు కృగాలఁజేర్చి। కరియఁ బోతురు కేకలుకృపెట్టుచుండ॥ ౧౭౦॥ క॥ అతిథివెలినుండఁబెట్టక యతిస్త్రీ

తిని నిం టంగుడుచు ॰ నట్టి నరునకున్ । సతతంబును మలమూత్రములతి
నికి నాహారన్మృష్ణ ॰ లకు నిడురటన్॥ ౧౭౧ ఆ-వె॥ తనయునొకనికిత్తు॰
నని మరిమొకనికి । మాట నిచ్చునట్టి ॰ మనుజవితతి । నేకపాదముననుఁ॰
నిల్పి నారసముల । జిహ్వాలందునాటి ॰ చీల్తురబల॥ ౧౭౨॥ క॥ ఎన్నెన్ని
శ్రమలఁబెట్టినఁ । బన్నుగ జీవులును బాధఁ ॰ బడుటయెగాకన్ । జెన్నుగ
యాతన దేహము । లెన్నఁడుఁజెడిపోకయుండు ॰ నెప్పటియట్లన్॥ ౧౭౩॥
ఆ-వె॥ అరయఁ బెక్కుగలవు ॰ యమలోక బాధలు । చిత్రమిన్నియుంచుఁ ॰
జెప్పఁదరమె । యందు నేనుగొన్ని ॰ ననువొందఁ జెప్పితిఁ । జాలు నింత
వట్టు ॰ జలజవదన॥ ౧౭౪॥ ఉ॥ ఏరికినొందవచ్చు నిఁక ॰ నీ యిలబాధలు
నొక్కబాధలే । భారకరంబులా యమునిబాధలఁ జిక్కక యుండఁగా
వలెన్ । దారకమంత్ర తత్పరులు ॰ దక్కను నాయమలోకమందునన్ । జేర
నివారు బాధలను ॰ జెందనివారలు లేర యెవ్వరున్॥ ౧౭౫॥ ఆ-వె॥ దైవ
చింతచేతఁ ॰ దనరుమహాత్ముల । చెంతఁజేర వెఱచు ॰ నంతకుండు । నింక
వారిదూత ॰ లెంతమాత్రమువారి । కొనరమించినదియు॰ నొకటిగలదె॥
౧౭౬॥ క॥ పరతత్వ నిరతులగుచును । బరఁగెడునా ధన్యులకును ॰
బ్రహ్మేంద్రాదుల్ । హరిహరులు సురలుకాలుఁడు । స్థిరముగ సేవించి
ప్రణుతిఁ ॰ జేయుదు రెప్డున్॥ ౧౭౭॥ క॥ నావుడుఁబాపాత్ములుగాని । పోవు
టలాదిగనువింటిఁ॰బుణ్యుల నెటుగొం । పోదు రెవరికిఁ గనపడ । దావిధ
మనఁజక్రివక్క ॰ హరిణేక్షణతోన్॥ ౧౭౮॥ చ॥ నలువను విష్ణుశంకరుల॰
నమ్మినభక్తుల కంత్యమందునన్ । దొలఁగకవచ్చి వారినిజ॰దూతలువారిని
దివ్యపుష్పకం । బులనిడి ఛత్రచామరులు ॰ పువ్వులువైచుచు దేవతా
ప్సరల్ । పొలుపుగ నాదవాద్యములు ॰ బోరుకొనంగొని పోదురెంత
యున్॥ ౧౭౯॥ ఆ-వె॥ పుణ్యలోకమునకుఁ బోయినతోడనే । యుష్టభోగ
ప్రాప్తుఁడగుచునటు ని । రంతరంబు దేవ॰రంభాదిసంభోగ । యుతుఁడు
నగును బుణ్య ॰ యుతుఁడుమగువ॥ ౧౮౦॥ చ॥ ఒనరఁగ మేల్కతోఁ
బదుగు॰చున్ననొకండును గూర్కిస్వప్నమునన్ । గననదివానికేమొలుక ॰
గాక యెఱుఁగరుదక్కువారు న । ట్లనఁ శివవిష్ణుదూతలును॰నంతకుదూతలు
వచ్చి తమ్ముఁగ । గొని చనుచెల్లవారలకె ॰ గుఱ్ఱుగఁగాక యెఱుంగర
న్యులు౯ ॥ ౧౮౧॥ ఇలఁబుట్టి పెరుగుటయుఁ దా ॰ నలరంగాఁ గష్ట సుఖ
ము ॰ లాదిగఁగనుటన్ । దొలఁచుట పదవులు నరకముఁ । గలయంచు
నెఱింగి మేల్కఁ ॰ గాంచుమునీవున్॥ ౧౮౨॥ తే-గీ॥ పడతి యోచింప
సత్కర్మ ॰ పరులు సౌఖ్య । మనుభవింతురు దుష్కర్మ॰లధికశ్రమల।

నంతియేగాని పుణ్యాత్ము ఽ లధికమనుచుఁ । బాపకర్ములఁ దక్కఁగఁ ఽ బల్కరాదు॥౧౮౩॥ క॥ వినుపాపాత్ములకైనను । ఘనపుణ్యాత్ములకైనఁగాని యుపనిషదులిలో । జననమరణములుదప్పవు । ఘనతరముగ వారి వారిఽకర్మకొలఁదిన్॥ ౧౮౪॥క॥ భవమును దెచ్చును బాపము । భవమే గల్గించు పుణ్యఽ ఫలమీరెండున్ । దవులక మెలఁగినవాఁడే భవనాశము లెడలు ఘనుఁడుఽపావనుఁడరయన్॥ ౧౮౫॥ ఉ॥ కర్మముచేత జీవులకుఁఽ గల్గును జన్మము లెంచిచూడఁగాఁ । గర్మముచేతఁ బెంపగును ఽ గర్మముచేతనె గల్గు నాశమున్ । గర్మముచేత సౌఖ్యమును ఽ గర్మముచేతనె గల్గు దుఃఖమున్ । గర్మమె జన్మహేతువని ఽ కర్మముఁబాసినవాఁడు ముక్తుఁడౌ ౧౮౬॥ తే-గీ॥ గర్మరహితంబు దేనిచేఁ ఽ గాదుగురుని । కరుణచేతను బరమాత్మఁ ఽ గాంచినపుడె । కర్మబంధంబులెల్లను ఽ గడకుఁబాయుఁ । దపనబింబంబుఁ బొడగన్న ఽ తమముభంగి॥౧౮౭॥ క॥ ఉపవాసవ్రతక్రతువుల । జపదానాధ్యయనసంధ్యఽసత్స్నానములన్ । దపశాంతశమదమంబుల । నెప్పుడు నుమోక్షంబు నొంద ఽ నేరరుమనుజుల్॥ ౧౮౮॥ సీ॥ వసుమతి నరులకేఽ వస్తువర్గంబును – భుజియింప రోగముల్ఽపుట్టుచుండు । నట్టివస్తువెమరలఽ ననుభవించిన దేహ – రుగ్మతయెక్కువౌ ఽ రూఢిగాను । బరఁగఁ దత్ప్రతిహతంబైన యౌషధమును – గుడువక తద్వ్యాధి ఽ గుదురనట్లు । నగ్నిక్రియోపాసఽనవ్రతక్రతుతీర్థ-జపసత్య తపదానఽ శౌచమాదికర్మములు జన్మవృద్ధికే ఽ కర్మమునకుఁ । బ్రతిహతంబైన జ్ఞానంబు ఽ బడయకున్న । జన్మరహితంబు గల్గునేఽశశియులేని । రేయినభ్రంబు తోఁడైనఽరీతిఁగర్మ॥ ౧౮౯॥ చ॥ బురదను మంచినీరములుఽ వోసియులందినఁబోవుగాక యా । బురదను జొంపితోఁగడుగ ఽ బోవునె పోదుతలంపనట్టులే । గరితరొ జన్మహేతువగు ఽ కర్మము జ్ఞానముచేతఁబాపకే । శరమనురక్తిగర్మములఽ కర్మముచేతనునాశమొందునే॥ ౧౯౦॥ తే-గీ॥ పైరులెల్లనువర్షానఽబండినట్టు । మించు పరమార్థమున ముక్తిఽ గాంచవచ్చు । మంచుచేతనుబైరుఽఫలించినట్లు । కర్మచర్యలమోక్షంబు ఽ గాంచరాదు। ౧౯౧॥ క॥ అనవుడు విమలజ్ఞానం । బునకును గర్మంబెమూలఽముగఁజెప్పితిరిం । తనెనిష్ఫలమని కర్మం । బును ద్రోయఁగనేలయనినఁ ఽ బొలఁతికి ననియెన్॥ ౧౯౨॥ ఆ-వె॥ కమలవదన యెట్టి ఽ కర్మంబులైనను । నెంచ మూఢుఁ డాచ ఽ రించుఁ గాని । పరఁగ బ్రహ్మపదము ఽ ప్రత్యక్షముగఁ గన్న । జ్ఞానియవుడుఁజేయఁఽ బూనుకొనఁడు॥౧౯౩॥ క॥ విను కర్మభక్తిజ్ఞానం । బును నొకటికి నొకటిఁ బడసి ఽ మోక్షంబును గై । కొనఁదగుఁ గర్మాచరణంబుననే మోక్షంబు

నొప్పనరఁగ నొక్కలోకమున సుఁడియు నంధునిరీతి మూఢుఁడున్ ।గనుఁ
గొనఁలేదు బ్రహ్మమును గాంచుచునుండుచు నాత్మవేత్తయున్॥ ౨౦౩॥
క॥ ఏవలనగాదు దైవము భావంబున దెలియవలయు బరయోగమునన్।
దేవుఁ దర్శించినయా । జీవుఁడు నిమిషమున ముక్తిఁ జెందుమృగాక్షీ॥
౨౦౪॥ ఆ-వె॥ అనిన యోగమనఁగ నది యెన్నిరీతులై యుండుఁ దెల్ప
మనిన నువిదఁజూచి । మాధవుండు యోగ మార్గంబుఁ దెలియంగఁ।
బల్కె నిట్టులనుచుఁ బ్రౌఢిమెఱయ॥ ౨౦౫॥ ఆ-వె॥ జ్ఞానయోగమనఁగ

## యోగలక్షణము.

సరవి నభ్యాసయో । గంబునాగ రెండు గతులు జ్ఞాన । యోగమనఁగ
రాజయోగమానది సాంఖ్య । తారకామనస్క పేరులొప్పు॥ ౨౦౬॥
క॥ ఎంచఁగ ఖేచరిభూచరి । యంచును షణ్ముఖియుమధ్య మనశాంభ
వినాఁ । బంచవిధంబులు ముద్రలు । సంచితముగనవియు మిగులసనాయా
సక్రియల్॥ ఆ-వె॥ అబలవినుమ యింక నభ్యాసయోగంబు । నదియు
మూడు తెఱంగులై వెలుంగులాలితముగ మంత్రలయహఠయోగంబు।
లనఁగఁ బరఁగుచుండు ననవనియందు॥ ౨౦౭॥ క॥ పాయక యిరువదియొ
క్కటి । వేయిన్నూఱ్లుహంస వెనుదీయకదా। యింబవలు జపిం
చుట । యోజబ్బదళాక్షి మంత్రయోగంబునగున్॥ ౨౦౮॥ ఆ-వె॥ మంత్ర
యోగమనఁగ మఱియది యొండొక్క । తెరువును గలదిష్టదేవతాది।
బాహ్యమంత్రములను బఠియించుటలు బాహ్య।మంత్రయోగమనఁగ
మహిఁజెలంగు॥ ౨౦౯॥ ఆ-వె॥ అన్నమాటఁ దప్ప కరయుశాపా
నుగ్ర । హములనొసఁగుశక్తి నమరుచుండు । మనుపఁజెఱుపఁజాలు
మహిమకొందరియందుఁ । జెలఁగుచుండు మంత్ర సిద్ధులందు॥ ౨౧౦॥
ఉ॥ మానిని చక్రషట్కమున మానసమున్ విహరింపఁజేసి యామ్యాని
తహంసచక్రముల మాటికినిల్పుచు నచ్చటచ్చటన్ । బ్రాణమునం దపా
నము న పానమునందునఁ బ్రాణమున్ దగన్ । బూనిలయింపఁజేనదె
పో లయయోగమనంబడున్ ధరన్॥ ౨౧౧॥ సీ॥ మనమును బిందువం
దునఁ బ్రాణమును గళ - నమ్మనోప్రాణముల్ నాదమందు । లయముఁ
జేసియుఁ జిత్క శాదులు దర్శించు-చుందురు భావింపఁగొందఱిలను ।
జెలఁగి జిహ్వాంతర జిహ్వాల నేకంబుఁ జేసి మారుతమును జిక్కఁబట్టి।
హంసనాజ్ఞాచక్ర మందు నావృచు మనం - బందుఁ గొండఱుశిందు
పఱతురింక । నరయ నిజకాయములనంత హంసలయముఁ।జేసి పరకా
యములఁ బ్రవేశించుచుందురు । రెలమిసీలయయోగంబు నిట్లనేక। చంద

ముల నాచరింతురీ జగతిలోన। ౧౧౩। ఆ-వె॥ సరవి నింద్రియముల సంచారముల మాన్పి । హంసనడకను జెపి నయ్యపాన । ప్రాణములను రెంటిఁ బాయక కుంభించు । నదియె హఠమనంగ నగును మగువ॥ ౧౧౪॥ సీ॥ పాయు వింద్రియమున దోయముల్ పడిఁబీల్చి – మలకల్మషములాది వెలికిఁద్రోసి । కంఠగతంబులౌ కఫపిత్తములుగ్రక్కి – షడ్రసంబులను వర్జన మొనరించి । మూర్ధిఁ బ్రాణంబు నిరోధించి హంసను–గలయఁగేవలకుంభ కమున నిల్పి । కాయసిద్ధినిఁబొంది గణుతింప నణిమాది – యష్టసిద్ధులు గాంచి యనువుమీఱ । దూరశ్రవణము పరికింప దూరదృష్టిగగన సంచారములు వాది గలిగియుండు । దరయ హఠయోగులకెల్ల నవనియందుఁ । బఱఁగుచుందురు లోకులు భ్రమలుపెంద॥ ౧౧౫॥ తే-గీ॥ ఉర్వి నీమూఁడు దెఱఁగుల యోగులకును। సహజముగఁ బెక్కుభంగుల మహిమలుండు । మహిమలంబడి బ్రహ్మంబు

—: అష్టాంగ లక్షణము :—

మఱుఁగఁగనని । కతన మోక్షార్థు లెన్నఁడు గారువీరు॥ ౧౧౬॥ వ॥ ఈ త్రివిధంబులగు యోగులకు యమనియమాసన ప్రాణాయామంబులు పూర్వాంగంబులుగాను ప్రత్యాహార ధ్యానధారణసమాధు లుత్తరాంగంబులుగాను బ్రవర్తిల్లు, నందు యమంబన సత్యక్షమార్జవమహింసాదయాధృతిమితాహార బ్రహ్మచర్య శౌచంబులగు, నియమంబనఁ దపోదాన సంతోష జపార్చనవ్రతతీర్థ శ్రవణాస్తికత్వంబులగు, ఆసనంబనఁ గూర్మాసన కుక్కుటాసన సిద్ధాసన పద్మాసన వీరాసన స్వస్తికాసన భద్రాసన సింహాసన యోగాసనాద్యాసనంబు లభ్యసించుట, ప్రాణాయామంబనఁ బ్రాణాపానంబుల నొకదానియందొకటి కుంభించుట. ప్రత్యాహారంబన విషయంబులవలన నింద్రియంబుల మరలించుట. ధ్యానంబన నామరూపంబుల ధ్యానించుట సగుణ ధ్యానమనియు, నిర్గుణాత్మను జింతించుట నిర్గుణధ్యానమనియుం జెప్పంబడు ధారణంబన నాధారాది షట్చక్రముల యందును మనంబు నరికట్టుట సమాధియన బాహ్య దేవతలయందు మనంబుఁ జొప్పించుట సవికల్ప సమాధియనియు, నిర్గుణాత్మ నేమఱకుండుట నిర్వికల్ప సమాధియనియుఁ జెప్పంబడు॥ ౧౧౭॥ ఉ॥ ముందె యెఱుంగనేరకయె ముక్తిప్రదంబగు రాజయోగము । న్నిందు నభ్యాసపామరులు నిట్టిదురంతర యోగసాధనల్ । పొంది ప్రయాసలొంది చెడి పోవుదురాత్మ సుఖంబుగానకే । మందులు పొట్టుదంచి ఫల మందునఁ గానక పోవురీతిగన్॥ ౧౧౮॥ ఆ-వె॥ అధిక కష్టమిట్టి అభ్యాసయోగముల్ । గాసి

గాని ముక్తిఁగానఁబడదు । అగణితంబుసులభ - మగు రాజయోగంబు।
ముఖ్యమందఱికిని - ముక్తిపదము॥ ౧౯॥ క॥ భూజనుల కెల్లవారికి ।
రాజెట్టుల గొప్పయగుచు । రంజిలునట్లే । పూజితము రాజయోగము ।
రాజగు యోగములకెల్ల - రాజీవాక్షీ॥ ౨౦॥ క॥ అన ముద్ర లైదుగల
వని । వినిపించితి రిప్పుడవియు - వినఁగావలతుఁ । వినిపింపుమనిన నింతికి॥

## పంచముద్రల లక్షణము.

ననువొందఁగ నిట్టులనియె - నాయకువిభుఁడుఁ॥ ౨౧॥ ఆ-వె॥ ఒడలు
బడలఁజేయు - యోగసాధకులకే । ముద్రలవిప్రదాన - ములగుఁగాని।
యరయసాంఖ్యతార - కామనస్కజ్ఞులా । బుధులకెపుడు ముఖ్య - ములవి
గావు॥ ౨౨॥ క॥ వనితా యైనను నీవును । వినఁగోరితి గాన నవియు - విశ
దముగానీ । కను నెఱిఁగించెద వినుమిఁక । నొనరంగా నొక్కటొకటి -
నొయ్యనిపుడుఁ॥ ౨౩॥ తే-గీ॥ మూసియైనను నక్షులు - మూయకైన ।
మనసుదృష్టియు భ్రూమధ్య - మందుఁ జేర్చి । యూర్ధ్వముఖముగఁజూచు
చు - నుండెనేని । ఖేచరీ ముద్రయగునది - కీరవాణి॥ ౨౪॥ క॥ సదమల
గతి నాగ్ర్యోక్తినిఁ । బదపడి ఘ్రాణాగ్రమందుఁ - బాయకచూడ్కుల్ ।
గదలింపక వీక్షించిన । నదిభూచరి ముద్రసరణి - యంద్రు మహాత్ముల్ ।
౨౫॥ తే-గీ॥ నేత్రయుగమును మఱియునా - శ్రోత్రయుగము । ఘ్రాణ
యుగమును మూసియుఁ - గ్రమముగాను - జూపు భ్రూమధ్యమునిల్పి -
చూచెనేని । షణ్ముఖీ ముద్రయగునది - సారసాక్షి॥ ౨౬॥ క॥ కనులు
వికసించి చూపును । మనముఁ జిదాకాశమందు - మఱిఁగించి చిదాత్మను
గలసి చిత్కళాదుల। వినయంబునఁగనిన శాంభ - వీముద్రయగుఁ॥ ౨౭॥
తే-గీ॥ అరనిమీలితలోచనుఁ - డగుచుమేటి । దృక్కు నాసిక్కమ
ధ్యను - దోపఁజేసి । కలయనామీఁద నిటలంబుఁ - గాంచెనేని।మధ్యల
క్ష్యంబునగునది - మందగమన॥ ౨౮॥ క॥ కనులును వీనులుమూసియు ।
ఘనముగ భ్రూమధ్యసీమ - గాంచుచు మఱియుఁ । దనలోనెమ్మదివిన
విన।మునుమును నోంకారశబ్ద - మును బ్రబలమగుఁ॥ ౨౯॥ క॥ తరు
వాత మేఘరవమును । మరిఘంటావేణుతాళ - మద్దెలవీణా । వరభేరి
భ్రమరశరనిధి । కరణిని నాదములు పెక్కు - గతుల వినఁబడుఁ॥ ౩౦॥
ఆ-వె॥ అట్లు చూడఁజూడ - నతిదారుణాకృతి - నంధకారరూప - మగు
చుఁదోఁచుఁ । గలయఁదిమిరమందు ఖద్యోతములరీతి । మెఱుపులతల
భంగి - మెఱయుచుండు॥ ౩౧॥ క॥ కమలాక్షి వినుము యందొక।యమి
తంబగు వెలుఁగుపొడమి - యంతయుఁదానై । తమమెల్లఁబాఱఁదోలును।

విమలంబై యుండుపండు శ వెన్నెలకాంతిన్॥ ౨౩౧॥ ఆ-వె॥ మఱివసంత కాల శ మార్తాండభంగిని । శిశిర ఋతువునందు శ శశివిధంబు। ప్రళయ కాలవహ్ని శ పగిదిఁగాఁదోఁచు నా। తుత్రమండలంబు శ చందమునను॥౨౩౩॥ క॥ ఆరయ వజ్రంబులవలె । ధారుణిమణులట్లు నింద్ర శ ధనువు ననువునన్ సారసనీలంబుల గతిఁ । దీరగు వరమౌక్తికముల శ తెఱఁగున వెలయున్॥ ౨౩౪॥ ఆ-వె॥ గోపురములరీతి శ గోత్రములట్టుల। మేఘముల తెఱంగు శ మేడలవలెఁ శ గరుల చందమునను శ హరులవిధంబున। నరదబంతిపోల్కి శ నమరుచుండు॥ ౨౩౫॥ క॥ కనక రజితములభంగినిఁ । బెనుపొందుచునుండు నెమిలి శ పింఛములగతి । న్ననువొందు హిమముకరణినిఁ । దనరంగా దీపకళిక శ తతులవిధమునన్॥౨౩౬॥ క॥ చలువపుటంబులకై వడి। సలలితముగఁబూయు వృక్ష శ జాలముభంగిన్ । జలనిధికరళ్ల మాడ్కిని। బలువగు నమృతంపుజ్యోతి శ పగిది వెలుంగున్॥ ౨౩౭॥ ఆ-వె॥ చిత్రగతులఁదోఁచు శ చిత్కళలెల్లను । జూడఁజూడమిగులఁ శ జోద్యమగుచు । విశ్వమందు లేని శ వింతలుగాన్పించు । సుదతినీవునట్లు శ చూడుమింక॥౨౩౮॥ ఆ-వె॥ ఇంతియందుఁదోఁచు శ వింతల నరయంగ । వేయికన్నులున్న శ వేల్పుకైన । శేషధరునకైన శ శోషాహికైనను । నలవిగాదజునకు శ నైననెన్న॥౨౩౯॥క॥ తారక మర్మము దెలియక। గారవమున ముద్రలందుఁ శ గను చిత్కళలే। తారకమని పల్కుదురది। తారక మెప్పుడునుగాదు శ తేరుణేందుముఖి॥ ౨౪౦॥ తే-గీ॥ కలకు సుషుప్తికి జాగ్రత శ కాదియైన । యట్టి వస్తువె తారకం శ బనఁగనొప్పు। నదియుగానక జాగర శ మందుఁజూచు। ముద్రలెల్లను నిద్రలో శ మునిఁగిపోవు॥ ౨౪౧॥ క॥ సకలవిచిత్రాలయమగుఁ । బ్రకటింపఁగ ముద్రలైదు శ భ్రాంతికిమూలం । బకలంకమైనమాత్మకు । నిఁక నే భ్రాంతియును లేదు శ నిర్గుణుఁడగుటన్॥ ౨౪౨॥ క॥ క్రమమున నీముద్రలుగన । భ్రమపుట్టుచు నుండుఁగాని శ భ్రాంతిరహితమున్ సమలీలగాదుగావున । విమలాఁగీముద్రలరసి శ విడువంగవలయున్॥౨౪౩॥ క॥ నిద్రాన్నపానములవిడి । యద్రుల గుహలందుఁ దూఱి శ యడవుల నున్నన్ । ముద్రలయందున శ భ్రమగల । క్షుద్రాత్ములు గాంచలేరు శ సూటిగముక్తిన్॥ ౨౪౪॥క॥ నిద్రకు నాదినిఁదెలిసియు । ముద్రల భావంబురోసి శ మూలమెఱిఁగియున్। సద్రూపము గననేర్చిన । భద్రాత్ములు గంద్రుముక్తి శ బహుసులభముగాన్॥ ౨౪౫॥ క॥ ఫలినుండి యింటిలోపల । వెలుఁగును వీక్షించి దివ్య శ విధమెటుఁగకయా । వెలుఁగే కారణమని మదిఁ। దలపోసినవానిరీతిఁ శ దగుముద్రలిలన్॥ ౨౪౬॥ క॥ దీపంబు

గన్నవానికి । వ్యాపకమగు వెలుఁగు కారణాత్మకమగునే । యాపర
మాత్మను గాంచిన । యాపావనమతులకేల యాసాధనముల్॥ ౨౮౬॥
ఆ-వె॥ అనినయోగముద్ర లాదిగవింటిని । నింక నీప్రపంచ మెట్లు
పుట్టె।మఱియు సాంఖ్యయోగ మన నెద్దియన్నా । నాతికిట్టులనియె

ప్రపంచోత్పత్తి లక్షణము.

నచ్యుతుండు॥ ౨౮౭॥ క॥ పడఁతీ యెంతటివారికిఁ । జడయక యీ విశ్వ
సృష్టి తరమా చెప్పన్ । గడువడి నీవాకొక్కటి।నడుగంగా నేరనట్టు
లడిగెదవుసతీ॥ ౨౮౮॥ క॥ నెట్టన లోకములేవియుఁ । బుట్టక మున్నేమి
లేక పూర్ణంబగుచున్ । బట్టబయలైనబ్రహ్మము । పట్టుగ నొక్కండె
యుండె భామినితొలుతన్॥ ౨౯౦॥ ఆ-వె॥ మఱియు నట్టిబ్రహ్మమందే
మిలేకయే । స్వయముగ నొకమాయశక్తిగల్గె । నరయ నిద్రయందు
నడఁగిన తెల్వియు।వరుసఁ దనకుఁదానే వచ్చినట్లు॥ ౨౯౧॥ తే-గీ॥ నాతి
యమ్మాయయందున నాకసంబు । వొడమె నానింగియందునఁబుట్టె
గాడ్పు । ననిలమందున నగ్నియు ననలమందు । జలము జలమందుఁ
బృథ్వియు సంభవించె॥ ౨౯౨॥

వ॥ ఓయంచయానా, యివి పంచమహాభూతంబు లనంబరఁగు,
నందు నభంబునకు శబ్దంబును, వాయువునకు శబ్ద స్పర్శంబులును, తేజం
బునకు శబ్దస్పర్శరూపంబులును, నుదకంబునకు శబ్దస్పర్శ రూపరసంబు
లును ధరణికి శబ్దస్పర్శ రూప రస గంధంబులును గుణంబులై యొప్పు॥
౨౯౨॥ ఉ॥ చ॥ అమరఁగ నట్టిమాయ త్రిగుణాత్మకమయ్యెను రాజ
సంబునన్ । గమలజసస్యసంతతులు కంజహితుండునుగల్గె జీవులున్ ।
విమలసుగంధి సత్వమున విష్ణుసుధాకర తారలున్ సురల్। సముదయ
మొందె నాశివుఁడు సాగరవృక్ష గిరుల్ తమాంశమై॥ ౨౯౩॥ తే-గీ॥
రమణి జగములఁ గల్పించు రాజసమున సకలజీవులఁ బోషించు।సత్వ
మునను।దవిలి యఖిలంబుఁబొలియించుఁ దమముచేతఁ । ముత్తెఱంగుల
నీ మాయ మూలమిలకుఁ॥ ౨౯౪॥ క॥ మొదలు రజోగుణమున నే।యుద
యించును సత్వమొంది యొగసత్వాంశం । బడియఁగుచుఁ దమముఁ
జెందం।బదపడివినుమవి తమాంశమైయొప్పారున్॥ ౨౯౫॥ క॥ మగువా
విను పదునాలుగు । జగములునీరీతినయ్యె సాంఖ్యమనంగాఁ । దగు
దేహతత్వగోప్యము।తగఁదెల్పెద వినుమి యింకఁదామరసాక్షీ॥ ౨౯౬॥
వ॥ ఓకాంతామణీ, భూతపంచార్ధార్ధంబులైదును నిజాంశంబులై చెలంగు
చిక్కిన యర్ధాంశంబులొక్కొక్కటి చతుర్భాగంబులై, యితరభూతచతు

ష్టయంబుం గూడుచున్నది. ఇది పంచీకరణ లక్షణంబగు, నదియెట్లనిన:-

సాంఖ్య లక్షణము.

సీ॥ అంతరిక్షములోని ¶ యర్ధభాగము రెండు-రీతులై యొక్కటి ¶ జ్ఞాతమయ్యె। మఱియొక భాగంబు ¶ మఱినాల్గువిధములై - వాయ్వనల సలిల ¶ వసుధలందుఁ। జేరిమనోబుద్ధి ¶ చిత్తహంకారంబు - లాయెను దద్విష ¶ యంబులగుచు। నెగడు సంకల్పంబు ¶ నిశ్చయంబును జింత-కర్తృత్వములునాది ¶ గాఁగఁబరఁగు। వీనికధిదైవతంబులై ¶ వెలయు క్షేత్ర। పాలకుండును జంద్రుండు బ్రహ్మవిష్ణు। రుద్రులగుదురు భావింపర్ ¶ రూఢిగాను। నంతరింద్రియపంచకం ¶ బనఁగ నివియె॥ ౨౧౭॥ సీ॥ పవనంబులోనర్ధ ¶ భాగంబు ద్వివిధమై-వరుసనందొక్కటి¶వ్యానమయ్యె। గడమభాగము నాల్గు ¶ ఖండంబులగుచును - మఱిమిన్నుగూడి సర్ ¶ మానమయ్యె। దహనుని గలసి యు ¶ దానంబునయ్యెను - వారి జేరియుఁ బ్రాణ ¶ వాయువయ్యె। వసుధనొంది యపాన ¶ వాయువునయ్యెను-బరికించిచూడంగఁ ¶ బద్మగంధి। విజయుఁడాదిగ జయుఁడును విశ్వయోని। గలయఁగ విసృష్టుఁడును విశ్వ ¶ కర్తలనఁగ।దనరు చుండుదు రధి దేవ¶తలుగఁ జింపఁ। బంచప్రాణంబులివియనఁ ¶ బరగుధాత్రి॥ ౨౧౮॥ సీ॥అనలభూతములోని ¶ యర్ధభాగము రెండు - సగములై యొకటి లోచనము నయ్యె।నందుఁజిక్కిన సగం ¶ బటనాల్గు తెఱఁగులై-గగనా నిలోదక ¶ కాశ్యపులను। జెంది శ్రోత్రముత్వక్కు ¶ జిహ్వనాసికములు- సంచితంబుగనాయె ¶ నెంచిచూడ। రూపశబ్దస్పర్శ ¶ రుచిగంధములువీని - కరయంగ విషయాదు ¶ లై చెలంగుఁ। దెలియఁగా వీనికిని నధి¶దేవతలును। భానుఁడును దశదిశలును ¶ బవనము వరు। ణాశ్వినీ దైవతములన¶నమరుచుండు। నివియె దలపోసిచూడ జ్ఞానేంద్రియములు॥ ౨౧౯॥ సీ॥ అప్పుభూతములోని¶యర్ధభాగము రెండు¶సగములై యొకటి రసంబునయ్యె। నందునిల్చిన సగము¶నాల్గుభాగంబులై - దలఁపంగ నితరభూతంబులైన।యంబరమార్గంబు ¶ నందునఁగూడియుఁ - జర్చింపనొక్కటి¶శబ్దమయ్యెఁ। దగనొప్పనా మారు ¶ తంబునుబొందియు - సానుగానొక్కటి-స్పర్శయయ్యెఁ। జెలువుమీఱంగ ననలంబుఁ ¶ జేరియొకటి।రూపమయ్యెను దలపోయ¶రూఢిగాను। నవనిఁగలసియుగంధంబు¶నాయెనొకటి। పంచతన్మాత్ర లివియగు ¶ నెంచిచూడ॥ ౨౨౦॥ సీ॥ అవనిభూతము లోని ¶ యర్ధభాగము రెండు - భాగంబులై యొండు ¶ పాయువయ్యె। మిగిలిన ఖండంబు ¶ తగనాల్గుభంగులై ¶ గగనసమీరాగ్ని ¶ కమలము

లను । బరఁగఁగూడియువాక్కు ✱ పాణియుఁబాద గుహ్యంబులు క్రమ
ముగా ✱ నాయెనింక । మలవిసర్జనమును ✱ బలుకునీవియు గమ-నానం
దములు విష ✱ యాదులగును । నతులితంబుగ నీయింద్రి ✱ యంబుల
కును।దలఁప నధిదేవతలు మృత్యుదహన శక్ర✱విష్ణుధాతలువరుసగా✱వెల
యుచుండు । రరయఁ గర్మేంద్రియము లివి ✱ యసఁగఁబరఁగు॥ ౨౬౧॥ వ॥
మున్ను చెప్పిన వ్యాన సమానోదాన ప్రాణాపానంబులైదును మఱియు
వాయుజనితంబులైన నాగకూర్మ కృకర దేవదత్త ధనంజయులను నుపవా
యుపంచకంబునుం గలసి దశవాయువులనం బ్రసిద్ధంబులయ్యె, నందువ్యా
నుండు శరీరమాద్యంతమునువ్యాపించి లోపలి శీతోష్ణంబులలోనికిం బ్రస
రింపఁజేయుసమానుండు నాభియందుండిభుజించినపదార్థములయొక్కసార
మెల్ల నాడులకుంబంచిపెట్టు; నుదానుండుకంఠమందుండి సమస్తరుచులం
గోరించు, కఫము మొదలగు దగ్గులంబుట్టించు, కల్వరింతలం బెట్టించు,నిష్ఠీవ
నంబు జేయించు, మింగించు; ప్రాణుండు॥ హృదయమందుండి యుచ్ఛ్వా
సనిశ్వాసంబులచే నారగించిన శాకాదిపదార్థంబులనన్నింటి హరింపం జే
యు, నపానుండు గుదమందుండి యధోద్వారంబులబంధించి యాయాకా
లంబుల మలమూత్రశుక్లరక్తాపానంబుల వదలింపం జేయు;నాగుండురోమ
నాడులయందుండిదుఃఖగీత రాగహాస్యాదులం జేయించు; కూర్ముండుపాదం
బులందుండి శుష్కమైన శరీరంబు బలపఱచు, వాక్నేత్రంబుల వికసింప
మూయింపం జేయు; కృకరుండునాసాగ్రమందుండితుత్తృష్ణాదితలంపులొ
దవించు, తుమ్మించు, దగ్గించు, వమనంబుగావించు, నావులింపం జేయు,
మృతంబైనను విడువక దేహస్థాల్యమునుబుట్టించు; దేవదత్తుండులింగాత్ము
లయందుండి చక్కఁగాబల్కించు, కూర్చుండం బెట్టిపరుండం బెట్టు, లేపి
నిలువం బెట్టు, గమనాగమనంబులం జేయించు; ధనంజయుండు బ్రహ్మరంధ్ర
స్థానమందుండి శ్రోత్రములయం దెల్లప్పుడు సముద్రము భంగిఘోషింపం జే
యుచు మరణకాలమునకుముందుగా నిశ్శబ్దమైపోవు॥ ౨౬౨॥ సీ॥ నాతిస
మిష్టితో ✱ నయ్యహంకారంబు - గూడనన్నమయా ఖ్య✱కోశమయ్యెఁ ।
బ్రాణేంద్రియములతోఁ ✱ బరఁగహంకారంబు-గూడఁబ్రాణమయాఖ్య ✱
కోశమయ్యె। మేటిసమ్మనము క ✱ ర్మేంద్రియంబులతోడఁ ✱ గూడమనో
మయ ✱ కోశమయ్యె । నెలవుగాబుద్ధిజ్ఞా ✱ నేంద్రియంబులతోడఁ-గూడ
విజ్ఞానాఖ్య✱కోశమయ్యె । సంతతంబును జిత్తంబు✱జ్ఞాతతోడఁ । గూడు
టానందమయమును ✱ కోశమయ్యెఁ । బంచకోశంబులీరీతిఁ ✱ బరఁగుచుం
డుఁ । బొందుగా నెల్ల దేహంబు✱లందు నరయ॥ ౨౬౩॥ సీ॥ గగనంబుచేఁ

గల్గెఁ గామంబుఁ గ్రోధంబుఁ మదలోభమోహము ఽ ల్మత్సరంబు । గాడ్పు
చేఁ దీవ్రంబు ఽ గమనంబు లజ్జయుఁ — జలనంబు భయమును ఽ సంభవించె ।
బావకుచేతఁబి ఽ పాస క్షుదాలస్య — సంగనిద్రాదులు ఽ సరవిఁ గల్గె ।
శుక్ల మూత్ర శ్లేష్మ శోణిత మేధస్సు — లుత్పన్నమయ్యెనుఽనుదకమునను ।
మఱియుఁ జర్మంబునస్థియు ఽ మాంసకేశ । నరములాదిగ జనియించె ఽ నవ
నివలనఁ । వెలఁత యీ దేహతత్త్వముఽలిట్టివనుచు । నలువకైనను భావిం
ప ఽ నలవియగునె॥ ౧౬౪॥ తే-గీ॥ ప్రాణధర్మంబులగు క్షుత్పి ఽ పాసతె
లమిఁ । దలఁప భవనాశములు దేహఽధర్మములగు । జోకమానస ధర్మ
ముల్ ఽ శోకమోహ । ములు షడూర్మ్ములనంబడుఽ మోహనాంగి॥ ౧౬౫॥
క॥ కులరూప ధనమదంబులు । వెలయంగా యౌవనంబుఽ విద్యారాజ్యం ।
బెలమిఁ దపస్సును శీలం । బలరంగ నష్టమదము ఽ లనఁబడు నవియున్॥
౧౬౬॥ క॥ విను ముత్సాహవ్యసనము । ధనసేవక విశ్వరాజ్యఽతనువుల
వ్యసనా । లొనరు మనోవ్యసనంబును । ననుస ప్తవ్యసనములను ఽ నడఁ
పఁగ వలయున్॥ ౧౬౭॥ ఉ॥ కొందఱు ముప్పదాఱయని ఽ కొందఱు
తొంబదియంచుఁ దత్త్వముల్ । కొందఱు నైదటంచు మఱి ఽ కొందఱు
నిర్వదిమూడటంచునున్ । గొందఱు నిర్వదేననుచుఁ ఽ గొందఱు నిర్వది
యేడయంద్రిల । న్నొందఱు నెన్నిరీతులనుఽ నెట్లువచించిన వాని కేతగున్॥
౧౬౮॥ ఆ-వె॥ అఖిలతత్త్వములకు ఽ నాదారమగుచును । నవ్యయాత్మ
తత్త్వ ఽ మలరునొకటి । దానిసమము మిగులు ఽ తత్త్వంబు లెవ్వియు । లేని
దియును సుజన ఽ సేవితంబు । ౧౬౯॥ సీ॥ బ్రహ్మంబునందునఁ ఽ బంచము
ఖంబుల — నెవ్వియంచన విను ఽ మేర్పరింతు । నీశాన్యముఖమనఽ నింగి
యై విలసిల్లు — దత్పురుషముఖంబునఁ ఽ దగును గాడ్పు । ముదము మీఱ
నఘోర ఽ ముఖమన ననలంబు — వామదేవాస్యంబు ఽ వారియగును ।
మొనసి సద్యోజాత ఽ ముఖమనఁ బృథ్వియుఁ — దలపోయఁ బంచభూ ఽ
తంబులివియు । భవము నాశము లేనట్టి ఽ బ్రహ్మమునకుఁ । బంచముఖ
ములు గలవంచుఁ । బల్కరాదు । పంచభూతంబు లేయిలఁ ఽ పంచముఖ
ము । లగుచు వీనిచే భువనంబు ఽ లన్నియయ్యె॥ ౧౭౦॥ ఉ॥ కొందఱు
చెట్టుముందనియుఁ ఽ గొందఱు విత్తని పెక్కుభంగుల । న్నొందరు విత్తు
చెట్టులకు ఽ నారయభేదముఁ జెప్పశక్యమే । ముందెదియొ నర్చె వి త్తనముఽ
మూలముగాఁగను సృష్టికర్తయు । న్నందుఁ దలంపఁ జెట్టునగుఽ నట్టిమహా
త్మ్యముఁ జేసెఁ గాగునన్॥ ౧౭౧॥ ఆ-వె॥ కారణంబు లేనిఽ కార్యంబు లిల
లేవు । కార్యములకు నాది ఽ కారణంబై । కారణంబు విత్తు ఽ కార్యం

బుచెట్టగుఁ । గాక చెట్టగునొకో కారణంబు॥ ౨౭౨॥ క॥ మును మన్ను
కారణంబై । ఘనకుంభాకారమగుచుఁ గార్యంబులన్ । మును విత్తుకా
రణంబగు । ననువొందఁగఁజెట్టు కార్యమగును దలంపన్॥ ౨౭౩॥ ఆ-వె॥
విత్తుకారణాత్మ విశ్వంబు కార్యంబు కారణాత్మ లేక గాదుజగము ।
కారణంబువలనఁ గల్గెను సర్వంబు । గాన నిలకునాత్మ కారణంబు॥
౨౭౪॥ సీ॥ నలినాక్షి బ్రహ్మమానస సరోవరమందుఁ బరమహం
సంబనఁ బక్షియొకటి । నిరతంబుక్షుత్తృష్ణ నిద్రయురోగంబు-జరయు
మృతియులేక సంచరించు సాటిగాఁగనుతెప్ప పాటులోనాయంచ-
దివిరి జగములెల్లఁ దిరిగివచ్చు । సతతంబునాయంచ సంచారమును
లేని-లోకంబుపొలిసి నిర్లోకమగును । దానిఁ బట్టుటకును దర్శించు
టకునైన నలవిగాదు శివునకజునకైన । నట్టియంగదర్శనంబు
చేతనుగాదె । యార్యులెల్ల ముక్తులైరితలఁప॥ ౨౭౫॥ క॥ అంచకు
వర్ణగుణంబులు । నెంచగాలేవు రూపనియతులు నాలో । చించిన
గనుపడవిఁక నా । యంచకుఁబ్రతిలేదు జగమునందునఁజూడన్॥ ౨౭౬॥
ఆ-వె॥ అమ్మరాళమునకు నావలనొకకోఁతి దిరుగుగాలిభంగి దిశలు
దిశలు । నంచనెపుడుగూడు నప్పుడేయాకోఁతి । చచ్చుమాయలెల్ల
సమసిపోవు॥ ౨౭౭॥ క॥ ధారుణి హంసముపాలను । నీరంబేర్పఱచినట్లు
నిజమును మృషయున్ గూరిమి నీదేహంబున నారయఁగావచ్చుఁ బరమ
హంసదారికిన్॥ ౨౭౮॥ తే-గీ॥ శక్తికిని సాధ్యమునుగాదుయుక్తులకును ।
జిక్కుపడదది యెవ్వరిచిత్తములకు । నొసర గురుసూత్రమనియెడి
నుచ్చులొడ్డి । బహుళ సులభంబుగాదానిఁ బట్టవచ్చు॥ ౨౭౯॥ క॥ ఆ
పరమహంసఁబట్టిన । యాపుణ్యుల భాగ్యమింత యనఁగావశమే । యా
పుణ్యులెధన్యాత్మకు । లాపుణ్యులెజన్మశూన్యులనఁగావలయున్॥ ౨౮౦॥
ఆ-వె॥ నడకలెల్ల హంసనడకతో సరిగావు । హంసనడకఁజెప్పనలవి
గాదు । హంసనడకవలన నఖిలప్రపంచంబు । నడుచుకాలచక్రమాది
గతులు॥ ౨౮౧॥ క॥ అంచయనఁగ వేఱొక్కటె । యంచితముగ నంతరా
త్మ కర్థమగును నాయంచయె । యాత్మండాత్మయె । యంచయగును
నెంచిచూడ హంసవిహారీ॥ ౨౮౨॥ క॥ తనయింట శత్రుమిత్రులఁ । గని
తనుఁదా నాత్మఁగాఁగఁ గనఁదగునట్టు । ల్గనుఁగొనఁగలేకయుండిన । మను
జుని బ్రతుకేమిబ్రతుకు మదగజగమనా॥ ౨౮౩॥ ఆ-వె॥ దేహగుణము
లెల్లఁ దెలిసియు నామీఁదఁ దారకంబు నాత్మఁదలచవలయు । బ్రహ్మ
రాజఋషులు ప్రహ్లాదుఁడాదిగాఁ దారకమునఁగాదె ధన్యులైరి॥

౧౮౫॥ ఓ వెలఁది వినుము సురలకు । దేవత్వము తారకమున ఽ దీపించెను దా । ద్భావముఁ దెలియక గాదె । భావింపఁగ నసురమర్త్యభావులు నగుటన్ ॥ ౧౮౬॥ చ॥ అనియిటు దెల్పుచున్నఁ బతి ఽ యంఘ్రులఫాలముసోఁక ప్రమొక్కియున్ । ఘనమగు భక్తిదోఁపఁగర ఽ కంజయుగంబును మోడ్చి నాథయో । యనఘచరిత్ర నీవలన ఽ నద్భుతబోధనువింటి నియ్యెడన్ । ననుదయఁజూచి తారకము ఽ నాదరమొప్ప ననుగ్రహింపవే॥ ౧౮౭॥ క॥ శ్రీకర రహితవికారా । ప్రాకటగుణ కర్మదూర । భవరోగహరా ఽ భీకర శత్రుతృణీకర । యాకాశ సమానరూప ఽ యార్యసమీపా॥ ౧౮౮॥ మాలిని॥ నిరుపమతరకీర్తీ ఽ నిర్మలానందమూర్తీ । పరమపదయువిశాలా ఽ భక్తసంత్రాణశీలా । దురితగతపవిత్రా ఽ దుఃఖవల్లీలవిత్రా। పరమపద నిరూపా । భవ్యలోకప్రదీపా॥ ౧౮౯॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను - సుజ్ఞాన శాస్త్రమునందు ద్వితీయాశ్వాసము - సమాప్తము॥



# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదం బను సుజ్ఞాన శాస్త్రము.

## తృతీయాశ్వాసము.



క॥ విశ్వాత్మ విశ్వనాయక । విశ్వేశ్వర విశ్వసూత్ర ఽ విశ్వమయాత్మా । విశ్వవికల్ప సురక్షణ।విశ్వాంతక విశ్వకర్త ఽ విశ్వాతీతా॥ ౧॥ వ॥ అవధరింపుమా కృష్ణుండు కాంతామణికిట్లనియె॥ శా॥ భామా యేరికిఁ దారకంబు మహిమన్ ఽ భావింపరాదెంతయున్ । సామాన్యుల్ మది ఽ గోరరట్టివిధమున్ ఽ సంసారవారాశిలో । వేమాఱుం బడి యీఁదువారు సుగతిన్ । వీక్షింపఁగా నెట్లగును। భూమీమండలి జన్మశూన్యులగునా ఽ

### తారక లక్షణము.

పుణ్యాత్ములుండకుంగన్॥ 3॥ క॥ తారకమహిమను జెప్పెద।నారీమణి వినుమునీవు ఽ నయమొప్పగనా।తారకము జననమరణ ని । వారకమది శోకమోహ ఽ వర్జితమరయన్॥ ౪॥ ఆ-వె॥ తపజపార్చనాది ఽ దానతీర్థ

వ్రత। క్రతుకులాశ్రమాది ఽ మతపురాణ ఽ వేదశాస్త్రములకు ఽ వివిధం
బులగు ధర్మములకుఁ దారకంబు ఽ మొదలుచూవె॥ ౭॥ క॥ తారకము
సాధులకుఁగనుఁ । జేరువయగు సర్వమునకుఁ ఽ జేరుగడయగుౕ। ధారుణి
వేఁపులకెల్లను । వారిధిచందంబుగాఁగ ఽ వారిజగంధీ॥ ౮॥ ఆ-వె॥ హరి
హిరణ్యగర్భ ఽ లమర దిక్పాలకు । లిన సుధాకరాగ్ను ఽ లనిల శంభు।
లాదితారకంబె యాడించు సర్వంబు । నకను దారకంబె ఽ నాటకంబు॥
౮॥ క॥ తారకము మనశ్శుద్ధికిఁ । గారణమగు సాధనంబు గావున మఱి
యాతారకమునభ్యసించిన। వారికిఁజలనంబుగలదె ఽ వారిజ నయనా॥౯॥
ఆ-వె॥ తారకంబు త్రిగుణ ఽ తాపంబులనుబాపు । నీషణములమాపు ఽ
నెల్ల వాస । నలను జంపఁజేయుఁ ఽ నరివర్గమును గెంటు । నడఁచువ్యసనముల
మ ఽ దాష్టకంబు॥ ౯॥ సీ॥ తలిదండ్రిగురుబంధు ఽ తరుణిగోపాలక-హత్య
లనుమిగుల ఽ నఘములైనఁ । గడఁగి పెక్కుఱు నన్యకాంతలయాడినఁ—
గామాంధమను మహా ఽ కలుషమైన । పలుమాఱు హేమాది ఽ పరవిత్త
ములుచాల దొంగిలించిన మహా ఽ దోషమైన।బహ్మహత్యాది పాపము
లైన వేమాఱు సురను గ్రోలినఘోర ఽ దురితమైన । నింకనెటువంటి
పాపంబు ఽ లిలనొనర్చ । పాతకులనైన తారకం ఽ బందిరేని । నిఖిల
కలుషంబులను బాసి - నిమిషమునకు । ముక్తినొందంగఁగలరింతిముద
ముతోడ॥ ౧౦॥ క॥ అతిదుష్కృతములు సేయుచు । సతతము వాల్మీకి
బోయ ఽ జన్మండయ్యెన్ । గతిజన్ముఁడగుట నెఱుఁగవే । సతితారక
ధనమువలనఁ ఽ జర్చింపగఁ॥౧౧॥ ఆ-వె॥ మునులు కోపతాప ఽ ములు
గల్గి శాపంబు । లొరులకొసఁగియుండి ఽ యుర్వఁదాము । నీచజాతు
లందు ఽ నెఱిఁబుట్టియుచు దార । కమునఁగాదె వారు ఽ ఘనులునైరి॥
౧౨॥ క॥ సారసమిత్రునిఁబాడఁగని । ధారుణి గాఢాంధమెల్లఁ ఽ దాఁబా
యుగతిఁ । దారకముగాంచినప్పుడె । నారీమణిపాసిపోవు ఽ నఖిలాఘం
బుల్॥ ౧౩॥ ఆ-వె॥ తారకంబుచేత ఽ దగ్ధంబుగాకుండు । నట్టిపాపమెద్ది
యునవనిగల్ల । దెట్టియఘములైన ఽ గొట్టివేయఁగఁజాలు । తారకంబె
పరమ । తారకంబు॥ ౧౪॥ క॥ చీరఁగలదే యఘంబులఁ । దారకతత్వ
రుల కఘము ఽ తగఁగలదను నా । క్రూరులపాపముమాత్రము। తారక
మొగిఁ బాపలేదు ఽ తరుణేందుముఖీ॥ ౧౫॥ ఆ-వె॥ తారకామృతంబుఁ
ద్రావు భక్తులకును । వేఱె ధర్మమొకటి ఽ గోరఁదగునె । కాంక్షలెల్లనొ
సఁగు ఽ కల్పవృక్షఁబుండ । గచ్చపాదను జేరు ఽ కరణిఁగాదె॥ ౧౬॥ క॥
సారసగర్భుండాదిగ । సారసముఖి సకలజీవ సంఘంబులు నా । తారక

ముచేతఁ గల్గెను । తారకమే విశ్వమునకుఁ ʃ దారకమరయఁగ॥ ౧౭॥
తే-గీ॥ తారకముచేతరోగముల్ ʃ పాఱిపోవు । తారకముచేత దారిద్రʃ
తతులువాయుఁ । దారకముచేత సౌఖ్యంబు ʃ ధనముగల్గుఁ । దారకము
చేత నీడేరుఁ ʃ దలపులెల్ల॥ ౧౮॥ సీ॥ ధరణి దైవములెల్ల ʃ దారకంబు
సమంబె-యీప్సితంబు ప్రజల ʃ కిచ్చునెడల గామధేనువు తార ʃ కంబు
తోసరియౌనె - యీప్సితంబు ప్రజల ʃ కిచ్చునెడలఁ । గల్పవృక్షము
తార ʃ కంబునుబోలునె - యీప్సితంబు ప్రజల ʃ కిచ్చునెడలఁ।దలఁపఁ
జింతామణి - తారకంబు సమంబె-యీప్సితంబు ప్రజల ʃ కిచ్చునెడల॥
౧౯॥ ఆ-వె॥ మును నిలింపభర్త ʃ తనవైభవంబెల్లఁ । గోలుపోయిపిదపʃ
గురునికరుణఁ । జేసిప్రణవమంత్ర ʃ సిద్ధిఁగైకొనిగాదె । యఖిలరాజ్యప
దవి ʃ నందగలిగె॥ క॥ తారకమె శాంతినిచ్చును । తారక మే జనదవార్ధి
దాఁటించుననా । తారకమె మాయఁబాపును । తారకమే మోక్షమొ
సఁగి ʃ ధన్యునిఁజేయుఁగ॥ ౨౦।ఆ-వె॥ తారకంబుకంటెఁ ʃ దగమోక్ష
సాధనం। బొండులేదు జగతి ʃ మండలమునఁ । దారకంబె పరమʃధర్మం
బటంచును । బరమశివుఁడు దెల్పెఁ ʃ బార్వతికిని॥ ౨౧॥ క॥ తారకమె
మూలమంతకుఁ । దారకమే సకలప్రాణి ʃ తతులవెలుంగుఁగ । దారకమే
లేకుండిన । నీరేడుజగంబులపుడె ʃ నిర్మూలమగుఁగ॥ ౨౨॥ ఆ-వె॥ తార
కంబనియెడు ʃ ధనమును గైకొన్న। వారికెనయె యింద్రʃవైభవములు।
వారిపదవిఁజెప్ప ʃ వశమె శక్రునకైన ʃ నబ్జభవునకైన ʃ హరునకైన॥
౨౩॥ క॥ తారకము జీవులకు నా । ధారముగావునను జూడఁ ʃ దగనంత
టికిఁగ । దారకము తానెయగునా । కారణమునఁగల్గెఁ దార ʃ కంబను
పేరుఁగ॥ ౨౪॥ ఆ-వె॥ తారకంబనంగ ʃ దైవంబెభావింప । దైవమనఁగఁ
బరఁగు ʃ దారకంబె తారకంబుకంటెఁదలఁపంగ వేఱొండు । దైవము
రయలేదు ʃ ధరణిలోన॥ ౨౫॥ చ॥ తలఁప ననేకపూసలొక ʃ దారము
నందున నిల్చినట్లుగా । నిలఁగలజీవకోటులకు ʃ నెల్లను దైవమె సూత్ర
ధారియై।యిలరు సమస్తభూతములʃయందుఁ జరించుచునుండు నాతనిఁగ।
తెలియుట దుస్తరంబు మఱి ʃ దేవగణంబునకైన రుక్మిణీ॥ ౨౬॥ ఆ-వె॥
అక్కజముగ నతఁడెʃపెక్కుండ్రవలెఁదోఁచు।నిక్క మెన్నిచూడʃనొక్కఁ
డగును । నింద్రజాలకుండు ʃ నిఖిలంబుఁ దనమాయ । గాను జూపుఁ
దాను ʃ గాఁడెయొకఁడు॥ ౨౭॥ క॥ దారువులయందు ననలము । తీరునఁ
దైలంబుతిలల ʃ దీపించుగతిఁగ । క్షీరముల ఘృతముభఁగిని । నారయ
భగవంతుఁడుండు ʃ నఖిలమునందుఁగ॥ ౨౮॥ తే-గీ॥ చుట్టు తెరలోనఁదా

నుండి సూత్రములను । బూని బొమ్మలనాడించుఽవానిలీల । మాయఁదాఁ జాటుచేసుకఽ మఱుఁగునుండి। జీవులనునెల్ల నాడించుఽ దేవుఁడొక్కఁడె॥ ౨౮॥ క॥ వాలాయంబాద్దైవము । నాలీలఁ గదుపకున్న ఽ నానాజీవుల్ । కీలూడినబొమ్మలక్రియఁ । గూలవె నిమిషంబులోనఁ ఽగుప్పలయనేత్రీ॥౨౯॥ ఆ-వె॥ బొమ్మలాడుచున్న ఽ పోల్కిఁగాఁగనుపించు । నాటకుండు లేక ఽ యాడఁగలవె । యాడు మేనిబొమ్మ ఽ లందఱునొగిఁగందు । రరయ లేరు బొమ్మ ఽ లాటకాని॥ ౩౦॥ క॥ బొమ్మల నాడించుచుఁ దను । బొమ్మల మధ్యమున వెల్గు ఽ భూతేశ్వరునిన్ । నెమ్మదిఁగానక తంత్రపు । బొమ్మ నమ్మియును మాయఁ ఽ బొందుదు రెలమిన్॥ ౩౧॥ ఆ-వె॥ తంత్రములకు మేటి ఽ యంత్రంబులకు మేటి । మంత్రములకు మేటి ఽ మంత్రమగుచు । సూత్రములకు మేటి ఽ సూత్రంబు తారక । సూత్రమదియె బ్రహ్మఽసూత్ర మనఁగ॥ ౩౨॥ క॥ చోరుండైనను దురితా । చారుండును నైన నమితఽ జారుండైనన్ గ్రూరుండనైన మఱియా । తారకతత్వంబుగనిన ఽ ధన్యాత్ముఁడగున్॥ ౩౩॥ ఆ-వె॥ అట్టి తారకంబు ఽ నందంగ శక్యమే । యెట్టి వారికైనఁ ఽ బట్టువడదు । పట్టువడినయేని ఽ భగవంతుఁ డాతఁడే।యనఁగవచ్చు నెవ్వఁడైనగాని । ౩౪॥ క॥ మతవర్గంబులచేతను । వ్రతజప తపశౌచదాన ఽ వరశీలములన్ । గ్రతుతీర్థ కర్మదుష్కృత । గతులను గనరాదు తారఽకంబరయంగన్॥ ౩౫॥ క॥ మఱియీ తారకమార్గము। పరికింపంగ నరుదీప్రఽపంచమునందున్ । దరిఁజేర లేని మార్గము।లరయఁగఁ బెక్కులును గలవు ఽ హంసవిహారీ॥ ౩౬॥ సీ॥ జలజాక్షి వినుము ప్రఽజ్ఞానమే బ్రహ్మమన్ ఋగ్వేద వాక్యంబుఽ రీతిదెలిసి।పరికింపఁగా నహంఽబ్రహ్మాస్మియనుయజుర్వేద వాక్యంబును ఽ వివరమెఱిఁగి।తనరఁ దత్త్వమసినాఁ ఽ గనుసామ వేదవాక్యంబునుఁ భావించి ఽ యనువు మీఱఁ। గనయమాత్మా బ్రహ్మఽమనునథర్వణ వేద – వాక్యంబు వీక్షించి ఽ వరుసతోడ । నితర సంకల్పములు లేక ఽ నిశ్చల తను । భూతముల కెల్లనాధార ఽ భూతుఁడైన । బ్రహ్మమేయాత్మ యాత్మయే ఽ బ్రహ్మమనుచు । నాత్మవేత్తలు గాంతురఽహర్నిశంబు॥ ౩౭॥ క॥ పండునిశయ్యాను రంభయు। నుండియుఁ గార్యంబు లేని ఽ యొప్పనఁదమలో। నిండియుఁదానై వెలుఁగుచు। నుండిన దారకమునొంద ఽ నోపరు చెనటుల్॥ ౩౮॥ ఆ-వె॥ ఇలను దారకంబు ఽ సులభమైయుండంగఁ । దెలియలేక గుట్టు ఽ తెలివిమాలి। మతములాది పెక్కు ఽ మార్గంబులం జిక్కి । వెతలఁ బడుదు రెల్లఽవెట్టినరులు॥ ౩౯॥ చ॥ మతకులశాస్త్ర ధర్మములు ఽ మాని తదాశ్రమమా ది

పద్ధతుల్ । సతతముభ క్తిఁ బెంపొదవ ఽ సద్గురుపాదము లాశ్రయించి సద్గతిఁ గలిగించు తారకముఁగాంచిన వారికెగాక యన్య సం । శ్రితినను బొందువారలకు ఽ సాధ్యమె బాయఁగ జన్మబంధముల్ ॥౧౦॥ క॥ తారకధన మార్జించిన । వారలకునునన్య ధనము ఽ పరఁగఘనంబే । సారామృతములు గ్రోలిన । వారికిక్షీరాదు లెంత ఽ వసుమతిలోనన్ ॥ ౧౧॥క॥ తారకమే సచరాచర । తారకమనియాత్మలోనఁ ఽ దలఁచుచుఁదమకా। తారకమే తారకమని తారకమును జెందువారె ఽ తత్వజ్ఞులిలన్ ॥౧౨॥ ఉ॥ ధారుణికెల్ల రాజనుచుఁ ఽ దానె ప్రభుత్వముఁ జేయుచుండిన। న్నారయ విశ్వమెల్లఁ దనఽహ స్తములోపలఁ జేర్పనోపినన్ । నేరుగసర్వవిద్యలనుఽ నేర్చికవిత్వముఁజెప్పజాలినన్ । దారకనూ క్తిలేక భువిఁ ఽ దత్సకలంబును వ్యర్థమారయన్ ॥ ౧౩॥ ఆ-వె॥ తారకంబునకును ఽ దాత్పర్యమగునాత్మ। సూత్రధారియనఁగ ఽ జ్యోతియనఁగ।పరమహంసయనఁగఁ ఽ బరమాత్మయనఁగను । స్వామియనఁగసర్వ ఽ సాక్షియనఁగ॥ ౧౪॥ క॥ మగువా విను బ్రహ్మంబనఁ । దగఁబరతత్వంబనినను ఽ దైవంబనిన । న్నగుణుండనక్షరుఁడన। భగవంతుఁడనంతుఁడనఁగఁ ఽ బరమాత్మనకా॥౧౫॥ఆ-వె॥ పసిడిస్వర్ణహేమ ఽ బంగార మనినను । గణకమునకు వేలు ఽ గానిభంగిఁ। బెక్కునామములను బేర్కొనుచుండినఁ । దారకంబునకును ఽ వేలుగలదె॥ ౧౬॥ క॥ అనఁబరమాత్మఁ డొకండే । యనువున రూపములు పెక్కు ఽ లయ్యెనొచోద్యం బునునయ్యె శంకమదిదోఁ । చెను దీనిం దెల్పుమనినఽ శ్రీహరిపల్కెన్ ॥ ౧౭॥ ఉ॥ ఏకముగాదె మృత్తిక యఽనేకములై చెలువొందుఁ గుంభముల్ । ఏకముగాదు హేమమున ఽ నేకములై నెగడొందుభూషలున్ । ఏకముగాదె తంతువునఽనేకములై గనఁ బించు వస్త్రముల్ । ఏకపరాత్మ దేహము లఽనేకములై విలసిల్లునట్లుగన్ ॥ ౧౮॥ సీ॥ అజహర హరినరా ఽ ద్యసుర దిక్పాల స - న్ముని సుధాకర తార ఽ లినసుపర్వ । గరుడకిన్నరయక్ష ఽ గంధర్వపన్నగ - శిష్ట విద్యాధర ఽ సిద్ధసాధ్య । హరిణ మర్కట భృంగ ఽ హరిసూకర శునక-గజ తురంగ పతంగ ఽ ఖర లులాయ । బ్రాహ్మణచండాల ఽ పశుక్రిమికీటక- వ్యాఘ్రభల్లగహన ఽ వనధిగోత్రఽ జాలస్త్రీపురుష గనపుంసకవికార। జారచోరార్భకావృద్ధ ఽ జనసమాజ । పంచభూతాది సర్వప్ర ఽ పంచమందు । నిండునందనక పరాత్మ ఽ నిండియుండు॥ ౧౯॥ తే-గీ॥ శాకినీ బ్రహ్మరాక్షస ఽ సముదయములు । భూతభేతాళము లతండె ఽ పూని చూడ । మంత్రఘన యంత్ర తంత్రాదిఽమహిమలకును । గారణుండగు

సర్వాధికారి యతఁడు॥ ౫౦॥ క॥ భూరజహిమ రేణువులను। దారల
లెక్కింపవచ్చుఁ దరుణీమణి యా। తారకబ్రహ్మము సర్వా కారంబు
లునెన్న బ్రహ్మకైనను వశమే॥ ౫౧॥ చ॥ పుడమిసమస్త జీవులను
బొమ్మలఁజేసియు నాడఁజేయుచున్। విడుచును గొన్నికొన్నిఁటిని పీడక
గొన్నిటినిల్పి కొన్నిఁటిన్। నడఁచు నెఱుంగలేరెవరు నాతని మాయలకె
ల్లవారలు। న్నడఁగి సబద్ధులౌదురు మహాత్ములు పండితులెల్లనం
ధులై॥౫౨॥ ఆ-వె॥ కర్తకర్మక్రియలు గలయుఁగఁ దానయై। తాను
గానిభంగిఁ గానఁబఱచు। నజుఁడు గలుగఁజేయు హరిరక్షణముసేయు।
శివుడు లయమునొందఁ జేయుననఁగ॥ ౫౩॥ క॥ సర్వముదై వాధనము।
సర్వంబునఁ గలడతండు సర్వసముండై। సర్వంబుతానెయగుచును। సర్వం
బునుగాక వెల్గు సమరసవృత్తిన్॥ ౫౪॥ ఆ-వె॥ కలఁడుకలఁడటన్న
ఘనులకు దైవంబు। గలయవెందునైనఁ గల్గితోఁచు। లేఁడులేఁడటన్న
లీలదానెందైనఁ। గలిగి హీనులకును గానఁబడఁడు॥ ౫౫॥ సీ॥ రాజునై
మంత్రియై రయమొప్ప - భృత్యుఁడై యోగియై భోగియై రోగియ
గుచు కర్ముఁడై ధర్ముఁడై కడుబలాబలుఁడునై - యర్థియై దాతయై
హర్తయగుచు। శాంతుఁడై యుగ్రుఁడై సత్యాత్ముఁడై యనృ -
తాత్ముఁడై పేదయై ధనికుఁడగుచు। సుజనుఁడై మూఢుఁడై సుజ్ఞాన
వంతుఁడై -ధీరుఁడై భీతుఁడై జారుఁడగుచు। నొక్కచోటనాడు నొక
చోటఁబాడు వే। ఱొక్కచోట నేడ్చు నొకటనవ్వు। నొక్కచోటగిట్టు
నొక్కటఁబుట్టుపో। వానిమహిమదెలియ వశమెయింతి॥ క॥ వారనవీ
రన నెవ్వరు। నారీమణి పెక్కురూప నామములగుచున్। వేఱుగవేఱు
గఁదోఁచుట। నారయ మదికల్పితంబు నాటకుఁడొకఁడే॥ ౫౩॥ ఆ-వె॥
ఒక్కఁడగుచుఁ దాను బెక్కుదెఱంగుల। నిట్లుచేయఁబడుట యేల
యనిన। నొనరఁదనకుఁదా వినోదంబుకొఱకునై। యాచరించుచుండు
నద్భుతములు॥ ౫౭॥ చ॥ తలఁపఁగ నింద్రజాలకుఁడు తన్మహిమన్ గర
లొంటిలశ్వముల్। చెలఁగి రథాదిసైన్యములు చిత్రపురంబులుఁ జేయు
మాపు న। వ్వల నతఁడొక్కఁడై నటుల వారక దైవము సర్వజీవులన్।
గలుగనొనర్చు వింతలను గాంచు నడంచును నొకఁడౌఁదుదన్॥ ౫౮॥
ఆ-వె॥ ఎన్నిగతులఁదోఁచి యేవిధంబుననున్నఁ దానుగానిదొకటి
దలఁపలేదు। అగ్నికుష్ణగుణము లరయంగసహజమై। వేఱుగానిభంగి
సారసాక్షి॥౬౦॥ క॥ తనమాయవలననైనది। తనకన్యముగాదెదియును
దత్సకలమునన్। దనరూపు గల్గియుండును। దనమాయ లయింపనిల్చు

దానొక్కరుఁడే॥ సీ॥ బ్రహ్మవేత్తలయందుఁ ఽ బామరజనులందు - బల
యుతులందు దుర్బలులయందు । ఘోరపాతకులందు - భూరిపుణ్యుల
యందుఁ - గపటాత్ములందు ని ఽ ష్కపటులందు । నసృతాత్ములను
సూనృ ఽ తాత్ములయందును - మతిశాంతులందుఁ దా ఽ మసులయం
దు । ద్రవ్యవంతులయందు ఽ దారిద్ర్యజనులందు - ధర్మాత్ములందు నఽ
ధర్ములందు । నీచజనులందు రాజగఽదీశులందు । నెచ్చుతగ్గులు నేమియుఽ
నెంచరాక । సర్వజీవులఁ బరమాత్మ ఽ సముఁడునగుచు । నొక్కరూపం
బుచే వెల్గు ఽ నిక్కముగను॥ ౬౨॥ క॥ ఒకఁడే సకలచరాచర । నికరంబు
లయందుఁ గలుగు ఽ నిక్కంబుగ నా । సకలేశుఁడుగాకన్యం । బిఁకనె
వ్వరుదిక్కుగల్గ ఽ రెందు వెదకినన్॥ ౬౩॥ తే-గీ॥ అండపిండాండబ్రహ్మాండఽ
మాదియగుచు । నాశలీనమైనట్టియా ఽ నభముమాడ్కి ।ఘటపటాదులఁ
జరియించుఁ ఽ గలిపొల్కిఁ । దారకములరుమణిగణ ఽ తంతువట్లు॥౬౪॥
చ॥ మునుమునునూలులేక నిలఁ ఽ బుట్టము లెవ్వియు లేని చొప్పున।న్నను
వగుమన్ను లేకను ఘటాదులు నెవ్వియు లేనికైవడి । న్నినుమును లేక
యాయుధము ఽ లెవ్వియు నేర్పడకుండునట్లుగాఁ । దనువులు నాదిలోక
ములు ఽ దైవము లేకయుగావు గావునన్ ।౬౫॥ ఆ-వె॥ ఆత్మవలనఁగల్గుఽ
నఖిలప్రపంచంబు । నాత్మకరసిచూడ ఽ నన్యమగునె । విత్తువలనఁగల్గ ఽ
వృక్షంబు భావింప । విత్తనంబునకును ఽ వేఱుగలదె॥ ౬౬॥ క॥ ఎక్కడఁ
జూచిన గగనం । బొక్కటియైయుండునట్టి ఽ పోలికగానే । దిక్కులు
పిక్కటిలందా । నొక్కఁడె తారకమునగుచు ఽ నుండుదనువులన్॥ ౬౭॥
తే-గీ॥ దేవుఁడొక్కండెయిల సర్వ ఽ దేహములను । దోఁచు నెట్లని
నీమదిఁ ఽ దోచెనేని । భానుడొక్కండె బహుజల ఽ భాండములను ।
బెక్కురూపులఁదోఁచడే ఽ బిసరుహాక్షి॥ ౬౮॥ ఆ-వె॥ బాహ్యమందుఁ
జూడ ఽ బహురూపులై తోఁచు । నంతరమునఁజూడ ఽ నాత్మయొకటె ।
చూపునందుఁగల్గు ఽ రూపంబులెల్లను । జూపులోనఁ జూడ ఽ శూన్యమ
గును॥ ౬౯॥ క॥ నావృతు బహువిధరూపుల । భావంబునఁ గానుపించు ఽ
పరమాత్మమదిన్ । సేవించునెట్టులొకనిగ । నావిధముం దెలుపుమనినఽ
నతఁడిట్లనియెన్॥ ౭౦॥ క॥ మానిని పశువులు భేదం । బైనను భేదంబు
లేదు ఽ పాలకునట్లే । మేనులుపొక్కైభిన్నం । బైనను భిన్నంబులేదు ఽ
పరమాత్మునకున్॥౭౧॥ క॥ తరణియొకండయ్యు సకల । ధరణీవలయము
నరశ్మి ఽ తనదైనగతిన్ । పరమాత్ముండొక్కండై । పరఁగుచు నిఖిలంబు
నిండి ఽ భాసిలుచుండున్॥ ౭౨॥ ఆ-గీ॥ జగతి జీవతతుల ఽ చరణంబుల

న్నియు । హా స్తిపదములోన ఽ నడఁగునట్లు । చదలు మొదలుభూతఽకస
ల ప్రపంచంబు నాత్మలోనిదగుచు।నడఁగియుండు ౨౩॥ క॥ నీరజహిత శశి
కాంతలు । బొలసి చోటులనునైనఁ ఽ బరికింపఁగనా । తారకబ్రహ్మము
గలుగును । సారసముఖి యతఁడులేని ఽ స్థలముంగలదె॥ ౨౪. ఆ-వె॥ ఇం
తలావటంచు ఽ నింతదీర్ఘంబంచు । నిట్టిచన్నియుంచుఽనిట్టిదంచు । నాత్మ
నెన్నరాదు ఽ నామరూపాదిక । మూలకతీతుఁడగుటఽమోహనాంగి॥౨౫॥
క॥ అనలంబుఁదాకి యినుమును।దనరూపై దోఁచునట్లు ఽ దైవమునానా ।
తనువులయందునఁ గల్గియుఁ । దనవలెనే గానుపించుఁ ఽ దత్సకలంబుల్॥
౨౬॥ క॥ ఘనమణిగణములు వేఱగుఁ । దనరంగా వానియందుఁ ఽ దంతు
వొకటియాఁ । దనువులు సర్వము వేఱఁగు । గనుఁగొన దైవంబొకండుఽ
కాంతామణిరో॥ ౨౭. సీ॥ అలలును బుద్బుదం ఽ బులు ఫేనములునన్న-
నవియెల్ల నీరంచు ఽ నరయునట్లు । నాయుఘంబులు రూప ఽ నామముల్
వేఱైన - నవియెల్ల నినుమంచు ఽ నరయుభంగి । నవని భూషలురూపఽ
నామముల్ వేఱైన - నవియెల్లఁబసిఁడిగా ఽ నరయుభాతి । రూఢిపల్వలు
నామఽరూపముల్ వేఱైన ఽ నవియెల్ల సూలంచు ఽ నరయురీతి । నరయ
కుంభరూప ఽ నామముల్వేఱైన । నన్నిమన్నియంచు ఽ నరయుపోల్కిఁ।
బెక్కునామరూప ఽ భేదముల్ దోఁచిన । నిఖిల మాత్మయంచు ఽ నెంచ
వలయు॥ ౨౮॥ ఉ॥ వూని తటాకభాండముల ఽ పోల్కి నిషేధమొనర్చి
తద్గతం । బైన జలంబులేక మనిఽభావమునన్ దలపోయుచందమిూ। మాన
వదేవ పక్షిమృగఽమానిత జంతునికాయ కాయముల్ । మాని తదంత
రాత్మఁ బర ఽ మాత్మని నేకముగాఁగనందగున్॥ ౨౯॥ సీ॥ ఒక్కదేశం
బున ఽ నొక్కకాలంబున - నొక్కరూపంబుచేఽనున్నవాని । వేఱొక్క
దేశాన ఽ వేఱొక్కకాలానఁ - గొండొక్కరూపానఽనుండఁజూచి।రూఢి
దేశముకాల ఽ రూపముల్ విడియుల్ల-యతఁడె యీతండంచు ఽ నరయు
మాడ్కిఁ। బెక్కుదేశంబులై ఽ పెక్కుకాలంబులై - పెక్కురూపంబులై ఽ
భేదబుద్ధి । కలరఁ దోఁచుచున్నను ఽ గాలరూప । దేశ నామంబులను
నెల్లఁఽదీఁచివేసి।పూని యింతకుఁగారణ ఽ భూతుఁడైన।వానినొక్కనిఁగాఁ
జూడ ఽ వలయునింతి॥ ౩౦॥ ఆ-వె॥ ఎన్నిగతులనీకు ఽ నెనుబోధించిన ।
నాత్మకంటెఁగల్గ ఽ దన్యమొకటి । యెన్నియెన్నిరూపు ఽ లెన్నెన్నిట్లుదోఁ
చిన । నన్నియాత్మయంచు ఽ నరయుమిూవు॥ ౩౧॥ క॥ అనవుడువిని పర
మాత్ముం । డన నే రూపంబువాఁడు ఽ నగుజీవాత్ముం । డననెట్టివాఁడు

## జీవాత్మ పరమాత్మల లక్షణము.

వీరలు కుచ భేదంబేమియు విన ర గోమలిక నిర్మెన్॥ ౨౨॥ మ॥ తరుణీ దేహ
మునందు రెండుగ తుల్యౌర దర్శ్యంబు మర్మంబుగాఁ । బరమాత్ముండనని
ర్గుణుండునగుచున్ ర భాసిల్లు నశ్రాంతమున్ । గరిమన్ జీవుఁడనంగఁ దాసగు
ణామై ర గన్పించుసీకర్మము । న్నరయ దాను నెఱుంగకున్న నదియే ర యజ్ఞా
నమెవ్వారికిన్ ॥ ౨౩॥ సీ॥ అజ్ఞానమెయ్యెది ర యనవిచారించిన-నేర్పునఁ
దన్నుఁదా ర నెఱుఁగకుంట । యెవ్వరుదన్నుఁదా ర నెఱుఁగరా యెఱుఁ
గర-దేమెఱుంగుదురన్న ర నేనుపతిని । నేఁబురుషుండను ర నేఁబ్రాహ్మ
ణుండను ర నేక్షత్రియుఁడ వైశ్యుఁ ర నేనువరయ । నేను శూద్రుండను ర నేవాని
నిపుత్రుండ ర నేనుధాత్రిధవుఁడ ర నేను శివుఁడ । నేను రాముండ కృష్ణుండ ర
నేనునరుఁడ ననెడు పద్ధతు లెఱుఁగుదు ర రండజీలను । నట్టియజ్ఞానమును
బాసి ర యతులమహిమ । దన్నుఁదాఁగన్నవారలే తత్వవిదులు॥ ౨౪॥
ఆ-వె॥ ప్రచురమైన జీవర పరమాత్మ భావముల్ । తేఁట తెల్లమిగను ర దెలి
యవలయు । నట్లుగాకయున్న ర నజ్ఞధవాదిని । జ్ఞరులకైనఁ జెడదు ర
సంశయంబు॥ ౨౫॥ క॥ కావున సతి పరమాత్ముని । యావిధమును గొంత
వింటి ర వదిరెట్లుండెన్ । జీవాత్మ తెఱఁగువినుమిఁక । భావంబునఁ
జిక్కులెల్ల ర బాయుననికున్ ॥ ౨౬॥ ఆ-వె॥ జగతి పాపపుణ్య ర చయ
మును గావించు । నరకస్వర్గములను ర ననుభవించు । నెఱుఁగుచుండు
మఱచు ర నెల్లకార్యంబులు । సేయుచుండువాఁడె ర జీవుఁడగును॥ ౨౭॥
క॥ జీవుఁడె జన్మకుమూలము । జీవుఁడె సుఖదుఃఖములను ర జెందును
ధాత్రిన్ । జీవుఁడె బంధములోఁబడు । జీవుఁడె మోక్షంబుఁగాంచు ర సిద్ధ
ము తరుణీ॥ ౨౮॥ ఆ-వె॥ సఖియ జీవుఁడెన్న ర సకలేంద్రియములకు । రాజు
నగుచునుండు ర రాజితముగ । నతఁడులేక యింద్రి ర యంబులు నేమియుఁ ।
జేయఁజాలవింక ర సిద్ధముగను॥ ౨౯॥ క॥ ధరషడ్వింశకుఁడగు నా । పర
మాత్ముఁడెయంచు నాత్మ ర భావింపవలెన్ । మఱి పంచవింశకుండన ।
నరుదుగ మనమనినజీవుఁ ర డనిగాంచఁదగున్ ॥ ౩౦॥ తే-గీ॥ ఇంద్రియం
బులు గైకొని యెల్లపనులు । గడుపునట్లుగఁ జేయఁదాఁ ర గర్తయగుచు
నీలతోయదమధ్యస ర న్మెరుపీఠి । సబికుఁడై యుండు జీవుండు । జాగర
మున॥ ౩౧॥ క॥ గళమునకు డిగ్గినిల్చిన । కలలను గనుచుండు హృదయ ర
గతుఁడైనయెడన్ । దెలివిదొలంగి యవిద్యను । నలరంగా మునిఁగిపోవు ర
నఖిలముఁ దానున్॥ ౩౨॥ తే-గీ॥ అంత నాపంచకముల సింహాసనమున ।
జేరి జీవుండు జాగ్రతఁ ర జెంది తనదు । భటులుగానున్న యింద్రియ ర

పత్తిచేత । నెల్లకార్యంబులును జేయ నేర్పరించు॥ ౯౩॥ క॥ జీవుఁడె జాగ్రతనొందును । జీవుండే గుడుచుఁగట్టుఁ జేయును బనులన్ । జీవుఁడె స్వప్నముగాంచును జీవుండే నిద్రఁజెందు జీవుఁడె తెలియన్॥ ౯౪॥ క॥ ఇన తేజ మాశ్రయించియు । జను లాయాపనులఁ జేయు చందము పర మాత్ముని సత్తామాత్రంబునఁ । బనిగొని మనమింద్రియములపనులను గడపున్॥ ౯౫॥ తే-గీ॥ స్వాంతమును జేర్ప ననువొందఁ గా నయస్సు । నెట్లు చలియించునా రీతి నిర్గుణంబు । నైన బ్రహ్మంబు సన్నిధి నరయఁ ద్రిగుణ । సహితుఁడగుచును జీవుండు చలనుఁడయ్యె॥ ౯౬॥ ఆ-వె॥ సఖియ మనంబనేక సంశయములకు మూ । లంబు నిగ్రహింప రాని దంచు । నెంచిచూడ సకల చాంచల్యములకును । గారణంబునగును గాన వినుము॥ ౯౭॥ ఉ॥ ఇట్టిమనంబు దుస్తరము దెట్టుల నిగ్రహమే నొనర్తునా । నిట్టటుసంచరించు పశు వెట్టులబంధమెువర్పనిల్చునో । యట్టుల నెప్పుడేమఱక యార్యులబోధనుమంచివాగెలన్ । గట్టుపడంగఁ జేసినను గాకను గాలిమనంబు నిల్చునే॥ ౯౮॥ ఆ-వె॥ ఒనర వలల నురుల నోడలఁగోలలఁ । గా దెఱుఁగు పకపక్షి గజమృగంబు । లాదిదగులువడుట యట్లు తారకసాధ । నమున మానసేంద్రియములు చిక్కు॥ ౯౯॥ క॥ అనవుడుఁదను వొక్కటియే । గనుపడునందఱికి నాల్గు । గలవని మేనుల్ । వినియుందు నెవ్వియవియనఁ । గన కాంగికి ననియెగోపికావల్లభుఁడున్॥ ౧౦౦॥ క॥ మరితత్త్వపంచవింశతి । సురుచిరముగఁ గల్గి

## తనుచతుష్టయ నిర్ణయము.

నదియె స్థూలశరీరం । బరయఁగ జాగ్రత దానికి । విరివిగ నామంబున లరు విశ్వుఁడనంగన్॥ ౧౦౧॥ క॥ జ్ఞానేంద్రియశబ్దాదులు । మానిసిప్రాణ మునుగూడి మానసబుద్ధుల్ । గాన య్యెసూక్ష్మమదికల । దానికినామం బుశ్లైంద్రైజసుఁడనఁగన్॥ ౧౦౨॥ క॥ ఇరవుగఁ జిత్తముజ్ఞాతను । గరము రుదుగఁ గూడినదియె కారణదేహం । బరయసుషుప్తియు దానికిఁ । బరికింపఁగ నామమెుప్పెఁ బ్రాజ్ఞుఁడనంగన్॥ ౧౦౩॥ క॥ కలజాగ్రతనిద్రలలో । నెలమి స్వయంజ్యోతియగుచు నిలిచిన వెలుఁగే । దలఁప మహాకారణమది । నలువొందు హిరణ్యగర్భుఁ డను నామమునన్॥ ౧౦౪॥ తే-గీ॥ మూఁడు దేహంబులను దాల్చి ముఖ్యముగను । జీవుఁడీమూఁడవస్థలఁ జెందుచుండు । నేయవస్థల నెఱుఁగక యేకరీతి । నుండు పరమాత్ముఁడెపుడు నఖండమగుచు॥ ౧౦౫॥ క॥ కారణదేహంబనఁగను । నారయగూఢంబు ముంచు నదియే దేల్చున్ । కారణమను విత్తదియే । శారీ

రము లనెడువృక్ష ॥ చయము మొనరింపఁగ॥ ౧౦౬॥ ఆ-వె॥ మూఁడు మేనుల కును ॥ మూలమై యున్నట్టి । పరముగాన లేక ॥ భ్రాంతుఁడగుచు । నిద్ర జాగరముల ॥ నిరతంబు జీవుండు । మునిఁగి తేలుచుండు ॥ మాధవ్రృత్తి॥ ౧౦౭॥ మ త్తకోకిల॥ ఎన్నిగా నిల జన్మకర్మలఁ జెందుచుండెడు జీవుఁడు। నెన్నిభంగులనైనఁ జెందఁడి ॥ కెన్నఁగా నలమోక్షముఁ।బన్నగాఁ బర మాత్మ నెప్పుడు భావమందునఁ గాంచునో । గ్రన్ననం గడ దేఱునప్పుడె ॥ గట్టిగా మఱిజీవుఁడుఁ॥ ౧౦౮॥ క॥ జలములయందున లవణము । గలిగి నగతి నాత్మయందె గల్గె మనంబుఁ ॥ జలగతలవణము పోలికఁ।గలియఁగ బరమాత్మయందె ॥ గతజీవుఁడగుఁ॥ ౧౦౯॥ ఆ-వె॥ నిర్మలాత్మయందు నీవికారంబగు । నట్టిమాయదోఁచు । నెట్టులనిన । దోయజారియందుఁ దోఁచు కళంకంబు । వలెనటంచుఁ దెలియు ॥ వలయుఁదరుణి॥ ౧౧౦॥ క॥ పరమాత్మయందు జీవుం । డరయంగా నెట్లుగల్గె ॥ నెనియెంచకుసీ। కెఱిఁ గింతునదియు నెట్లనఁ । బరిశుద్ధపు నీళ్ళఁబుట్టు ॥ పాచివిధమునఁ॥౧౧౧॥ ఆ-వె॥ స్ఫటిక ముకురమాది - జలములయందునఁ । బ్రతిఫలించివస్తు ॥ ప్రతతివోలె । మఱియు నిష్కళంక ॥ మైన బ్రహ్మమునందు । మలినమై నజీవ ॥ మాయదోఁచె॥ ౧౧౨॥ క॥ ఏవిధమైన కళంకము । భావింపఁగఁ గల్గదెపుడు ॥ పరమాత్మునకుఁ । గావున మాయలు సర్వము' జీవునకే గాని మాయఁ ॥ జెందునె యతఁడుఁ॥ ఉ॥ ప్రావుగ నిర్వికారుఁడగు బ్రహ్మము నెద్దియెఱుంగకుండఁగా బాపపుమాయయే పగిది ॥ ప్రాప్తము నయ్యెనటంచుఁ జూడఁగా । దీపముక్రిందనీడయును ॥ దీపమెఱుంగక దోఁ చుకైవడి । న్నాపరమాత్మయందునను ॥ నాతఁడెఱుంగక గల్గెమా యయుఁ॥ ౧౧౩॥ ఆ-వె॥ అనిలవశత నెగసి ॥ యంబుధరంబులు పరఁగ మింటఁగూడి ॥ పాయునట్లు । త్రిగుణవశములగుచు ॥ దీపించువిశ్వంబు । బ్రహ్మమందు మఱలఁ బాయుచుండు॥ ౧౧౪॥ క॥ ఫణిరాజవేణివినుని ॥ ర్గుణుఁడే మాయలను నెఱుఁగ ॥ కుండఁగఁదనలో గుణమయవిశ్వము దోఁచుట। గణుతింపఁగ నూర్ణనాభి కైవడినొప్పఁ॥ ౧౧౫। క॥ నావుడు చక్రము లనఁగను।నేవియగున్నన్నియవియు నెచ్చటనుండుఁ। నేవిధము

షట్చక్ర నిర్ణయము.

దెలియఁదగునన । నావెలఁదికినిట్టులనియె ॥ నగధరుఁడెలమిఁ॥ ౧౧౬॥ తే-గీ॥ కమలదళనేత్ర యీ స్థూల ॥ కాయమందు । నరయఁగా సప్తచ క్రంబు ॥ లమరుచుండు । గోప్యములుగాన నేరికి ॥ గోచరంబు । గావు వానినీకెఱిఁగింతుఁ ॥ గాంతవినుము॥ ౧౧౭॥ఆ-వె॥ దినము రాత్రిగలుగుఁ

దినముకిర్వదియును । నొక్క-వేయినాఱు ॥ నూఱుమూర్లు । హంసనడుచు
చుండు ॥ నజపాఖ్యనొకరీతి । సకలజీవులందు ॥ సంతతంబు॥ ౧౧౯॥ వ॥
విరాట్టుస్థూలశరీరాంతర్గతంబునగుచు గుదస్థానంబున"ఓం" అను బీజాక్షరంబును భూసదనంబును బీతవర్ణంబునై యాధారచక్రంబు శోభిల్లు, నందుఁ జతుర్దళంబులయందు వ-శ-ష-స-యనువర్ణంబులుం గలిగిభూలోకంబనం జెలంగునందువల్లభశక్తియుక్తుండైన విఘ్నేశ్వరునకునార్నూర్లుహంసలును, లింగస్థానంబున"న"యనుబీజాక్షరంబును జలనిలయంబునుశ్వేతవర్ణంబునై స్వాధిష్ఠచక్రంబురంజిల్లు. నందుషడ్దళంబులయందును బ-భ-మ-య-ర-ల-యనువర్ణంబులాఱుంగలిగిభువర్లోకంబనందగు, నందుభారతీయుక్తుండైనబ్రహ్మదేవునకునాఱువేలహంసలును నాభిస్థానంబున "మ" యను బీజాక్షరంబును ననలాలయంబును రక్తరూపంబునై మణిపూరకచక్రంబు భాసిల్లునందుదశదళంబులయందును-డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ-యను దశవర్ణంబులు గలిగి, సువర్లోకంబనంబడు నందు శ్రీసతీయుక్తుండైన విష్ణుదేవునకు నాఱువేలహంసలును హృదయస్థానంబున'శి' యను బీజాక్షరంబును ననిలవాసంబును ధూమ్రవర్ణంబునై యనాహతచక్రంబువిలసిల్లు, నందుద్వాదశదళంబులయందును-క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ-యనుద్వాదశవర్ణంబులుగలిగి మహర్లోకంబనంబరఁగునందుఁ బార్వతీయుక్తుండైన శివదేవునకునాఱువేలహంసలును; గంఠస్థానంబున "-వా-" యను బీజాక్షరంబును గగనసదనంబును నీలవర్ణంబునై విశుద్ధ చక్రంబు చెలువొందు, నందు షోడశదళంబులయందును-అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఏ-ఐ-ఓ-ఔ-అం-అః-యనుషోడశస్వరంబులుంగలిగిజనర్లోకంబనదలరు, నందుమాయాశక్తియుక్తుండైనజీవాత్మనకు వేయిహంసలును, భ్రూమధ్యస్థానంబున "-య-" యను బీజాక్షరంబును పంచభూత సమన్వితంబును మాణిక్యవర్ణంబునై యాజ్ఞాచక్రంబు నొప్పు, నందుదళద్వయంబునందును "హం-క్షం-" అను వర్ణద్వయంబునుం గలిగి తపోలోకంబనందనర్చు, నందు నాదిశక్తియుక్తుండైన పరమాత్మునకు వేయిహంసలును, బ్రహ్మరంధ్రస్థానమున "-రాం-" అను బీజాక్షరంబును సర్వవర్ణ సమగ్రంబునై సహస్రారచక్రంబు వెలుంగు నందు సహస్రదళంబులును గుణనిర్గుణంబులుం గలిగి సత్యలోకంబనవెలయు; నందుసర్వశక్తియుక్తుండైన సద్గురుస్వామికి వేయిహంసలునునర్పణంబగుచుండు॥౧౨౦॥ పం-సీ॥ మజీహృదయాంతర ॥ మందున నొక
యష్ట - దళపద్మమలరును ॥ దానినడుమ ॥ హంసదీపాకృతి ॥ మైవెలుం

గుచు వాయు - చలనమైయాయష్ట దళములందుఁ। బాఱనింద్రునిదిక్కున పాఱఁబుణ్యవిచార - మాజ్ఞేయమునఁగుద్చు నట్టిచింత । యమభాగమునఁబాప మాచరించెడిచింత - నైరృతిదిగ్రతి నందుచింత । నెలమివరుణునిదిక్కు నిద్రించుచింతయు గరువలిదిక్కున గమనచింత॥ తే-గీ॥ కోరిధనమునిదిశడబ్బు గూర్చుచింత । రమణియీశాన్యదిశనువైరాగ్యచింత । నతులితంబుగనాజ్యోతి యట్టికమల । మధ్యముననిల్వనగుఁ బర మార్థచింత॥ ౧౨౧॥ ఆ-వె॥ జ్ఞానమనఁగ వెల్గుకైవడి నుండున । జ్ఞానమనఁగఁదమము చంద మొప్పు । జ్ఞానమనెడు వెల్గు గాంచినయపుడె యు । జ్ఞానమనెడుతమము । సమయునబల॥ ౧౨౨॥ క॥ సుజ్ఞానముగనునంతకు । నజ్ఞానంబు విడిచి చన దంబుజవదనా। యజ్ఞానముడుగువఱకును । సుజ్ఞానముదోఁచఁబడదు సుజనులకైనన్॥ ౧౨౩॥ ఆ-వె॥ విననివానికంటె విన్నవాడధికుండు । విన్నవానికంటెఁ గన్నవాఁడు । కన్నవానికంటె ఘనుఁడుయారూఢుఁడు । వానికంటెఘనుఁడు వసుధలేఁడు॥ ౧౨౪॥ క॥ ధరనొకని పేరువినియును । మఱివానింజూడనట్టి మనుజవిధమునన్ । బరమాత్ముఁడనేననియును । నెఱుఁగవుపాడఁ గాంచియతని నింతకునీవున్॥ ౧౨౫॥ సీ॥ కాశియన్ వాక్యంబు కర్ణంబుననువిన్నఁ - జెలఁగఁగాశియనుచుఁ జెప్పుకొనిన । వినినంతతాఁ జెప్పు కొనినంతమాత్రాన-వారణాసినిఁగన్న వాఁడగునొకో । నెలవు గానక్కాశి నెఱిఁగినవారల - వెనువెంటనే తెంచి విలసితముగఁ । గాశికాపురమును గనులారఁజూచినఁ గాదెయాత్మకుఁదృప్తి కరమటులినె॥ తే॥ యరయఁగానన్నఁ బరమాత్ముఁ డంచు విన్న । నేమిగలదింకఁ బరమాత్మ నెఱుఁగువారి । కరుణచేతను బరమాత్మఁ గానకున్న । వినినచెప్పినవెల్లను విఫలమరయ। ౧౨౬॥ చ॥ జలజ దళాక్షి లోకమున సద్గురుమూర్తి యనుగ్రహంబునన్ । దెలివివహించి బ్రహ్మమును దీర నెఱుంగక యెంతవారికిన్ । బలువిధసాస్త్రవాసనలఁబాయదు సంశయమెంతమాత్రమున్ । జెలవుగఁ జిత్రదీపమునఁ జీకటియున్ జెడనేరనట్లుగన్॥ ౧౨౭॥ తే-గీ॥ బ్రహ్మవిద్యయు జన్మంబుఁ బాపుకతన । నమృతమును మృత్యుజరలాది నడఁచువలనఁ బరఁగఁజండాలుచేనైనఁ బ్రహ్మవిద్యఁ । బొందదగునమృతము విషం బుననునైన॥ ౧౨౮॥ క॥ ధరనీచువలన నైనను । నరయంగా నెట్లువచ్చు నప్పరమహితం ।బరయఁగ నెవ్వరికైనను । గురుతరముగ నతనిఁగొల్చి గొనకావిద్యన్॥ ౧౨౯॥ క॥ ధనమిచ్చియైనఁ దానే।ర్చినవిద్యయొసంగియైన శిష్యత్వంబు।

న్నొనరించి పరమవిద్యను । గొనఁదగు మనుజుండు హీనకులుచేనైనన్॥ ౧౩౦॥ క॥ గురుశుశ్రూషలొనర్చియుఁ । బరవిద్యనుగొనుటమిగులఁ ఫలకారియగున్ । మఱిధనవిద్యలుసేవకు । సరిగావనియందురార్యజనులు ధరిత్రిన్॥ ౧౩౧॥ క॥ మాటలుచేతను మోక్షము । నేటుగ నెవ్వరును దెలియఁ ఽ జేరరుగాన్ । నాటకథారుండుండెడు । సూటినిఁ దెలియంగ వలయు ఽ సూక్ష్మములోనన్॥ ౧౩౨॥ తే-గీ॥ ఉండునిమ్మేనడెబ్బదిరెండు వేల। నాడులందునవిడ వామ ఽ నాసికమునఁ । గుడినిఁబింగళయనునాడిఽ గుదిరియుండు । మధ్యభాగంబునను సుషు ఽ మ్నయువెలుంగు॥౧౩౩॥ సీ॥ హస్తినాడియు జిహ్వ ఽ యందున నెడమనేత్రంబున భాసిల్లు ఽ రమణతోడ । నాతిశంఖినినాడి ఽ నాభియందుననుండు - గాంధారి యను నాడి । కంటనుండు । విడకపూషానాడి ఽ కుడికర్ణమందుండు – నెడమఁ బయశ్విని ఽ యిమిడియుండు । లీలనలంబస ఽ లింగంబునందుండుఁ – గుదిరికుహూనాడి ఽ గుదమునుండు । మొనసి యీచెప్పినవియెల్ల ఽ ముఖ్యమైన । నాడులందున నిడయుఁ బిం ఽ గళ సుషుమ్న । లనెడు నాడులుమూడును ఽ నన్నిఁటికిని । శ్రేష్ఠమైనట్టి నాడులోఽ చిగురు ఽ బోఁ॥ ౧౩౪॥ క॥ కమలాసన పింగళయే । కమలాప్తుని నాడియంచుఁ ఽ గనఁదగునిడయే । కమలారినాడి యనఁదగు । నమరంగ సుషుమ్నయగ్ని ఽ నాడియనఁదగున్॥ ౧౩౫॥ తే-గీ॥ ఇడయుఁ బింగళయు సుషుమ్నఽ యెచట ఽ గూడు । నట్టిసదనంబె భ్రూమధ్య ఽ మనఁగ నొప్పు । రంగుగనదియె ముక్కోటి ఽ సంఘమనఁగఁ । గోరిచూడంగ నదియె త్రికూటమనఁగ॥ ౧౩౬॥ క॥ గంగయనంగను నిడయుం । బింగళయన యమున యనియు ఽ మేటిసుషుమ్న । పొంగుసరస్వతి యనియును । సంగతి దెలియంగవలయు ఽ సామజగమనా॥ ౧౩౭॥ ఆ-వె॥ రమణి ఘ్రాణకర్ణ ఽ రంధ్రముల్ భ్రూమధ్య । దిగువఁగలసియుండు ఽ నగణితముగఁ । తెలియవినుము యదియె ఽ శృంగాటకంబన । నదె చతుష్పదంబ ఽ నంగనొప్పు॥ ౧౩౮॥ ఆ-వె॥ నయన వక్త్రగుహ్య ఽ నాసాగుద శ్రోత్ర। ములును మార్గనవక ఽ మొగినివయ్యె । సెన్నుటకునువశమె ఽ యీనవద్వారక । నాఁబురంబునీకు ఽ నకునునైన॥౧౩౯॥ తే-గీ॥ అరయ నీపురినిర్మితం ఽ బంచచేత । జీవుఁడనియెడు మంత్రితోఁ ఽ జెలువుమీఱ । నింద్రియంబులనెడుభట ఽ నికరమునతో । రమణఁబాలించు పరమాత్మ ఽ రాజగుచును॥ ౧౪౦॥ క॥ వినుమిఁకనీ కాయాపుర । మున భగవంతుండుగలఁడు ఽ పురుషోత్తముఁడా । యనఘుని సేవించియుఁ బావ

నులగుదురు సూరిజనులు ɤ వారిజగంధీ॥ ౧౮౧॥ ఆ-వె॥ ఒనరఁబ్రదివు
టినడుమ ɤ నుపజిహ్వకనుబూర్వ । దిక్కునగుచునుండు ɤ దేవుఁడ
రయ । సూక్ష్మమెవ్వరికి న ɤ గోచరమిది బాహ్యరూపులన్నిఁటికిఁ బ ɤ
రుండునగుట। ౧౮౨॥ క॥ తెలియఁగవచ్చును హేమ్యము । దెలియంగా
వచ్చు కాల ɤ దేశవిధంబుల్ । దెలియఁగవచ్చును నాశము । చెలియంగా
రాదుసుమ్ము ɤ దేవునిమహిమల్॥ ౧౮౩॥ ఆ-వె॥ పద్మనేత్ర యట్టిభగ
వంతు నిప్పుడు । నీకుఁదెలుపనాత్మ ɤ నెంచినాఁడఁ ɤ గాన నిపుడునీదు ɤ
కన్నులపండువు । గాఁగఁజూడుమాత్మ ɤ కలఁకదీఱ॥ ౧౮౪॥ క॥ ఇందు
ముఖి యాపరాత్పరుఁ । డెందో కలఁడంచునీవు ɤ నెన్నకేమిఁకనా । యిం
దుదివాకరనాడుల । యందునఁ జరియించుచుండు ɤ నాతిఁడెతలఁపన్॥
౧౮౫॥ తే-గీ॥ ఇడను బింగళనాడిని ɤ నేకరీతిఁ । బవలు రాత్రియు
నంతర ɤ బాహ్యములను । మాడుతాకృతియగు పర ɤ మాత్మఁగనిన।
మనుజునకు ముక్తి కరతలా ɤ మలకమరయ॥ ౧౮౬॥ క॥ ఈడునుజోడును
లేకయు । నాఁడుది మగఁవాడుగాక ɤ యఖిలమునందున్ । గూడియుఁ
గూడకమెలఁగెడు । వాఁడె భగవంతుఁడనుచు ɤ వర్ణింపఁదగున్॥౧౮౭॥
తే-గీ॥ సుదతి పరమాత్మకెన్నడు ɤ క్షుదయుఁదృష్ణ । గలుగనేరదు
జాగ్రత ɤ కలయుసుప్తి ɤ యరయలేవింకఁ (దిగుణంబు ɤ లాదిమాయ।
లేమియును లేకతా వెల్లు ɤ నెల్లయెడల॥ ౧౮౮॥ క॥ నుడిఁగొని షట్చక్రం
బుల । విడువక పరమాత్మ తంతి ɤ విధమున నెపుడున్ । నడుచుచునుం
డునులో వెలి । నిడపింగళనాడులందు ɤ నిందునిభాస్యా॥ ౧౮౯॥ తే-గీ॥
అరయమనమాది సర్వేంద్రియములుగాక । ద్వంద్వకామాది ముక్తబంధ ɤ
ధములులేక । జన్మవృద్ధియు క్షీణంబు ɤ జరయు మరణ । మాదివికృతి
లేకయు పర ɤ మాత్ముఁడుండు॥౧౯౦॥క॥ పరమాత్ముఁడు సుఖదుఃఖము।
లెఱుఁగడు పుణ్యంబుపాప ɤ మెఱుకమఱపులున్ । ఎఱుఁగరం డేకర్మం
బుల ।నిరతము నొకరీతినుండు ɤ నిర్గుణుఁడగుచున్॥ ౧౯౧॥ ఆ-వె॥ నిర్గు
ణత్వమునను ɤ నెద్దియుగాకయు । సగుణరూపమునను ɤ సకలమగుచు।
సర్వసాక్షియగుచు ɤ సగుణాదిజగములు । గాకయుండునిర్వి ɤ కారుఁడ
గుచు॥ ౧౯౨॥ క॥ మదికినిఁదోఁచుచు నుండును । వెదకినఁ గనుపడక
యుండు ɤ విశ్వంబెల్లన్ । బొదలుచునుండునుద్యాన । సదయాంతర్యా
మియగుచు ɤ సకలమునందున్॥ ౧౯౩॥ ఆ-వె॥ నామరూపగుణము ɤ
లేమిబ్రహ్మమునకు । లేనికతనమాయ ɤ లోనఁజిక్కి । యతనిగాన లేక ɤ
యడవియుగంబులు । తపముసల్పుటయును ɤ దాపసులును॥ ౧౯౪॥ ఆ-వె॥

స్వగతవిగతముల్ స్వƒజాతివిజాతిభే।దములులేక నాత్మƒతత్వమగుచుఁ।
గన్నవారికెందుƒనెన్నశక్యముగాక।యున్నవానిఁ గనుముƒసన్నుతాంగి॥
౧౫౫॥ క॥ అన్నింటను బర। మాత్మయె। యున్నను దద్రూపులెవ్విƒ
నొందఁడతండు। నెన్నఁడు నేగతిఁ జెందక। యున్నట్లే యుండు నెపుడుƒ
నొక్కవిధముగాన్॥ ఆ-వె॥ అనిన రక్తమాంసƒమైన దేహంబుల।యందు
నాత్మయెట్లుƒపొందకుండు। నదియుఁ దెల్పుమనినƒ నాయిందుముఖ
తోడ। నగుచు నిట్టులనియెƒనగధరుండు॥ ౧౫౭॥ క॥ జలజాప్తుఁడు
కల్మషజల। ములఁ దోఁచియు నందుఁ బంకƒమునుబొందక ని। ర్మలుఁ
డగుక్రియఁ బరమాత్ముఁడు।గలయఁడు నానాశరీరƒగతుఁడయ్యుఁడగన్॥
౧౫౮॥ క॥ అనిలము మేధ్యామేధ్యము। లను బాఱియుఁదద్వికారƒమంట
నియట్లే। మునుసర్వƒభూతజాలము। లను నంటియునంటకుండుƒనాత్మకు
నెదియున్॥ ౧౫౯॥ తే-గీ॥ అవని మనుజుడు గృహములƒయందు మె
లఁగి। కాపురంబులు సేసినƒకరణి సర్వ।లోకముల యందుఁజూడఁడాƒ
నేకమగుచుఁ। దనువులే తనకిండ్లుగాƒదైవమొప్పు॥ ౧౬౦॥ క॥ తనువే
తానని యెంచుట। మనుజులకందఱికి సహజమగునది మఱియున్। దనుఁ
దానెఱుఁగకమాటికిఁ। దనువేతాననుటగొప్పƒతప్పగుఁగాదే॥ ౧౬౧॥
ఆ-వె॥ ఇంటనుండువానిƒకింటికిసంగంబు। లేక యుండునట్లుƒ జోక
తోడ। దేహమునకు నందుƒదేహికిసంబంధ।మేమిలేకయెపుడుƒమెలఁ
గుచుండు॥ ౧౬౨॥ క॥ ఇంటికివెలిగామానవుఁ।డంటక విహరించుచుండుƒ
నటునటె దేహం। బంటక దేహిచరించును।నంటినగతినుండు దేనిƒనంట
గయుండున్॥ ౧౬౩॥ ఆ-వె॥ భవనమందు నరుఁడుƒనివసించియున్నను।
నిల్లునేననటంచుƒనెంచనట్లు। మేనునందుఁదానుƒ మెలఁగుచునున్నను।
దనువుతాననంగఁదగదుచూవె॥ ౧౬౪॥ చ॥ వెలయఁగ గేహమందుననుƒ
వింతపదార్థములెల్లఁ గన్పడన్।వెలుఁగనొనర్చి వానికినిƒవేఱగుచుండెడు
దీపమట్లుగన్। వెలయఁగ మానసాది సకƒలేంద్రియ సంగతమైనమే
నులన్। దెలివివెలుంగఁ జేయుచునుƒదేహియు వేఱగుచుండు నింతయున్॥
౧౬౫॥ క॥ అనవిని తారకమంత్రం।బును నానతియిమ్మటన్నఁƒబురుషో
త్తముఁడున్। గని భీష్మరాజవరసుత। కును జెప్పఁదొడంగె నిట్లుƒకుతుక
కపొలర్పన్॥ ఆ-వె॥ మగువ వినుము మంత్రƒమంత్రమూలములు మం।
త్రార్థ మంత్రసారƒమాదియైన। మర్మములను నీకుƒమానక యెఱిఁ
గింతు। నిపుడు సూక్ష్మబుద్ధిƒ నెఱుఁగవలయు॥ ౧౬౬॥ పరహంసుని

హంసలక్షణము.

సంచారము । నరులెవ్వరు నెఱుఁగరింక నంతరమునకున్ । నరుదెంచు నె
పూరకమగుఁ । బరికింపఁగ రేచకంబు బాహ్యము కేగన్ ॥ తే-గీ॥ లోప
లికి నేగి యాయుంచ లోన నడఁగు । నదియె యంతరకుంభకఁ బనఁగబ
రఁగు । వెలికి సంచారమే తెంచి వెలినడంగు । నదియెపో బాహ్యకుం
భకం బనఁగనొప్పు॥ ౧౭౯॥ క॥ పూరకమున సో వర్ణం । బారయ రేచ
కమునందు హామ్మనువర్ణం । బూరకగూర్చి జపించినఁ । దారకమం
త్రంబ యగును దరుణేందుముఖీ॥ ౧౮౦॥ క॥ ఇదియే పరమరహస్యం ।
బిదియే మంత్రార్థమనఁగ నిలను ప్రసిద్ధం । బిదియే జపసూత్రంబన ।
నిదియే పరికింప నజప నిజవేత్తలకున్॥ ౧౮౧॥ తే-గీ॥ అరయవ క్త్రింబు
కర్మేంద్రి యంబుఁగానఁ । బాయకను నోట జపమును జేయరాదు ।
కర్మవాక్కున ధ్యానింపఁ గర్మమునకె । మూలమగుఁగాని ము క్తికి
మూలమగునె॥ ౧౮౨॥ క॥ పెదవులను గదల నీయక । విదితంబుగఁ బర
మహంస వెంటనటింపన్ । పదిఁబొందించి భజించిన । సదయాత్ముఁడు
సులభముగను సద్గతిఁగాంచున్॥ ఉ॥ తారకమంచు నెంచఁబడు తత్వ
మెఱుంగఁగలేక కొందఱం । పాగధరిత్రినా ప్రణవమంత్రము మాత్రము
నేర్చి వాక్కునన్ । సారెకు నుచ్చరింపుదురు సార్థకమేమగు దానభా
వమున్ । దారకమంత్రమందునను దప్పకగూర్చి జపింపలేనిచోన్॥
౧౮౩॥ క॥ మానిని యేమంత్రంబులు । సానుగ జిహ్వేంద్రియమున జపి
యింపవలెన్ । గాని యిఁక వాక్కుచేతను । బూని స్మరింపగరాదు
భువి నెవ్వరికిన్॥ ౧౮౪॥ క॥ అజపామంత్రంబెవ్వరు । భజియింపక తనకు
దానె బపటులరేల । న్నజపనటించును గావున । నజపనునామంబు
గల్గె నాహంసునకున్॥ ౧౮౫॥ తే-గీ॥ చతురపంచషడాక్షరి సంతతు
లును । సప్తమేకత్రయాక్షరు లాదిగాఁగ । సప్తకోటి మహామంత్ర
చయములెల్ల । మఱియు సరిగావు తారత మంత్రమునకు॥ ౧౮౬॥ క॥
మంత్రములకెల్లఁ దారక । మంత్రంబే మూలమంత్రమగుఁ గావుననీ ।
మంత్రము సామాన్యంబగు । మంత్రంబని యెపుడునీదు మది నెన్నకుమీ॥
౧౮౭॥ తే-గీ॥ ధరణిని నజపసూత్రంబు దాల్చినట్టి । నరుఁడెవండైనఁ
బాఱుఁడ నంగఁబరఁగుఁ । దథ్యముగ బాహ్యసూత్రంబు దాల్చియు
జప । పరత లేకున్న నెట్లగు బ్రాహ్మణుండు॥ ౧౮౮॥ క॥ బ్రహ్మవిచా
రము నొందియు । బ్రహ్మముఁగనుఁగొన్న వాఁడె బ్రాహ్మణుఁడగుఁబో ।
బ్రహ్మమని నోటఁబల్కుచు । బ్రహ్మముఁ గనలేనివాడు బ్రాహ్మణుఁ

డగునే॥ ౧౮౦॥ ఆ-వె॥ అనిన వెలుఁగటంచు నందురు కొందఱు। నేమి వస్తువదియు నెట్టులుండుఁ। దెల్పుమంచు వేఁడ దేవకీనందనుం। డాదరమున నిట్టు లనియె సతికి॥ ౧౮౧॥ క॥ వెలుఁగనఁగా బరమాత్ముఁడె। వెలుఁగన ననలార్కచంద్ర వెలుఁగులుగాఁదా। వెలుఁగులకెల్లను మొదలిటి। వెలుఁగే యీవిశ్వమెల్ల వెలిఁగించుఁదగన్॥ ౧౮౨॥ సీ॥ అబ్జభవాదుల కాధారమగువెల్గు ప్రణవరూపంబునై పరఁగువెల్గు। దివిజేంద్రసురలకుఁ దేజమిచ్చిన వెల్గు - పంచభూతములందుఁ బ్రబలువెల్గు। అష్టదిక్పాలుర యందుఁగల్గినవెల్గు - తారచంద్రార్కులఁ దనరువెల్గు॥ పదునాల్గులోకముల్ ప్రబలినిండినవెల్గు - సిద్ధచారణులందుఁ జెలఁగువెల్గు। నిఖిలజీవులయందును నెగడువెల్గు। అఖిలమునకును బరమునై యలరువెల్గు। చెలఁగి యావెల్గు నిట్టని చెప్పుటకును। గమలజునకైన శక్యంబు గానివెల్గు॥ ౧౮౩॥ క॥ వెలుఁగుచు మలుగక యెప్పుడు। వెలుఁగై భువనంబులెల్ల వెలిఁగించుటచే। వెలుఁగనునామము గల్గెను। వెలిలోపలఁ గలిగి వెలుఁగు వెలిగించుటచేఁ॥ ౧౮౪॥ తే-గీ॥ వెలుఁగనంగను దీపంబు విధమునుండు। నంచుఁ గొందఱందురు నావె యజ్ఞులగుచు। నిఖిలమునకును గళలను నిచ్చి తాను। నిష్కళారూపమైయుండు నేమిగాక॥ ౧౮౫॥ క॥ ఎన్నెన్నియాఖ్యలొప్పుచు। నున్నను బరవస్తువునకె యూహింపఁదగున్। గన్నవిపరీతభావము। లెన్నఁడుఁ జేయంగఁదగదు యెవ్వరికైనన్॥ ౧౮౬॥ ఆ-వె॥ మానితముగ శ్రవణ మనననిధిధ్యాస। లను గురూపదేశ మునను బేర్మి। శాస్త్రదృష్టమునను సరవితో నాత్మని। శ్చయమువలన ముక్తి సంభవించు॥ ౧౮౭॥ చ॥ అరయఁ బరాత్మగానకను యాత్రలు తీర్థములెన్ని సల్పినన్। గుఱుతుగ నశ్వమేధములు కోటులొనర్చి యశంబుఁ గాందినన్ ధరగుడిగోపురంబులును దప్పక నూతులు నేర్పరించినన్। నిరతము నెల్లదానములు నిచ్చిన మోక్షము గాంచరాదిలన్॥ ౧౮౯॥ క॥ మనసీయులఁ బోకలకును। జనకుండఁగ జేసినెమ్మి సద్గురుకరుణన్। దనుదనయందునఁగాంచిన। ఘనమతిమంతునకుసాటి గలరే జగతిన్॥ ౧౯౦॥ క॥ తమ కుసుమంబులు మూర్కొనఁ। దమఫలముల ననుభవింపఁ దెదరులెఱుఁగనియా। క్రమమున నాపరమాత్ముఁడు। తమలోననె గల్గియుండి తా మెఱుఁగరొగిన్॥ ౧౯౧॥ ఆ-వె॥ సఖియ తనదునింట సకలపదార్థంబు। లుండ బిచ్చమెత్తు లోభికరణి। వెదుకనేల తమకు వెలుపలలోపలఁ। గలిగియున్న యాత్మఁ గానలేక॥ ౧౯౨॥ క॥ ధరణీపతులకునై

నను । వరయోగులకైన భాగ్య ƒ వంతులకైనన్ । బరమార్థమెఱుఁగు
కంటెను । బరికింపఁగ నెక్కువైన ƒ పదవి యుగలదె॥ ౧౯౪॥ చ॥ చెడును
ధనంబు రాజ్యమును ƒ చిత్రరథంబులు ఘోటకావళుల్ । చెడును గజం
బులొంటెలును ƒ సేనలుకోటలు పట్టణంబులున్ । జెడుదురు తల్లిదం
డ్రులును ƒ స్నేహితదార సుతాదిబంధువుల్ । చెడనిపదార్థమీశ్వరుని ƒ
చింతనయొక్కటి సర్వకాలముల్॥ ౧౯౫॥ ఆ-వె॥ అఖిలమస్థిరంబ ƒ యర
యఁగ జన్మాది । గతుల దుఃఖములకుఁ ƒ గారణంబు। దైవభక్తి శాశ్వ ƒ
తంబునై జన్మాది । బంధసంకటములఁ ƒ బాపు ƒ గాన। ౧౯౬॥ ఉ॥ కూటికి
లేక కష్టములు ƒ కోటికివచ్చినఁ బత్నిపుత్రులున్ । గాటికి నేగినన్ గృహ
ము ƒ గాలిన సర్వము కొల్లబోయినన్ । నేటుగ నెందునన్ దనకు ƒ నెవ్వరు
లేకయు నొంటిమైనఁదా । మాటికి దేహజాడ్యముల। మ్రగ్గిన భక్తిని
నిల్పఁగాఁదగున్॥ ౧౯౭॥ ఆ-వె॥ నిరతమాత్మచింత నెఱవుచు సర్వంబు।
మిథ్యయంచుఁగాంచు ƒ మేటివేత్త। పాయఁగలఁడు మాయ ƒ పాశంబు
లెల్లను । బాముమేన్ గుబుసముఁ ƒ బాయు భంగి॥ క॥ ఫణికే మెఱుకగుఁ
గాకయు । ఫణిపాదము లెఱుఁగరాదు ƒ బ్రహ్మకునట్లే । తనుఁదా నెఱు
గఁగ లేఁడీ । తనువందునఁ దత్త్వవేత్త ƒ దక్కఁగనొరుఁడున్॥ ౧౯౮॥
ఆ-వె॥ ఆత్మ నెఱుఁగువారె ƒ యనుభవజ్ఞులుకాని । యెఱుఁగకున్నఁ
గార ƒ దెవ్వరైనఁ। బ్రసవమైనసతికె ƒ ప్రసవాది విషయంబు । లనుభ
వములు వంధ్య ƒ కనుభవంబె॥ ౧౯౯॥ చ॥ తెలివజలంబు గ్రోలినను ƒ
దీఱునుగాక పిపాసమాఱునే । తలచుగ సర్పిద్రావినను ƒ దాహము
హెచ్చునుగాక యట్టులే । స్థిరపరతత్త్వచింతనము ƒ చేతను దీఱునుగాక
యన్యసంస్మరణల వెంతమిన్నగల ƒ వైనను బాయునె మోక్షతృష్ణయున్॥
౨౦౦॥ ఆ-వె॥ తన్నుఁదా నెఱుఁగఁ ƒ దనవు తాఁగకుండుఁ । దనవుగా
నియపుడేఁ ƒ దలఁపులుడుగుఁ । దలఁపులుడిగినపుడె ƒ తన్మయత్వము
నొందుఁ । దన్మయతనుదాన ƒ దైవమగును॥ ౨౦౧॥ ఆ-వె॥ ఆత్మతత్త్వ
మార్గ ƒ మరయ కెవ్వారికిఁ । జిక్కవిడువదింత ƒ చిత్తశుద్ధి । గాదు జగ
తిఁగోటి ƒ కల్పంబులకునైనఁ । గడువరాదు జన్మకర్మములను॥ ౨౦౨॥
ఉ॥ నావుడుఁగల్గ వాత్మకును ƒ నారయ జాగర నిద్రస్వప్నముల్ । జీవుఁడు
నీయవస్థలను ƒ జెందుచునుండు నహర్నిశంబులు । న్నేవిధమాత్మయందు
నను ƒ నిల్వఁగ నేర్చును జంచలుండునౌ । జీవుఁడు బ్రహ్మమెట్లగును ƒ
జెప్పి కృతార్థతఁజేయు మచ్యుతా॥ క॥ అశరీర విగతకల్పన । విశదాచల
తత్త్వవేత ƒ విద్యాతీతా । శిశుతాదిమస్థితేఃపర । పశుపతిసంస్తుత్యనామ ƒ

పరమలలామా॥ ౨౧౮॥

మాలిని॥ జననమరణహీనా ✱ సాధు హృత్పద్మలీనా । మనన విబుధశీలా ✱ మాయసంహారలోలా । ఘనసదనయనూనా ✱ కాల కల్పాంతమానా । మునిజనహితపాత్రా ✱ మోక్ష లక్ష్మీకళత్రా॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర
నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ
సంవాదంబను - సుజ్ఞానశాస్త్రంబునందుఁ
తృతీయాశ్వాసము - సమాప్తము.



శ్రీసద్గురవేనమః.

# శ్రీకృష్ణ రుక్మిణీ సంవాదంబను
# సుజ్ఞానశాస్త్రము.
## చతుర్థాశ్వాసము.



క॥ నిర్గుణతత్వనిరీహ త్రి । వర్గాది సమస్తదోష ✱ వర్జితభూషా। స్వర్గ సుఖనరకదుఃఖ వి । సర్గామృతవీతమాన ✱ సత్యవిధానా॥ ౧॥ వ॥ అవధరింపు మక్కేశవుం డక్కీరవాణి కిట్లనియె॥ ౨॥ ఉ॥ పావనమైన నీ విమల ✱ ప్రశ్నలకుఁ దగునుత్తరంబులుఁ । భావజవైరి దేవముని ✱ పద్మభవాదులు సెప్పనేర్తురే ✱ నీవును దొంటిజన్మమున ✱ నెట్టితపంబులు సేసి యుంటివో । గావున నిట్టిప్రశ్నములు ✱ గల్గెనునీమది కంబుజాననా॥ ౩॥ ఆ-వె॥ పరఁగ జీవుఁడెట్లు ✱ బ్రహ్మంబయగునని ✱ యడిగితివివృడువిను ✱ మదియుఁదెలియ । నెఱిఁగినట్టివారి ✱ కిది మహాసులభంబ । యెఱుఁగకున్నఁగష్ట ✱ మెవరికైన॥ ౪॥ క॥ జీవుండెట్టియవస్థల । నేవిధముననైన బ్రహ్మ ✱ మేమరక తగఁ । జీవభ్రాంతులనుడిగిన । జీవన్ముక్తుండునగును ✱ జీవుఁడు తరుణీ॥ ౫॥ ఆ-వె॥ నీరుపాలునందు ✱ నిజముగాఁజేర్చిన । క్షీరమగునుగాని ✱ నీరుగాదు । అట్టులాత్మయందు ✱ నాజీవిఁజేర్చిన । నాత్మ దగును జీవుఁ ✱ డరసిచూడ॥ ౬॥ క॥ క్షీరములఁ గలయు నీరే । క్షీరములగు నీటఁగలపక్షీరములగునే । తారక మొందిన జీవుఁడె । తారకమగు మాయఁగలియఁ ✱ దారకమానే॥ ౭॥ ఆ-వె॥ బ్రహ్మమందుజీవ ✱ భావం

బుఁగూర్చిన । బ్రహ్మమగును జీవ ॱ పదము లేక । యగ్నియందుఁగాష్ఠ ॱ మమరంగఁగూర్చిన । దారు లేక వెల్గు ॱ దహనుమాడ్కి॥౧౦॥ క॥ ప్రవిమల తారకమందున । సవినయముగ మౌన సంబు ॱ సంధించినచోఁ । బ్రవి నాశమొందు నామది । లవణము జలమందుఁ జేరి ॱ లయమొందుగతిన్॥ ౧౧॥ తే-గీ॥ వివిధ పుష్పంబులంటి జీ ॱ వించు నళియుఁ । జంపక ప్రసవ ముఁదాఁకి ॱ చచ్చినట్టు । లఖిల వృత్తులఁజరియించుॱనట్టిమనము । నాశ మొందును బ్రహ్మంబు ॱ నంటినపుడె॥ ౧౨॥ క॥ వరసూన్యతాత్ముఁడై నను । మఱి శాంతుండైన నీతి మూర్ఖుండైనన్ । బరతత్వసంగిగాకయె । సరగున విడదింద్రియముల ॱ చలనంబెపుడున్ ॥ ౧౩॥ ఆ-వె॥ హరినిఁ గన్నయపుడె ॱ యఖిలమృగంబులు । పొదలనడఁగి కదలిॱమెదలనట్లు । తారకంబునెపుడు ॱ దర్శించునప్పుడే । యడఁగియుండు నింద్రియములు మనము॥ ౧౪॥ క॥ సరసీ జాప్తుఁడు గ్రుంకెడు । తఱి నూరకయుండు విహగతతిగతిమనమున్ ॱ బరమాత్మయందు గ్రుంకినఁ । గరమరుదుగ నింద్రియములు ॱ గదలకయుండున్॥ ౧౫॥ ఆ-వె॥ వరుసఁదనకురాజు ॱ వశుఁడై నసుర్వినే । జనులు తన్ను నొంపఁ ॱ జాలనట్లు । నాత్మ తనకు వశము ॱ నైయున్న నింద్రియ । చలనమేమిసేయఁ ॱ జాలుఁదన్ను॥౧౬॥ క॥ నిరతంబు జీవుఁ డిరవుఁగ । బరమాత్మను గలసిమెలసి ॱ పామరతను వున్ । మఱచినఁదానే తానగు। మఱియదె జీవేశ్వరైక్య ॱ మనఁగఁజె లంగున్॥ ౧౭॥ తే-గీ॥ అట్టి జీవేశ్వరైకంబె ॱ యరసిచూడ । మానితం బగు మౌన స ॱ మాధియనియు మంత్రగోప్యంబునదె తిరు ॱ మంత్ర మనియు । నెంచుచుందురు బుధజను ॱ లంచితముగ॥ ౧౮॥ చ॥ పరిపరి వేదశాస్త్రములు ॱ భ్రాంతికి మూలమటంచు రోసియున్ ।దురితపుఁ గర్మ మార్గములు ॱ దుఃఖకరంబులటంచు నెంచియున్ । బరువడి హంసమం త్రమున ॱ భావముగూర్చిన పావనుండగున్ । బరుసముసోఁకి లోహము ను ॱ బట్టుగఁగాంచనమైన యట్లుగన్॥ సీ॥ గుళ్లుగోపురమాది ॱ కూపత టాకముల్ ॱ బహుసత్రవనములే ॱ ర్పఱుచువారు । నఖిలదానంబులుॱ నాచరించెడువారు । చెలఁగి సుఖంబులఁ ॱ జేయువారు।సత్యవ్రతంబుచేॱ జగతి భాసిలువారు - తీర్థయాత్రలకెల్లఁ ॱ దిరుగువారు ॱ నష్టాంగ యోగంబు ॱ లభ్యసించెడువారు పంచముద్రలలోనఁ ॱ గాంచువారు । సకలవేదాదిశాస్త్రముల్ ॱ చదువువారు । స్నానసంధ్యాధి తపములు ॱ సల్పువారు । నజపసూత్రంబుఁజెందిన ॱ యట్టిఘనుల । పాదరజమును బోలరు ॱ పద్మగంధి॥ ౧౯॥ క॥ రేచక పూరక కుంభక । సూచన లేన

ట్టివారు ᐟ చూతురుమాయే । సూచనగల్గినవారలు । చూచెడునాచూ
పులోనె ᐟ చూచెడరాత్మన్॥ ౧౯॥ ఆ-వె॥ చూపులెల్లఁజూచి ᐟ చూపు
లోభ్రమఁజెందుఁ।జూపులెల్లభ్రమను ᐟ జొరగఁజేయుఁ । జూపునేకమైనᐟ
సూక్ష్మంబు గనుపించు।సూక్ష్మమందుఁజేరᐟజూపునిల్చు॥౨౦॥క॥చూపును
రూపునుగుణముల । వ్యాపారముచేతఁ గల్గెᐟవర్ణింపగన్ ।జూపునురూపున
కవ్వల । నాపోజ్యోతియన వెలుఁగు ᐟ నదితారకమా॥ ౨౧॥ తే-గీ॥ సతి
యకారం బనఁగ రజᐟస్సదియె బ్రహ్మ । యగు నుకారంబనఁగఁసత్త్వᐟ
మదియె విష్ణు । వగు మకారంబనఁగఁ దమం ᐟ బదిశివుండు దలఁపనిం
దెద్ది యనుగాదు ᐟ తారకంబు॥ ౨౨॥ క॥ బిసరుహాలోచన వినుమిఁకఁ।
బసమీఁఅఁగఁ దత్పదంబె ᐟ పరమాత్మ యగున్ । బొసఁగును జీవుఁడు
త్వంపద । మసిపదమన వీనిరెంటిᐟకైక్యంబరయన్॥ ౨౩॥ క॥ క్షరమన
జీవుండగు న । క్షరమనఁ బరమాత్మ యగును । సతియట్టి క్షరా।క్షర
ములుగూడిన నదియే । పరమార్థమనంగఁ బరఁగు ᐟ బంకజనయనా॥
౨౪॥ ఆ-వె॥ నాదమంచుఁబల్కు ᐟ నదియె యోంకారంబు। బిందువనఁగ
జీవుఁ ᐟ డిందువదన । నాదుబిందు రెండు ᐟ నమరంగఁగూడినఁ । గళయ
నంగనొప్పుఁ ᐟ గమలగంధి॥ ౨౫॥ క॥ సత్తనఁగా బరమాత్ముఁడు। చిత్త
నఁగా దెలియవలయు ᐟ జీవుండనుచున్ । సత్తును జిత్తును రెండును ।
హత్తుగ నేకీభవింప ᐟ నానందమగున్॥ ౨౬॥ ఆ-వె॥ వ్యక్తమనఁగ
నాత్మ ᐟ వరుస నవ్యక్తము జీవుఁడనఁగ నెగడు ᐟ సిద్ధము గను । నాత్మ
యనిన విద్య ᐟ యగు నవిద్యను జీవుఁ। డంచుఁ గాంచవలయు ᐟ నంచి
తముగ॥ ౨౭॥ క॥ గిరినింగోత్రము నగమను । కరణిని భాండమునుగలశᐟ
ఘటమనునట్లే । పరమాత్మ జీవులకు న । త్రైఅఁగునఁ బరినామములనుᐟ
దెలియు మొకటిగన్॥ ౨౮॥ క॥ అనవుడు నన్యము లేకయుఁ।దనుఁదానై
నిండియుండఁ ᐟ దగ బరమాత్మ । డనియును జీవుండనియును । నను
శేమికతంబాయనిన ᐟ హరి యిట్లనియెన్॥ ౨౯॥ ఆ-వె॥ ఆత్మయందు
జీవుఁ ᐟ డారోపితంబగు । నెన్ననిజము జీవుఁ ᐟ డెందుఁగలుగు । నరయ
రజ్జువందు ᐟ నారోపి తంబగు ᐟ పాముభ్రాంతి నిల్వఁ ᐟ బడునెచూడ॥
౩౦॥ క॥ తనుఁ దాను గాంచినప్పుడె । మనుజీవ వికారభావ ᐟ ములు
సర్వంబున్ । దనలోలేక నశించును । గనుఁగొన జీవుండుమగుడఁ ᐟ
గల్గునె తలఁపన్॥ ౩౧॥ క॥ తనమోము ముకురమందునఁ । గనుఁగొన
వేఱొక్కరూపు ᐟ గాఁదోఁచుగతిన్ । దనువను నద్దములోపలఁ । గను
పడు పరమాత్మెరెండు ᐟ గతులగునట్లుల్॥ ౩౨॥ ఆ-వె॥ దర్పణంబు

దీయఁ ఽ దనప్రతిబింబంబు । పోయి వదనమందె ఽ పొందినట్లు । తనువు
దొలఁగిచూడఁ ఽ దత్ప్రతిబింబంబు । లేకయుండు నాత్మ ఽ నేకమగుచు॥
౩౩॥ సీ॥ దర్పణమందునఁ ఽ దనమోముబింబింప-మోము తాననిజూచి ఽ
ముదముఁజెందు । నాననంబువిధము ఽ నద్దంబులోఁ దోఁచు - మోము
నిక్కంబైన ఽ మోముఁ గనునె । కనులద్దమునుజూచుఁ ఽ గాని యాయ
ద్దంబు - కనులనుజూచుట ఽ గలదెయెందు । నిలదర్పణము లేక ఽ నేత్ర
యుగమె నిల - సుఖచరాననమును ఽ జూడఁగలదె। యక్షియుగముచేఁ
దనమోము ఽ నరయుటకును । వద్ద మొకసాధనంబునై ఽ యమరుచుండు
గతినిఁ బరమాత్మ-తన్నుఁదాఁ ఽ గాంచుటకును । జీవుఁడొకసాధనంబునై
చెలఁగుచుండు॥ ౩౪॥ క॥ మనమే పరమాత్మనుగను । ననినను మనమె
ట్లుగాంచు ఽ నదిజడమరయన్ । దనుఁదానె మనమునెడు సా! ధనమునఁ
బరమాత్మయె తనుఁ ఽ దాఁగాంచునొగిన్॥ ౩౫॥ క॥ తరుణీ ఘటమే దే
హము । తిరముగనందుండుజలమే ఽ తెల్వితలంపన్ । బరమాత్మకుఁ బ్రతి
బింబమె । పరికింపఁగ జీవుఁడగును ఽ బాలేందుముఖీ॥ ౩౬॥ క॥ క్షితిజల
ఘటమున రవికిని । బ్రతిబింబంబున్న యట్లు ఽ భాసిలుచుండున్ । సతియా
ఘటము దొలంగినఁ । బ్రతిబింబం బేదియింక ఽ భానుఁడెగాకన్॥ ౩౭॥
తే-గీ॥ జ్ఞప్తికాయంబులనుజల ఽ కలశములను । బ్రతిఫలించెను బర
మాత్మ ఽ భానుపగిదిఁ । దెలివి దేహంబులనుమాయఁ । దీసిచూడఁ ।
దనకుఁ బ్రతిబింబ మున్నదే ఽ తానుగాక॥ ౩౮॥ క॥ గురు తెలుఁగ లేక
రజ్జును । బారిబారిఫణి యంచుభీతిఁ ఽ బొందినయట్లే। పరమాత్మయంచుఁ
దెలియక । మఱిజీవభ్రాంతిఁబొందె మానవుఁడకటా॥ ౩౯॥ క॥ ఇదివట్టి
త్రాడటంచును । బదపడిఁ గనుఁగొన్నవాఁడు ఽ పాముని యనునే । యిది
పరమాత్మయటంచును । మదిఁదెలిసిన జీవుఁడన్న ఽ మాటవెడలునే॥ ౪౦॥
ఆ-వె॥ ఆత్మయందు జీవుఁ ఽ డను భ్రాంతిఁ బొందియుఁ । దిరిగిదాని నిజ
ముఁ ఽ దెలసెనేని । యాత్మయంచు నిశ్చ ఽ యంబగునాతండు । జీవుఁడంచు
భ్రాంతిఁ జెందఁడెపుడు॥ ౪౧॥ చ॥ ఇనుఁడు నభంబునుండునని ఽ యేడె
నిక్క మెఱింగి భ్రాంతిచేఁ । గనఁడిఁకఁదోయకుంభమునఁ ఽ గన్పడుబింబ
మెసత్యమట్లుగా । ఘన పరమాత్మ తత్వమును ఽ గాంచినపిమ్మట బ్రహ్మ
వేత్తలున్ । దనువున జీవబింబమును ఽ దథ్యమటంచుఁ దలంచరెప్పుడున్ ఽ
౪౨॥ క॥ పరమాత్ముఁడె నిజబింబము । పరమాత్ముని యందుఁదోఁచు ఽ
ప్రతిబింబంబు । న్నరయఁగ జీవుఁడె దబ్బర । పరమాత్మనుగనిన జీవ ఽ భావ
మువాయున్॥ ౪౩॥ ఆ-వె॥ మున్ను రజ్జుగాంచి ఽ పన్నగంబనుభీతిఁ । జెంది

పిదప దానిఁ ర జేరిజూచి। త్రాఁడటంచుఁ జేత ర ధరియించు వానికిఁ। బాము గఁజచునందు ర భయముగలదె॥ ౨౪॥ ఉ॥ నాకుఁ బరంబుగా నెగడునట్టి విధంబు వచించు తత్వముఙ్ । నాకును వేఱుగాదనుచు ర నారయ నేనెద లంచిచూడఁగా । నీకనుపించు దేహమిది ర యిల్లనిజంబగు నాత్మయేన యే లోకసమస్తజీవతతి ర లోనఁబరాత్ముఁడనై వెలుంగుదుఙ్॥౨౫॥ క॥ ననునెఱుఁగక యజ్ఞానులు । తనుగుణములు నన్నుఁగాఁగ ర దలఁతురు ధరలో । నను నిశ్చయముగ నెఱిఁగినఁ । దనుగుణమును నేనుగాను ర దక్షంబబలా॥ ౨౬॥ చ॥ సరగున నొక్క సద్గృహిణి ర చాలక యేలెను నష్టభార్యలఙ్ । దిరముగ నష్టభార్యలతో ర తృప్తినిఁబొందక కామవారి ధిఙ్ । జొరఁబడి గోపికాసతుల ర షోడశవేలను గూడెనంచునఙ్ । బరిప రిరీతులిట్లుగను ర బల్కుదురల్పులు నంబుజాననా॥ ౨౭॥ క॥ గురుకరుణ వడసినప్పుడె । గుఱుతుగ దేహాదిజీవ ర గుణముల నెల్లఙ్ । దొఱఁగితి సర్వముగానని । పరమాత్ముఁడనైతి నాకు ర భ్రాంతియుఁగలదే॥౨౮॥ సీ॥ స్త్రీలోలుఁడని నన్నుఁ ర జెనఁటులనుటగాని-యెవ్వరు నాజాడ ర నెఱుఁగలేరు । దేహమే లేని వి ర దేహినైయుండంగ - నింద్రియంబులు నాకు ర నెట్లుగల్గు । గామాదికంబులు ర గణుతింపఁగా నేవి । కలనిద్రజాగరం ర బులును నేవి । సుఖదుఃఖములు నేవి ర క్షుత్పిపాసలు నేవి । స్త్రీపుంసరూపాది ర స్థితులు నేవి । త్రిగుణరహితుండనగుచును ర దినము రాత్రి।నితర సంకల్పములులేక ర యేకరీతి । సోహమను పల్కుఁ బల్కుచు ర సుస్థిరముగ।నుందు నేనెట్లు సతులను ర బొందినాఁడ॥ ౨౯॥ క॥ అంగంబు గలుగువానికె । సంగమ క్రియలాది ధరణి ర సంభవమాఁగా । కంగంబె లేని వానికి । నంగనలను గవయుటెట్లు ర లమరును నాకుఙ్॥ ౩౦॥ క॥ తరుణులఁగూడితినందురు । పురుషులు మొదలైన సకల ర భూతగణంబుల్। మఱిఁగూడి మెలఁగుచుండిన । పరుఁడగు నన్నెఱుఁగలేని ర పామరులెల్లఙ్॥ ఆ-వె॥ కులములేనివాఁడ ర గుణములే దొకచోట । నునికిలేదయెందు ర నొంటివాఁడఁ। జుట్టమొకరు లేరు ర శూన్యుండఁదుద మొదల్। లేనివాఁడఁ గాంత ర లెవరు నాకు॥ ౩౨॥ క॥ సతిపతులుగూడునది యొక।మిత మేసకలంబు నేర ర మించుచునుండఙ్ । రతియనఁగ నొక్క శాస్త్రము।సతియేన స్ఖలిత బ్రహ్మ ర చారిని నగుదుఙ్॥ ౩౩॥ క॥ తలఁపగమాత్రపురీషం । బులువిడిచినకరణి సతుల ర భోగక్రియలం।దలరగ శుక్లమువడలినఁ।గలుగునె యఁద్దానబంధ ర కము వేత్తలకుఙ్॥ ౩౪॥ ఆ-వె॥ ఒక్కచోటనైన నాకుర నొక్కదేశంబైనా । నొక్కకాలమగునె ర యుండుటకును । నిలను నాకు

ను నెల ॥ విడియనవచ్చునే । నిండియుండు నెందు గ నేనుగాదె॥ ౫౫॥ క॥ నేనే భూతములై దుని । నేనే మూ ర్తిత్రయంబు గ నిఖిలజగంబుల్ । నేన నరసిద్ధ దైత్యులు । నేనే దిక్పాలసురలు । నినశశితారల్ గ ౫౬॥ క॥ గరు డోరగ కిన్నర కిం । పురుషాసుర సాధ్యయక్ష గ భోగులువిద్యా।ధరగం ధర్వులునాదిగ । నిరవుగ నేనౌదు నీవు గ నేనేతలంపఁగ॥ ౫౭॥ తే-గీ॥ నిర్జరేంద్రుఁడు మునులును గ నీరధులును । బర్వతారణ్య మృగపశు గ పక్షితరులు । నండపిండాండబ్రహ్మాండ గ మాదియగుచు । నిఖిలమైయేను వెలుఁగుదు గ నీరజాక్షి॥ ౫౮॥ క॥ నేనే స్త్రీపురుషులునై । గానఁబడఁగ నన్ను నేనుగ గవయుటయెట్లో । నేనయొనర్పక దోఁచిన । యానిఖిలము బొంకు స్వప్న గమం దనుభవమె॥ ౫౯॥ తే-గీ॥ పడఁతివిను పుష్పముల సౌరభంబుభాతి । సర్వరూపుల నేనుండ గ సర్వమగుచుఁ । గుసుమము నుగాక పరిమళం గ బొసఁగునట్లు । సర్వమునుగాక యింతకే గ సాక్షిన గుదు॥ ౬౦॥ సీ॥ నావుడు వసుదేవు గ నకు దేవకికి నీవు జనియించివు ట్టలే గ దనుట యెట్లు । దారాసుతాదులు గ తల్లిదండ్రులుగల్గి - నాకు నెవ్వరులేర గ నంగనెట్లు । ద్వారకాపురి కధి గ కారినై యొకచోట గ నునికి నాకును లేదు గ యనుట యెట్లు గ సతులతోఁ గవియుచు సకలకా ర్యంబులఁ - జేసిచేయనటంచుఁ గ జెప్పనెట్టు॥ తే-గీ॥ లయ్యయో మేను ప్రత్యక్ష గ మగుచునుండ । నాకు దేహంబె లేదని గ నాఁగనెట్లు। దెలియ నిది నాకుగొప్ప సంగ దేహమెదను । బెనయుచున్నది దీర్పవే-వనజనాథ॥ ౬౧॥ సీ॥ అని రుక్మిణిఁజూచి గ యచ్యుతుఁ డిట్లను - చెలియ నీకది మున్నె - చెప్పినాఁడఁ । గనుపించుచున్న యీ గ కాయంబు నేఁగాను - దేహనాటకుఁడ వి గ దేహినంచు । వసుదేవుఁడును మాయ గ వనిత దేవ కిమాయ - వారి కేబుట్టిన గ వార్తమాయ । బలరామసాత్యకుల్ గ పరి కింపఁగామాయ - యష్టభార్యలు గోపి గ కాళిమాయ॥ తే-గీ॥ యేది పుట్టుచున్నదో గ యేదిగిట్టు । నదియెపో మాయనే నెప్పగ డదియుఁగాను। బుట్టుకయు లేదు నాకును గ గిట్టులేదు । పావనంబగు తారక బ్రహ్మ మేను॥ ౬౨॥ క॥ తనువులుగల్గని నాకును । జననీజనకులును సుతులు సతులెక్కడనో । గనుఁగొనఁ బరిపూర్ణుఁడు నా । కును నెలవును నెందు గలుగుఁ గ గోమలిచూడఁగ॥ ౬౩॥ ఆ-వె॥ ఏనుబుట్టుటయును గనింపొంద ద్వారకా । పురమునుంట సతులఁ గ బొందుటయును । సకలకార్యము లును గ నల్పుటకలగాని । నిజముగాదొకటియు గ నేనెఱుంగ॥ ౬౪॥ ఉ॥ ఏనుదశావతారముల గ నెత్తితినంచుఁ దలంచుమానవుల్ । గానరు నన్ను

నెంతయును ॱ గల్పితమైన మదీయమాయనే । గాని వధింపదుష్టులను ॱ గావఁగ శిష్టులమాయఁబుట్టునే । గాని దలంప నాకెపుడుఁ ॱ గల్గదు జన్మము కర్మనాశము॥ ౬౫॥ ఆ—వె॥ నిఖిలభూతసమితి ॱ నేరమించుటఁ జేసి । నాకు రామ యనెడు ॱ నామములరెఁ । గాక దశరథునకుఁ ॱ గల్గు వాఁడనె నిరా । కారుఁడగుదు నేను ॱ గలుగుదెపుడు॥ ౬౬॥ క॥ పన్నగ నాదశరథునకు । మున్నును నేలేక యతని ॱ పుత్రుఁడెకర్త । యున్న దశరథుని విశ్వముఁ గ్రన్ననఁ గల్పించునట్టికర్తయెపండో॥ ౬౭॥ ఆ—వె॥ పొలఁతి దశరథునకుఁ ॱ బుట్టిన రాముఁడే । కారణంబటన్నఁ ॱ గల్గుఁ దప్పు । గాన నేను నంతకంటె మున్నెయుండి । గలుగఁజేసినాఁడగాదె జగము॥ ౬౮॥ క॥ పరమాత్ముఁడ నాయందున । నరయంగా నేదు దోష ॱ మఖిలంబు మనః । పరికల్పితమగునదియే । పరికింపఁగ లేనిమాయ ॱ భామామణిరో॥ ౬౯॥ క॥ సకలంబు నేనెయగుచును । సకలంబునుగాక సర్వ ॱ సాక్షినగుదు నాకొకచోటనుండఁగల్గునె । వికలంబది సర్వమయుఁడ ॱ వీక్షింపఁగనే॥ ౭౦॥ సీ॥ అతలమానరికాళ్ళ ॱ వితలంబుమీఁగాళ్ళు – సుతలంబుమడిమలో ॱ సుందరాంగి । దలఁపఁబిక్కలుతలా ॱ తలముజానులురసా–తల మూరువులుమహాతలము నరయ । జొకపాతాళ భూలోకముల్ గుదము నె–క్కొనభువర్లోకంబుగుహ్యపదము । పొసఁగును వర్లోకముము నాభియగు మహ–ర్లోకంబు హృదయంబులోలనేత్ర॥ తే—గీ॥ సరిజనర్లోకముగళంబుసత్యముగను । మఱి తపోలోకమెన్నభ్రూమధ్యమందు । సత్యలోకంబుపాలఁబు ॱ సద్వరాట్పు । రుషుఁడనైనట్టినాకునో ॱ రుక్మగాత్రి॥ ౭౧॥ సీ॥ నాసాగ్రమున నింద్ర ॱ నగరంబు దక్షిణ ॱ నేత్రమందున నగ్ని ॱ హోత్రపురము । కుడికర్ణమున నంత ॱ కునిపట్టణంబును – నెసఁగునాప్రక్కనై ॱ ర్ఋతిపురంబుఁ । దెలియ వెన్నవరుణ ॱ దేవునినగరంబు – వరుసదానికిఁబ్రక్కవాయుపురము । నుత్తరకర్ణంబు ॱ నొప్పుకుబేరుని ॱ పురి వామనేత్రంబు ॱ భోగిపురము॥ తే—గీ॥ శిరమునదుమను వైకుంఠ ॱ పురమునుండు । నరయఁగా మేరుగిరినాకు ॱ నగుసుషుమ్న । మందరాద్రియుఁ బింగళ ॱ మిడదలంప । నిడయుఁగైలాసనగమగు ॱ నిందువదన॥ ౭౨॥ సీ॥ మస్తకాంతర్గతంబగును జంబూద్వీప – మరయఁబ్లక్షద్వీప ॱ మస్థులందు । మెఁనయుశాఖద్వీప ॱ ముసు శిరాగ్రంబున ॱ శాల్మలీద్వీపంబు ॱ చర్మమునను । బుష్కరద్వీపంబుపోల్ప నంఖుల ॱ మఱి కుశద్వీపంబు ॱ మాంసమందుఁ । బొసఁగఁ గ్రౌంచద్వీప ॱ ముసు కేశములయందు – లవణాంబుధియు మూత్ర ॱ మవును

నిక్షు । నీరధియు షర్కసురవార్ధి నింద్రియంబు । దలఁపఘృతవార్ధిరుధిరంబు దధిసముద్ర । మరయశ్లేష్మంబయగును క్షీ రాబ్ధిసాఖ్య । నిర్మలోదకోదధియుఁగగస్నిరునాకు॥ క॥ ధరణియుఁబాదములగుచును । మఱియంబరతలమునెన్న మస్తకమగుచున్ । గిరులును శల్యములు నదులు । పరికింపఁగ నాతులగుచు భాసిలునాకున్॥ ౧౪॥ తే-గీ॥ ఇన శశాంకులు నాకు న యనయుగంబు । పవనమును శ్వాసనిశ్వాస లవుచు వెలుఁగు । నాదుగర్భంబులోపల నఖిలజీవ । పుంజములుపుట్టులయమొందుఁ బొలఁతియనిన॥ ౧౫॥ క॥ నీలోనజగము లెప్పుడు నీలో నేయుండఁగలవొ లెఱిగింపుమింకే । కాలమునకై నఁజెడునో । యేలాగదియున్న శౌరి యిట్లనుసతికిన్॥ ౧౬॥ ఆ-వె॥ సుందరాంగినీదు సూక్ష్మబుద్ధికినాదు । మానసంబుహర్ష మయ్యెనిపుడు । లాలితముగ వినుము కాలప్రమాణంబుఁ । దెలియపఱతునీకుఁ దేఁటపడఁగ॥ ౧౭॥ క॥చనఁగ

కాలప్రమాణ లక్షణము.

నహోరాత్రంబులు దినమగు । మర్త్యులకునదియె దివసలయంబా । దినములు ముప్పదిమాసం । బనఁబడునదె శుక్ల కృష్ణ పక్షద్వయమున్॥ ౧౮॥ సీ॥ మానవాళికినొక్క మాసమైనను బిత్రు దేవతాళికి నొక్క దినమునగును ॥ వసుధమనుజులకొక్క । వత్సరంబైనను దివిజులకది యొక్క దివసమగును । తత్క్రమంబున దేవ తాహాయనంబులు - వెలయుఁగఁ దదిరెండు వేలునైనఁ । దనరఁగృతత్రేత ద్వాపరికలి చతు । ర్యుగములువిను మహా యుగమనంగ॥ తే-గీ॥ నొప్పనవియును డెబ్బది యొక్కటైన । రమణియది యొక్కమన్వంత రంబునగును। నట్టిమన్వంత్రములు పదునాలుగైన । బ్రహ్మకది యొక్కపగలునై పరఁగుచుండు॥ ౧౯॥ సీ॥ తగనొప్పనది చతు ర్యుగసహస్రము మేర-నగు దివసా వసా నంబునందు । బ్రహ్మయు నిద్రిఁచుబగటికాలంబెంత-యంతకాలము రాత్రి యరుగునపుడు । సకలజీవాదులు సమయునం తటఁ బంచ భూతముల్మాత్రము పొలియకుండు । నారాత్రిగడిచిన నలువ తామేల్కొని జీవకోటులమగుడి సృష్టిసేయు॥ తే-గీ॥ ధాతకది యొక్కదినమగుఁ దలఁచిచూడ । నట్టిదినమాసక్రమమున నరయ నూఱు । వత్సరంబులు గడచిన వనజగర్భుఁడంత నాకంబుఁజెఁదునో యంబుజాక్షి। ౨౦॥ సీ॥ చెలువుగా వినుబ్రహ్మ జీవితకాలంబు - మఱి విష్ణువునకొక్క మాసమగును । నవి పదిరెండైన నగువత్సరంబును-నవియు శతంబైన హరియడంగుఁ । బరికింపనావిష్ణు ప్రళయంబులో

పల ℐ నజు లనేకులుపుట్టి ℐ యడఁగిపోదు । రా విష్ణుజీవిత ℐ మగుకాల
మును రుద్రు-నకు నొక్క దినమగు ℐ నట్టిదివస॥ ఆ—వె॥ మాస సరణి
తోడ ℐ మతిశతాబ్దంబులు । నిండె నేనిశివుఁడు ℐ నీల్గునతని । ప్రళయము
నకులోన ℐ బహుమందివిష్ణులు । పుట్టిగిట్టుదురుగ ℐ పుణ్యచరిత॥ ౮౧॥
సీ॥ అరయంగ రుద్రుని ℐ యాయుష్యమంతయు – నొగమహేశ్వరునకు ℐ
నొక్కయామ । మట్టిజాములెనిమి ℐ దైన దినంబొక్కటగునది మాస
క్రమాదికముల । వత్సరంబులు నూఱు ℐ వరుసగాఁ గడచిన-నమ్మహే
శ్వరుఁడును ℐ నాశమొందు । నవని ప్రళయములోన ℐ నంబహురు
ద్రులు – వొడమినశింతురు ℐ పుడమియందు॥ తే—గీ॥ నమ్మహేశ్వరుఁడు
మనిన ℐ యంతకాల । గతి సదాశివునకు రెండు ℐ గడియలగును।నదియె
యొక్కముహూర్తం బ ℐ నంగబరఁగు । ననియు ముప్పదియైనను ℐ
నగుదినంబు" ౮౨॥ సీ॥ కలయనా దినమాస । క్రమమున నూఱేండ్లు ℐ
చెల్లిన నాసదాశివుఁడుగిట్టు । నతని ప్రళయములో ℐ నరయ ననేక
మ – హేశ్వరుల్ పుట్టి ℐ లయింతురెలమి । నాసదాశివుఁడుండు ℐ
నట్టికాలంబెల్ల ℐ నొగి విరాట్పురుషున ℐ కొక్కక్షణము । నగునట్టి
క్షణములు ℐ నరయంగ మున్నూట – యఱువదైనను నొక్క ℐ హోయ
నమగును। తే—గీ॥ నట్టి దిన మాస క్రమమున ℐ హాయనములు । నూఱు
గడచిన నవ్విరా ℐ ట్పురుషుండు । చనును నాతనిజీవితℐమునకులోనఁ ℐ
బుట్టి బహుసదాశివులును ℐ గిట్టఁగలరు॥ ౮౩॥ చ॥ మెలఁతసమస్త
జీవులను ℐ మృత్యువుపుట్టి వధించునప్పుడే । జలజహితాది చంద్రులును ℐ
సంక్షయమొదురు మాయశక్తిచేఁ । బొలుపుగ గోత్రబీజములు ℐ భూజ
లతాది సమస్తరూపముల్ । ప్రళయదవాగ్నిఁబుట్టి యటు ℐ భస్మముఁ
జేయునొకింత మాత్రలో॥ ౮౪॥ తే—గీ॥ సప్తవాయువులొకపెట్టఁ ℐ
జవిరివిసరు । నభ్రనవకంబు నోలి ది ℐ వ్యాబ్ధశతము । ఘోరవర్షంబు
జడిపట్టి ℐ కురియునపల । వారిధులునేడు నేకార్ణ ℐ వంబయగును॥ ౮౫॥
వ॥ అట్టియెడ॥ సీ॥ అమ్మహావారాశి ℐ యడఁగఁ బృథ్వియదిక – జల
ములస్వల్పలో ℐ ష్టంబు పగిది । నమ్మహోదకమును ℐ నగ్నిపానము
సేయుఁ – దప్తలోహము నిరు ℐ ద్రావుభంగి । నమ్మహావహ్నిని ℐ నని
లంబు దెగటార్చు ℐ గాలిదీపంబార్చుℐకరణిగాను । నమ్మహావాయువుℐ
నాకాశమునమ్రగ్గు – నాసుషుప్తిని జీవు ℐ లడఁగునట్లు॥ తే—గీ॥ లమ్మ
హానింగినమ్మాయ ℐ యుండ డిందు । నమ్మహామాయ నాయందు ℐ నడఁ
గునపుడు । బట్టబయలగు నా స్వరూ ℐ పంబునిలిచి । యుండునెమ్మెడఁ

బరికింప ✤ నొందులేక॥ ౮౬॥ ఆ-వె॥ అఖిలమూర్తివర్గ ✤ మడఁగిన నేనుండు నిర్మలుండ నగుచు ✤ నేనువిట్టి । ప్రళయ కల్పములును ✤ బహుళంబులైనను । నేనుజెడనుభామి ✤ నిలలామ॥౮౭॥ క॥ మాయే జగములు యుగములు । మాయేకల్పములు ప్రళయ ✤ మాటలునెల్లన్ । మాయాతీతుఁడ నేనే । మాయల నెఱుఁగకయ యుందు ✤ మదగజగమనా॥౮౮॥ క॥ పాయక మృత్తికకుంభము । గానొనరుచు మంటియందుఁ ✤ గలియుని యట్లే । నాయందు మాయపుట్టియు । నాయందునఁగలియకుండు ✤ నంబుజవదనా! ౮౯॥ ఆ-వె॥ మఱలవిశ్వసృష్టి ✤ మఱి యెటులగునన్న । నిద్ర నుండిమేల్కొ ✤ నేగుదెంచు । కొలఁదినేనెఱుంగ ✤ కుండంగ నాయందె। గలిగిమాయజగము ✤ గలుగఁజేయు॥౯౦॥ ఉ॥ స్థావర జంగమ ప్రకర ✤ సంభవనాశములందు నొందు నేఁ । గావున మూఢులెవ్వరును ✤ గానఁగఁజాలరు మత్స్వరూపమున్ । భావనమూర్తులున్ విమల ✤ భావవిచారులు జన్మభారముల్ । మోవఁగలేకనన్గని ము ✤ ముక్షుపదంబునుగందురెంతయున్॥ క॥ నేనీ దేహేంద్రియములు । గానని సుజ్ఞానమునను ✤ గాంచెదరార్యుల్ । మానిని దేహేంద్రియములె । నేనని జ్ఞానంబు లేమి ✤ నెంతురుమూఢుల్!౯౧॥ సీ॥ నీరుచలించిన ✤ నీటిలోఁ బ్రతిబింబ - మైననింగియుఁ గదలు ✤ మాడ్కిఁదోచుఁ । బరఁగ నదిని నోడ ✤ పరుగిడనదిపొంతఁ - జెట్లు గదలుచున్న ✤ యట్లుదోఁచుఁ । బరువడిమేఘంబు ✤ పరువెత్తనభమునఁ - జంద్రుండుపరువెత్తు ✤ చాడ్పుదోఁచు । నట్లుపుట్టుట పెర్గు ✤ టఖిల కార్యంబులు - నాచరించుట మఱి - నాశమాట॥ తే-గీ॥ లాదికల్పనలెల్ల దే ✤ హంబునొందఁ । నాత్మయే సర్వమునుబొందు ✤ నట్లుదోఁచుఁ । గాని పరికించిచూడఁగఁ ✤ గానఁబడదు । రమణియాత్మకు నేవికా ✤ రంబునెపుడు! ౯౩॥ ఆ-వె॥ చూపుచెదరినపుడు ✤ చూడవస్తువొకటె । రెండుగాఁదోఁచు ✤ చుండునట్లు । మానసంబు చలన ✤ మైనవానికిలేని కల్పనమ్ములనిజము । గానుదోఁచు॥ ౯౪॥ సీ॥ అల్లిబిల్లిగఁదిర్గు ✤ నట్టివానికినిండ్లు - దిశలు భూమియుఁ జెట్లు ✤ దిరిగినట్లు । గనుపించునటు దిరు ✤ గనివారికెద్దియుఁ - దిరుగకున్నట్లుగాఁ ✤ దెలియుభంగి। నజ్ఞాని చంచలం ✤ బగు మానసముగల - వాఁడు గావున భ్రాంతి ✤ వలనఁదనకు । సంభవ వృద్ధినా ✤ శంబులు సకలంబు - సత్వమైతోఁచుట ✤ సహజగుణము॥ తే-గీ॥ జ్ఞాని సుస్థిరచిత్తుండు ✤ గాన నతఁడు । నెపుడుపరమాత్మ తత్వమే ✤ నిశ్చయముగ । నెంచి భ్రమ రూపమైగాను ✤ పించు మాయ । కల్లగానెంచి తన్నుఁదాఁ ✤ గాంచుచుండు॥౯౫॥ కరిరూపంబు

నదారువు । గురుతరముగఁదోఁచుచున్న గుంజరమగునే । పరమాత్ముఁ
డిలగఁ దోఁచిన । బరమాత్ముఁడెగాక నీప్రపంచంబగునే॥ ౯౭॥ తే-గీ॥
గజమనుచుఁజూడ దారువు గానఁబడదు । దారువని చూడఁదోఁచదు
దంతియట్లు । జగమనుచుఁజూడఁ దోఁచదు సర్వసాక్షి । సాక్షియని
చూడఁ గల్పితజగము లేదు॥ క॥ పరసతి వేషముఁదాల్చిన । పురుషుఁడు
పురుషుండెగాని పొలఁతుకయగునే । మఱి జీవరూపుఁదాల్చిన పరమా
త్ముఁడు జీవుఁడగునె పరికింపంగన్॥ ౯౮॥ తే-గీ॥ మాయయీదేహమని
యెంచి మాయగాని । యాత్మయే తాను పరమాత్ముఁ డంచుగాంచు ।
నతఁడుముగ్గురు మూర్తుల కాదియైన । దేవుఁడని లోకమునఁ బ్రస్తు
తింపఁబడును॥ ౯౯॥ క॥ కల్లనిజమందు నిజమును । గల్లఁదునఁ గలిగి
యుండుఁ గావున నిజమున్ । గల్లందువెదకి యాత్మను । నల్లంబునఁ
గూర్చి కల్ల యుడుపఁగవలయున్॥ ౧౦౦॥ ఆ-వె॥ కాననీకు నేను గఱ
పినయట్లుగాఁ । గాంచవలయునట్లు గాకయున్న । ఘనతమీఱనిన్నుఁ
గడతేర్చుటకునింక । నెవరితరముగాదు నిక్కముబల్కఁ॥ ౧౦౧॥ క॥ నీవే
యాపరమాత్మవు । జీవుఁడ నేనంచు భ్రాంతిఁ జెందకుమిఁకనా । జీవ
గుణంబులుమాయయె । నీవెన్నఁడు మాయగావు నిక్కంబదియున్॥
౧౦౨॥ ఆ-వె॥ మాయనీవుగావు మానసేంద్రియములు । గావునీవునె
ఱుక గావుమఱువు । నెఱుకమఱపులేక యేవేళ వెలుఁగొందు । సర్వ
సాక్షివీవు సారసాక్షి॥ ౧౦౩॥ తే-గీ॥ కాయజీవంబులేనంచుఁ గలను
నైనఁ । దలఁచుబోకుము పరమాత్మ తత్వమీవు । స్త్రీనపుంసక పురు
షాది స్థితులుగావు । రూపనామంబులును లేవు రూఢినీకు॥ ౧౦౪॥ క॥
ఇంద్రియములె నేనన నా । యింద్రియములంటంచు నీవు నెన్నుటకు ।
నీకున్నింద్రియముల్వేఱగుటను । నింద్రియములు నీకుఁగావు హేమలతాంగీ॥
౧౦౫॥ క॥ మనమే నే ననినను నా । మనమని నీవనుట వలన మానిని
మనమా । యనిలపు భాగంబగుటను । మన మరయఁగ నీవు గావు
మంజులవాణీ॥ ౧౦౬॥ ఆ-వె॥ బుద్ధి నేననంగఁ బొలుపొంద నీవునా ।
బుద్ధియనుట గతన బుద్ధి యగ్ని । భాగ మగుట వలన భావించి
చూడంగ । బుద్ధి నీవుగావు పువ్వుఁబోణి॥ ౧౦౭॥ ఆ-వె॥ చిత్తమే
నటంచుఁ జెప్పిన నీవు నాచిత్త మనుట వలనఁ । జిత్తముదక । భాగ
మగుటఁజేసి పరికింపఁ జిత్తంబు । నీవుగావు భామ నీలలామ॥ ౧౦౮॥
క॥ అహమే నేనన్నను నా । యహమని నీ వనుట వలన నవనితగంబై ।
యహమలరుచుండుఁగావున । నహమెన్నఁడు గావు నీవు హంసవిహారీ॥

౧౦౯॥ ఆ-వె॥ నిఖిలమెఱుఁగు తెలివి ఽ నే ననినను నీవు । నాదు తెల్వి యంచు ఽ ననుట వలనఁ । దెలివి నీవుగావు ఽ దెలియంగ సర్వంబుఁ । దెలియు తెల్విఁగాంచు ఽ తెలివినీవు॥ ౧౧౦॥ క॥ దేహేంద్రియములు నేనని । మోహముఁ జెందంగఁబోకు ఽ మున్నుగ నీలో । దేహినిఁ గనుఁగొను మెప్పుడు । సోహంబని పల్కుచుజపఽసూత్రమెనీవుర్॥ ౧౧౧॥ ఉ॥ నా రమణీయ గేహమది ఽ నా ధనమంచు వచించు వానికిన్ ఽ వేఱగు చుండు నట్టిగృహఽవిత్తము లట్లుగ నాశరీరము । న్నారయునాదు నింద్రియము ఽ లంచు వచించెడు నీవునింతకున్ । వేఱగుచుందుగాక మఱి ఽ వీనిలో నెద్దియు గావు చూడఁగన్॥ సీ॥ కొందఱు పామరుల్ ఽ గురుముఖంబున నిట్టి - పరమహంసు మహిమ ఽ నరయలేక । యది ప్రాణవాయువ ఽ యందురు పరమాత్మ ... వర్ణింపఁగాఁ బ్రాణ ఽ వాయు వగునె। పరగ గుదమున న ఽ పాన సమీరంబు । నాభియందున సమా ఽ నానిలంబు । దలపఁ గంఠమున ను ఽ దానవాయువుసర్వ మేనున వ్యానస ఽ మీరమెన్న । వరుస హృదయంబునను బ్రాణఽవాయువుండుఁ । బవలు రాత్రియు యంత్రంబు ఽ పగిదినీరు । గుండెలోఁ డక్కుటక్కునఁఽగొట్టుకొనుచు । నదియె బ్రహ్మంబు నానెట్టుఽలనఁగవచ్చు॥ ౧౧౨॥ సీ॥ సరవి నన్నమయకో ఽ శంబె యాత్మయటంచు నందురు కొందఱోఽయవనిలోన సరగఁ బ్రాణమయకో ఽ శంబెయాత్మయటంచు నందురు కొందఱో ఽ యవనిలోన । మానితంబుగ మనో ఽ మయకోశ మాత్మయం-చందురు కొందఱో ఽ యవనిలోన । మగువరో విజ్ఞాన ఽ మయకోశ మాత్మయం-చందురు కొందఱో యవనిలోన । ఓ ఱియు నానంద మయకోశఽమాత్మయంచుఁ । గొందఱనియెదరీపంచ ఽ కోశములకుఁ । దలఁపఁ ద్రిగుణంబులగు నవఽస్థాత్రయంబు।నకువిలక్షుణుఁడగు నాత్మఽనరయలేక॥ ౧౧౩॥ చ॥ కలయఁగనెల్ల వారుతమఽకై వడిమోక్షముఁజెందునట్లుగాఁ। దలపున నెంచి యార్యులిల ఽ దైవరహస్యము సాటిచెప్పినన్ । దెలియఁగలేరు మాయలను ఽ దేలిమునుంగుచునుందు రెప్పుడున్ । జలరుహ నేత్రలోకమునఽ సత్యముఁ జెప్పిన నమ్మ రెవ్వరున్॥ ౧౧౪॥ ఆ-వె॥ మాయ మార్గములను ఽ మనసుంతురందఱు । నిజమునందు మనసు ఽ నిల్పలేరు । చర్మఖండ మొసవు ఽ సారమేయంబును । నిక్షుకోలరుచిని ఽ నెఱుఁగనట్లు॥ ౧౧౫॥ క॥ ఆలపాడుగులను బిడుదులు । పాలనుగ్రోలకయ రక్తఽపానమొనర్చున్ । ఆలీల జనులమోక్షము । కీలెఱుఁగక సేతురెల్ల ఽ క్రియలనుమాయన్॥ ౧౧౬॥ తే-గీ॥ అమల వాక్యంబులను లక్ష్య ఽ మమరి

యుండు । ఛిద్రవాక్యంబులను గుఱి ఽ చెదరుగాన । జనులు సద్బోధలను
విన ఽ జనునుగాని । చెనఁటిబోధలు నెప్పుడు ఽ వినఁగ రాదు॥ ౧౧౮॥
చ॥ అరయుపమ స్తభూతమయుఁ ఽ డైన పరాత్పరు నందుఁ దృప్తుఁడౌ। పరమ
పవిత్రుఁడన్యుఁడు ఽ పామరమార్గములందుఁ జొచ్చునే। హరిఁబోరి కల్ప
భూజనిజ ఽ పుష్పమరందము నానిగ్రోలుచున్ । బరువడి తృప్తినొందు
మధు ఽ పంబులు వోవునె వేపచెట్లకున్ । ౧౧౯॥ క॥ వనధి దరిఁజేరఁజను
నెడఁ । బెనుగాలియు విసరి నావ ఽ పెడ కీడ్చుగతిన్ । మునుము క్తిపుణ్య
హీనులు । గనఁబోయినం దొలఁగ నీడ్చుఁ ఽ గర్మ చయంబుల్॥ ౧౨౦॥
ఆ-వె॥ పరముగనుచుఁ జిత్త ఽ పరిపక్వమును గాక।నరుఁ డెవండయిన ఽ
నంతలోనె । చచ్చెనేని మఱుడి ఽ జన్మంబునం దైన । బుధులం జేరి ముక్తిఁ
బొందఁగలడు॥ ౧౨౧॥ క॥ పరతత్వ చింత లేకయు।చరియించెడు మూఢుఁ
డెన్ని ఽ జన్మలకై నన్ । దరిఁజేర లేడు గావునఁ । బరమార్థమె మాన్పు
మందు ఽ భవరోగంబుల్॥౧౨౨॥ సీ॥ నిన్ను నీవెఱుగక ఽ నింతకు నిల
మాయ - నెన్నెన్ని జన్మంబు ఽ లెత్తుచుంటి । విపుడు నాకృపచేత ఽ
నెఱిఁగితి నినునీవు - నీనిజరూపమై ఽ నెగడుకతన । నేనుఖదుఃఖంబు ఽ లెఱుఁ
గవు పుణ్యంబు - నెఱుఁగవు పాపంబు ఽ నెఱుఁగ వీవు। నెపుడు జాగ్రత్స్వప్న ఽ
నిద్ర లెఱుఁగవు - రేయిపవలు నొక్క ఽ రీతియగుచు బంధ మోక్షంబులును
లేక ఽ పరఁగు నీకు। బంధనమున్నట్లు దోఁచియు ఽ భ్రాంతి జేత । ముక్తిఁగోరియు
నినునీవు ఽ మూలమెఱుఁగ । బంధ మోక్షంబు లెల్లన ఽ బద్ధమయ్యె॥
౧౨౩॥ ఆ-వె॥ పుడమిలోన నేను ఽ బుట్టితిఁ బెరిగితిఁ।జత్తునంచు మదిని ఽ
శంక పడుచు । నేను నాది నీవు ఽ నీది నీవారు నా।వారలంచు భ్రమయ ఽ
వాఁడెపుట్టు॥ ౧౨౪॥ క॥ సుమతి మనోజ వికారము । లమరంగా నీకుఁ
గల్గ ఽ వాత్మవగుటచేఁ।గమలారిక్షీణ వృద్ధులు।కమలాప్తున కెన్నఁడేని ఽ
గల్గునె తెలఁపన్॥ ౧౨౫॥ క॥ తరుణికిఁ దిమిరం బెన్నఁడుఁ । బొరయని
గతిమాయ లేమి ఽ బొందవు నిన్నున్।బరమాత్మ వగుటచేతను । బరికిం
పఁగ లేవు నీకు ఽ బంధవిముక్తుల్॥ ౧౨౬॥ క॥ దరికోని మండెడు నగ
మునఁ । బరువడి నిలువంగఁగలవె ఽ పక్షిమృగతతుల్ । పరమాత్మవైన
నిన్నును । బొరయంగా లేవు పాపపుణ్యములెపుడున్॥ క॥ అల మాన
సేంద్రియంబులు । చలియించుచు నుండుగాన ఽ సారెకు నేనే । చలియిం
చితినని దలఁచకు । చలనంబును లేదు సర్వ ఽ సాక్షివినీవున్॥ ౧౨౮॥
తే-గీ॥ ఇంద్రియములెల్ల వచలమై ఽ యెసఁగువేళ । నచలమైతిని నేనంచు ఽ
నరయఁబోకు । చలన మచల మాదీంద్రియ ఽ చర్యలెల్లఁ । దగుల నేరవు

నిర్గుణ ƒ తత్వమిదావు ౧౨౯॥ క॥ నిలుకడగల్గిన నీకును । జలనపు నెమ్మ
నమునకును ƒ సంగము లేద । ట్టులఁ గానశంక నుడుగును । యలరఁగ
నిస్సంగివీవ ƒ యఖిలమునందున్॥ ఆ-వె॥ అనిన దేనివలన ƒ నఖిల ప్రపం
చంబు । దోఁచు నేదిలేక ƒ దోఁచకుండు । నిశ్చయముగదీని ƒ నెఱిఁగిం
పుమన్న నా । మగువ కిట్టులనియె ƒ మాధవుఁడు॥ ౧౩౧॥ సీ॥ వనిత

## మిథ్యా జగల్లక్షణము.

జాగర మెంత ƒ వఱకుండు నంతకుఁ-గలయసమస్తంబు ƒ గల్గిదోఁచు।
లమ్మనంబున విద్య ƒ యందడంగిన వేళఁ - బరఁగ నెద్దియుఁ దోఁచ ƒ బడక
యుండు । తూర్పున భానుండు ƒ తోఁచినతోడ నే-కిరణంబులును తోఁచు ƒ
నరసిచూడ । నతఁడ స్తమించిన ƒ నాతని కిరణంబు-లతనితోడనె పోవు ƒ
నట్లుగాన । నిను నీ వేయంచుఁ గిరణంబు ƒ లెంచినట్లు । మనము గలిగిన
గలుగును ƒ మాయలెల్ల మన । ము లేకున్న నిఁక నేమి ƒ మాయ లేదు।
గాన సర్వంబు మానసికంబె జగము॥ ౧౩౨॥ క॥ నెఱిమానసీక విశ్వము।
స్థిరమవి పఱవలను బాఱు ƒ చెనఁటినరుండున్ । వరుసమరీచిక జలమని।
పరువిడి యిలఁగూలు మృగము ƒ పగిది నశించున్॥ ౧౩౩॥ ఆ-వె॥ అనిన
మనముగలిగియమనస్కమోగాక । మనము లేక యెగునొ ƒ మర్మమిదియు ।
నానతిమ్మటన్న ƒ నప్పద్మనాభుఁడా । యిందు వదనఁజూచి ƒ యిట్టుల
నియె॥ ౧౩౪ క॥ ఓ వనితామణి మధురము । నీవచనము లెల్లఁబాగు ƒ
నేర్పునకరయన్ । నీ వెట్లు నేర్చియుంటివొ । నీ విధమున నడుగ నెవరు ƒ
నేర్తురు సఖియా॥ ౧౩౫॥ సీ॥ పొందుగాను సమాధి ƒ యందున మది జేర్చ-
టమనస్కమని కొందఱు ƒ రందు రిలను। సత్తి తత్సమాధినిఁ ƒ జాలించఁగా నె
యామానసేంద్రియములు-మరలఁగల్గుఁ। గాననదియమన ƒ స్కముగాదు
భావింప - నాసుషుప్తివిధంబు ƒ నలరుచుండు । నిద్రఁ జెందిన వేళ ƒ నిఖి
లంబు లేకుండు - నిద్ర మేల్కన్న ను ƒ నిఖిలముండు । నట్లుగావున నిద్రయు ƒ
నాసమాధి । మూర్ఛ లీమూడు నొక్కటె ƒ మూటినుండి । దెలసియా
మది సర్వంబుఁ ƒ దెలియుఁగాన । నాసమాధిని నమనస్క ƒ మనగరాదు
౧౩౬॥ క॥ కొందఱుజీవముతోడనె। బొందితో భువిచాటునకును ƒ బోదురది
యెటులా । పొందున జీవ సమాధిగ । నందురదియుఁ గాడదైన ƒ నమన
స్కంబున్॥ ౧౩౭॥ సీ॥ పడఁతిరో యమనస్క ƒ పద్ధతిఁ దెలియంగ-నెఱిగింతు
వినుమింక ƒ నేర్పుతోడ। స్థాణు తస్కరుఁడంచుఁ ƒ దాభ్రమసి పిసపఁ-దెలిసి
కొయ్యని శంక ƒ దీఱినట్లు । పరమాత్మ యందున ƒ భ్రాంతిచే జీవుని -
నారోపితముఁజేసి ƒ నరుడు గురుని । కరుణచే దారు వు ƒ పురుషుండు

గానట్లు । పరమాత్మ జీవుఁడై ౼ భ్రాంతిఁదొఱఁగి । యలరు మానస
దేహేంద్రి ౼ యంబులెల్ల । లేసి యెప్పుడు నాయందు ౼ లేదు మాయ ।
నిర్వికారుండఁ బరమాత్మ ౼ నేనటంచు । భ్రాంతివీడిన సమనస్క ౼ భా
వము యిద్యె॥ ౧౩౮॥ క॥ మనమే నీవును నేనును । మనమే కార్యంబులెల్ల ౼
మనమే జగముల్ । మనమే మాయలు సర్వము । మనమును లేకున్న
లేదు ౼ మఱియొక్కటియున్॥ ౧౩౯॥ ఆ-వె॥ బంధమోక్షములకు ౼
భ్రాంతులకెల్లను । కారణంబు మనము ౼ గానసదియె । బంధమునను
జుట్టు ౼ పడియుండఁగా జాలు । సులభముగను ముక్తి ౼ దెలియఁజాలు॥
౧౪౦॥ క॥ మన మింద్రజాలుఁ డనఁదగు । మనమే గల్పించు మాయ ౼
మనమే గాంచున్ । మనమే భ్రమయుచునుండును । మనమే గనుపించ
కెందు ౼ మఱుమాయమగున్॥ ౧౪౧॥ ఆ-వె॥ మనము నెపుడు లేని ౼
మాయ యటంచును । దానుదానె యగుచుఁ ౼ దలఁపుతోడ । నఖిల
మెఱుఁగుచున్న ౼ నతఁ డమనస్కుఁడు । గాని మనము లేక। గాదుచూవె॥
౧౪౨॥ క॥ సర్వముఁ జూచుచు విడువక । సర్వంబగు కార్యములను ౼
సల్పుచునున్నన్ । సర్వముఁగనిచేయనిగతిఁ । బర్విన నమనస్కమనఁగ ౼
బడునది కాంతా॥ ౧౪౩॥ ఆ-వె॥ వెలఁది వినుము యొక్క ౼ వృత్తాంత
మును నిప్పు । డందువలన సంశ ౼ యములు వాయు । దీనిచేత నాత్మ ౼
తృప్తియౌ నమనస్క । భావమెల్లఁ దెలియఁ ౼ బడును నీకు॥ ౧౪౪॥ భారత
యుద్ధాదిని రథ । సారథి నేనైతి సవ్య ౼ సాచికి నపుడున్। ఘోరమగు
శంకగల్గియుఁ । బోరికి తొప్పకయ యతని ౼ బుద్ధిచలింపన్॥ ౧౪౫॥ ఆ-వె॥
అపుడు నేను దెలిసి ౼ యర్జునా యిదియేమి॥ యీవు నిజముఁ నింత ౼ యెఱుఁ
గలేక । భ్రాంతిఁజెంది యిట్లు ౼ కామరుక్కై వడిఁ । దగ విషాదమొందఁ ౼
దగునీకుఁ ॥౧౪౬॥ ఉ॥ నేనె సమస్తజీవులును నీవును నీయిరువైపు సైన్య
ముల్ । నేగుచుండ భండనము ౼ నేను గొనర్పఁగనంటి విప్పుడున్। నేన
లయింపఁ జేయకయె ౼ నీకును వీరలఁజంపశక్యమే ॥ నేనె హరింతు సైన్య
ములు ౼ నీవును నింతకుఁ గారణంబిలన్॥ ౧౪౭॥ తే-గీ॥ జీవలోకంబు
లెల్లను ౼ సృష్టిసేయఁ । బోషణముసేయ సర్వంబుఁ ౼ బొలియఁజేయ ।
నేనయైయుండ కారణం ౼ బితరముగను । గలుగఁజేతు నాదు మహిమఁ ౼
దెలియ వశమె॥ ౧౪౮॥ క॥ పరమాత్ముఁడనగు నన్నిక । నెఱిఁగిన సర్వం
బునందు ౼ నేనేగాకన్॥ । బరికింపని తరమున్నదె । పరువడి నను గాంచి
నీదు ౼ భ్రాంతివిడుమిఁకన్. ౧౪౯॥ తే-గీ॥ నన్ను సేవించి ముక్తులౌ ౼
నార్యులెల్ల । భ్రమసి నీవలె నీరీతి ౼ భ్రాంతిపడరు । నిఖిల రూపులు

నేనంచు ఽ నెంచికర్త । కర్మక్రియ లనుజిక్కరే ఽ కాలమునను॥ ౧౫౦॥
క॥ నేనే చేసెద ననుచును । మానసమున నెంచు టెల్ల ఽ మఱియదియ
హంమే । గాని యిఁక నేమి సేయుదు । నేనును నీలోన లేక ఽ యింద్రి
తనూజా॥ ౧౫౧॥ ఆ-వె॥ ఆరయ లేక నన్ను ఽ నజ్ఞానులెల్లను । నహము
తోడఁ గర్మ ఽ రాచరించి । గాదె నరకస్వర్గ ఽ కష్టసుఖంబులు। ననుభ
వించుటెల్ల ఽ నవనిఁబుట్టి॥ ౧౫౨॥ క॥ ఉన్నది నేనేయెందున । నన్నెఱిఁ
గిన నింక నేది ఽ నాకన్యముగ । న్నన్నియు నేనేగావున। నన్నెఱిఁగిన వారి
కెందు ఽ నహముఁ గలదే॥ ౧౫౩॥ ఆ-వె॥ తలఁపఁ బదునెనిమిఽదక్షౌ
హిణీలగు । సంఖ్యనొప్పు రెండు ఽ సైన్యములను । నేను లేకయున్న ఽ నెవ్వఁ
డాడించును । నాటకుండ నేను ఽ నఖిలమునకు॥ ౧౫౪॥ క॥ నేనను లేని
శరీరము । మానక నీసేనలందు ఽ మఱియున్నయెడన్ । గానంగఁ జేయుమి
ప్పుడ । యేనును లేకున్న దేదో ఽ యీయిలయందున్॥ ఆ-వె॥ దేహికత్తు
లకును ఽ దెగఁడు పాశంబులఁ। గట్టువడఁడు వహ్నిఁ ఽ గాలిపోఁడు । రాళ్లఁ
బగులఁ డెందు ఽ నీళ్ల చేతఁ దడియఁ । డట్టివానిఁ జంప ఽ నలవె నీకు॥ ౧౫౫॥
క॥ ఇలశిథిలంబగు చేలం । బులు వదలియు। గ్రొత్తవస్త్రఽములు దాల్చిన
యట్టుల దేహి చెడిన దేహం । బులు విడి నూతన శరీర ఽ ములను
వహించున్॥ ౧౫౬॥ ఆ-వె॥ మఱియుఁ గాల సమయమైన జీవులకు నేఁ ।
గారణమున సమయఁ ఽ గలుగునట్టి కారణంబు చేతఁ ఽ గతమగు నంతి
యే । గాక నీవు సేయు ఽ కార్యమెద్ది॥ ౧౫౭॥ క॥ దేహియుఁ జచ్చునటం
చును । మోహంబును జెందువాఁడె ఽ మూఢుండవనిన్ । దేహంబులెల్లఁ
దెగినను । దేహినిఁగు నేను జెనను ఽ దేననునైనన్॥ ౧౫౮॥ ఆ-వె॥ సర్వ
రూపములును ఽ నమసిన నేనుందు । నాకుఁ గల్గదెపుడు ఽ నాశమరయ।
ఘట జలంబులందు ఽ గగనంబు గనుపించి । ఘటము బగుల నిల్చుఽ గగ
నమట్లు॥ ౧౬౦॥ ఉ॥ పుట్టుట వృద్ధినాశములుఽ పొందుట డిందుట మేనికై
నచోఁ । బుట్టును గిట్టు దేహికని ఽ పొల్తురు లోకమునందు మానవుల్।
పుట్టినవేళ మోదమును ఽ పొందుచుఁ జచ్చినవేళ నేడ్తురా। పుట్టును గిట్టు
నేకమని ఽ బుద్ధిఁ దలంచని కారణంబునన్॥ ౧౬౧॥ ఆ-వె॥ పుట్టి పెరిగి
మఱలఁ ఽ బోవున దెల్లను । మాయ యంచు నీదు ఽ మది నెఱింగి। నిక్క
మైన నన్ను - నెఱుఁగ నీవును లేవు । రూఢి నేనే యొక్కఽ రుండనైతి॥ ఉ॥
చచ్చుటె నిత్యమంచు మఱి ఽ జన్మ మనిత్యమటంచుఁ గానకే। చచ్చిన
వారిఁ జూచి యిఁకఁ ఽ జావఁగఁ బోయెడివార లందఱున్। జచ్చుట లేని
పోలికలు ఽ జావున కేడ్తురు చావకుందురే । యచ్చుగ వీరలందరును ఽ

నంచుఁబికాపక నవ్వఁగాలుఁడున్॥ ౧౬౩॥ తే-గీ॥ గరిమ సంయోగతద్వి
యో · గములఁగూర్చి । పండితులు మోద ఖేదముల్ · పడయరెపుడు।
వానికై యువెవచ్చును · వానికవియె । పోవు సర్వంబు దీనికై · పొగడ
నేల। ౧౬౪॥ క॥ ఆయువు మూడినవారలె । నీయెదురన్ నిలిచిపోరి ·
నీల్గుదురరయ । న్నాయువుగల్గినవారల । నీయధికారమునఁ జంత · నేర్తు
వె విజయా॥ ౧౬౫॥ ఆ-వె॥ కర్మవశముచేతఁ · గల్గును దనువులు।కర్మ
వశముచేతఁ · గల్గువృద్ధి । కర్మవశతగిట్టు · గాక జీవులఁజంప । నగునె
నొరులు కార । ణంబులేక॥ ౧౬౬॥ క॥ వినుపార్థయిదియధర్మమె।యని
సేయుటరాజధర్మ · మగునట్లుగా । కననీవుముక్కుపట్టుక । వనమున
గూర్చుండుమునీవె · వలదనఁబోకున్॥ ౧౬౭ ఆ-వె॥ యుద్ధమిపుడునీవు ·
నొనరింపకున్నను । మొనసియిపుడుకాల · మున నశించు । జనములెల్ల
నిపుడు । చావక మానరు । గనుము పేరుసీది · గాఁగఁబరఁగు॥ ౧౬౮॥ క॥
తనుఁదాఁ గనియేఁ జేసెద । ననునహమున్ విడిచిజగము · నంతయు
నంతం । బొనరించినఁ దద్దోషము । నను జిక్కండాత్మవేత్త · యహము
గలుగమిన్॥ ౧౬౯॥ ఆ-వె॥ అహమువిడకయట్టు · లజ్ఞానిచేసిన । నతఁడు
నఘమునొందు · నదియు నెట్లు । లనినదివ్వెలేని · యతఁడు నంధంబునఁ ।
బడును గ్రుడ్డివాఁడు · వాయు దమము॥ ౧౭౦॥ క॥ అజ్ఞానముఁ బోనడఁ
చియు । సుజ్ఞానము చేతనీవు । సుస్థిరతరనిన్ । బ్రజ్ఞాన్వితముగఁ జేయుము
సుజ్ఞానులు మెచ్చలెమ్మ · శూరతనిపుడున్। ౧౭౧॥ ఆ-వె॥ అనుచు
నరున కేను · నమనస్క భావంబు । నిచ్చి బవరమునకుఁ । జొచ్చునట్లు।
చేసినాఁడ నాత్మ · సేవితునకుఁ బాప । పుణ్యవితతులెట్లు · పొందనేర్చు॥
౧౭౨॥ క॥ అమనస్క యోగమనఁ గను । సమయించుటగాదు మనము ·
సంగత వృత్తుల్ । క్రమమొప్ప లేని వనుచుచు । నమరంగాఁగాంచున
దియె · యమనస్కమగున్॥ ౧౭౩॥ ఆ-వె॥ ఎట్టివేళనైన · నే దేశమున
నైన । నేమి సేయుచున్న · నెట్టులున్న । నేను జేయువాఁడఁగా నను
నమనస్క । భావమూన వలయు · బ్రహ్మవేత్త॥ ౧౭౪॥ ఉ॥ నావుడుఁ
బంకజాక్షి యమ · నస్క ప్రభావము నింతయొప్పునే।నావినుతించితాను
నమ · నస్కయునై యిటుఁబల్కె దేవనా । భావమునందు సందియముఁ ·
బాపుము తత్వ విదుండు మాయ యే । త్రోవను నంట కెప్పుడును ·
లోకుల యట్లె నటించు నాఁతడున్॥ ౧౭౫॥ ఆ-వె॥ అనిన వాని దేవుఁ ·
డా యింతిఁ గౌఁగిలిఁ । జేర్చి ప్రేమపొదలఁ · జెక్కునొక్కి । ముద్దుపెట్టి
తనదు · ముద్దియతోడను । ననియె నిట్టులనుచు · పార్థ మొప్ప॥ ౧౭౬॥

క॥ ఏ పుణ్యా ఫలమదెట్టిదా । నీపుణ్యా సుభాషణములునీ సుగుణములు న్నే పుణ్యులయెడఁ గానము । శ్రీపుణ్యా చరిత్రవినుము ॥ శ్రేష్ఠవిధంబుల్॥ ౧౭౭॥ ఆ-వె॥ ఊరనుండ నేల ॥ యుత్తమ వేత్తకుఁ । గుడుచు టేల ధనముఁ ॥ గూర్చు టేల । సతులు సుతులు నేల ॥ సంసారమదియేల। యనుచుఁ గొంద ఱందు ॥ రజ్ఞులగుచు। ౧౭౮॥ ఉ॥ కోటి ధనంబు గూర్చినను ॥ కూటికి లేఁ దరిద్రుఁడై నచో । మేటి సుఖంబులొందినను ॥ మేనికి రుగ్మతలెన్నివచ్చినన్ । కోటియు బిడ్డలుండినను ॥ భోగముగోరక యొంటినుండిన । వీటను గానంబునను ॥ వేత్తకునున్న సమంబె మోక్షమున్॥ ౧౭౯॥ ఉ॥ అన్నము లాకసించెనను । నంబర భూషలవాది దాల్చినన్ । గన్నియ తోడఁ గూడినను ॥ గన్నతనూజుల ముద్దునేసినన్ । జెన్నుగ బంధులాప్తులను ॥ జేరి నటించిన బ్రహ్మవేత్తలు । న్నెన్నఁడు మాయఁజెందరికఁ నేమియు నూనము లేదు ముక్తికిన్॥ ౧౮౦॥ ఆ-వె॥ నీటియందెయుండి ॥ నీరజపత్రంబు ॥ నంటియుండ జలము ॥ నంటనట్టు । లాత్మవేత్తలకును । నఖిల సంసారంబు ; దగిలి యుండి మాయ ॥ దగుల దెపుడు॥ ౧౮౧॥ ఉ॥ గారడివాఁడు సర్వమును ॥ గల్లగ నెంచుచుఁ జేయువిద్యలన్ । గారడివిద్యమాయయని ॥ గందురు లోకులుదద్విధంబునన్ ॥ దారక తత్త్వమాత్ముఁగను ॥ ధన్యుఁడురిత్తని సర్వకార్యముల్ నేరుపుతోడఁ జేసినను ॥ నెల్లను జూచిన మాయఁజెందునే॥ ౧౮౨॥ తే-గీ॥ సర్వపనులింట సల్పుచు ॥ జారకాంత ప్రియునిపొందునకై మమతఁ ॥ బెనయునట్టు । నన్ని వ్యవహారములుఁ జేసి ॥ యాత్మమీఁద । దలఁపు మఱువక ప్రచరించుఁ ॥ దత్వవేత్త॥ ౧౮౩॥ క॥ బురదనునంటకె కుమ్మర । పురువును జరియించుచుండు పోలికనరయన్। ధరవిజ్ఞాన మయుండగు । పురుషుండిల మాయఁబొంది ॥ పొందం డెపుడున్॥ ౧౮౪॥ ఆ-వె॥ గాన నటనతాళ ॥ గతులతో దొమ్మరి । నెత్తి ఘటము దొంతి ॥ నిల్పినట్లు । సకల కార్యములును ॥ సల్పుచుఁ బరమాత్మ ॥ గుర్తువీడఁ డాత్మ ॥ గోవిదుండు॥ ౧౮౫॥ చ॥ పరువడి నాలను ధ్యమునఁ ॥ బాల ఘటంబును బెట్టి దానినే । మఱకను గోవులంబిదుకు ॥ మానవుడై వడి నాత్మవేత్తయున్ । సరగునఁ దన్నుఁదాఁగనుచు ॥ సర్వము దబ్బరగాఁగఁ జూచుచున్ । గెరలుచుఁ జేయుచుండు గృహా ॥ కృత్యములెల్లను నింపు మీఱఁగన్॥ ౧౮౬॥ ఆ-వె॥ ధనము నొక్కచోట ॥ దాఁచి తానెందున్నఁ । దానిమీఁద జ్ఞప్తి ॥ దగులుపగిది । నేమిసేయుచున్న ॥ నెందున్నఁ బరమాత్మ । మఱువకుండు వేత్త ॥ మానసమున॥ ౧౮౭॥ క॥ వరునిచ్చకముగఁ జూచుచుఁ । బరపురుషుని పొందుఁజేయు॥

భామినివోలెన్ । మఱితనువు నిచ్చకముగాఁ । బరికింపుచుబ్రహ్మవేత్త పరమును గాంచున్॥ ౯॥ తే-గీ॥ రవియుఁ బీల్చిచి కల్మష రసము లెల్ల । నట్టి కల్మష మేమితా నంటనట్లు । లఖిలమౌ కష్టసుఖములు ననుభవించి । దగులఁడా దోష మెద్దియుఁ దత్వవేత్త॥ క॥ ఇలమాయలు సర్వంబును । సలలితముగఁజూచు నింద్ర జాలము భంగిన్ । కలిమిని లేమినిఁ బొందియుఁ । గల విధమున నాత్మవేత్త గాంచుచునుండున్॥ ౧౦॥ ఆ-వె॥ తనువు దాను గాక తాను దానై యున్న । స్థిరుఃమాయ లేమి సేయలేవు । చలన రహితమైన శైలంబుఁ గదలింపఁ । గలదె చలనమైన గాడ్పరయఁగ॥౧౧॥ ఉ॥ క్షీరముఁబేరియా పెరుగు జిల్కఁ గఁ దేలిన నిగ్గుచల్లలో । గారవమొప్పఁ గల్పినను గట్టిగ వేఱుగ నిల్చునట్లుగన్ । ధీరత నాత్మతత్వమును - దేహమునందునఁ దేల్చినట్టియా। ధీరుఁడు విశ్వమాయలను దేలిమునింగిన మాయఁ జెఁదునే॥ ౧౨॥ ఆ-వె॥ ముత్తెమైన నీరు ముత్తెంబుగా నుండుఁ । గాని జలమునందుఁ గలియనట్టు।లాత్మయైన యాతఁ డాత్మగానుండును।గానితిరిగిమాయఁ గలియఁడెపుడు॥ ౧౩॥ క॥ క్షీరములఁ గలియు నుదకము । క్షీరములే గాని జలము చిక్కనె మఱలన్ । దారక తత్వమునందునఁ । జేరినయా ఘనుఁడు మగుడిఁ జెందునెమాయన్॥ ౧౪॥ ఆ-వె॥ పావకుండు సర్వభక్షకుండయ్యును । గలుషిగాని భంగిఁ గలుషమైనఁ । జేసి కలుషపదముఁ జెందరు బ్రహ్మజ్ఞు। లగుటవలన నార్య । లంబుజాక్షి॥౧౫॥క॥ తనువుండి జ్ఞాని యెట్లగు । నను యనినను దగ్ధపటము న్యాయము గాగన్ । గనుపడు చూచెడువారికిఁ । దనువే లేకుండు వేత్త దనుఁడా నగుచున్॥ ౧౬॥ తే-గీ॥ తొడరిగారుడ మంత్ర సిద్ధుండు ఫణుల । నంటి గఱపించుకొనవిష ముంటనట్లు । మొనసి గురుమంత్ర సిద్ధుండు మోహపాశ । ములను బొందియుఁ బొందఁడు మోహనాంగి॥ ౧౭॥ చ॥ అరయ సమస్తభూషణము లంగన బంగరటంచుఁ జక్కఁగా । నెఱిఁగిన నామ రూపములు నెప్పటియట్లుగ వచ్చి వచ్చినన్ । మఱితన పూర్వ దృష్టికిని మాఱువు సెందని యట్లు వేత్తకున్।బరిపరి రీతులన్ మెలఁగి భంగమురాదిఁక నాత్మదృష్టికిన్॥ ౧౮॥ క॥ అవవిని దారాసుతులతో। నను వొందుచు నిట్టి మార్గ మందియుఁకడతే । ఱినవారిఁ జెప్పమనఁ గాం।తను గనుఁగొని యిట్టులనియె దామోదరుఁడున్॥ ౧౯॥ సీ॥పతి జనకుఁడు రాజ్య భారకుండయ్యును - జ్ఞానులలోనఁ బ్రఖ్యాతిఁ గాంచె । ధరవసిష్ఠుఁడు పుత్ర దారాది యుతుఁడయ్యు-నాత్మజ్ఞులందు

గరేణ్యతను గాంచె । వరతులా ధారుండు శ్రీ వాణిజ్య వృత్తిచే - నుండి
వేత్తలలోన శ్రీ ఖండ (డమ్యె । గటిక వృత్తిని సల్పి శ్రీ యటుల ధర్మ
వ్యాధుం - డంతటి జ్ఞానిలేం డనంగం బరంగెం॥ తే-గీ॥ గాన వేత్తలు
ప్రారబ్ధ శ్రీ కర్మఫలితం । గడంగి యెటువంటి వ్యవహార శ్రీ కములునెల్లు।
సల్పినను నేమి కొదువ మో శ్రీ క్షుంబునకును । మఱియు మానంబునను
మాత్ర శ్రీ మైనలేదు॥ క॥ అనవృడు జన్మకుం బూర్వము । చనిపోయిన
వెనుక లేదుశ్రీజన్మ మెవరికి । న్నవి కొండఱందు రదియెట్లన మాధవుం
డనియెనిట్లు శ్రీ లజ్ఞాననరుండ॥ ౨౦౧॥ సీ॥ సరసిజేక్షణ విను శ్రీ జన్మకుం
బూర్వంబు - చచ్చిన పిమ్మట శ్రీ జనులకెల్ల ; జన్మమే లేకున్న శ్రీ జని
యించు వారెల్ల-నొక్క చందంబున శ్రీ నుండవలదే । మహినేలు రాజు
నై శ్రీ మంత్రియై భృత్యులై - ప్రజలునై యుండంగం శ్రీ బడుట యెట్లు।
ధనవంతుం డొక్కండై శ్రీ దారిద్ర్యత నొకండు రోగియొక్కండునై శ్రీభోగి
యొక్క॥ ఆ-వె॥ డగుచునొకండు సుఖము శ్రీ ననుభవించుట యెట్లు ।
లొకండు దుఃఖి యగుచు శ్రీ నుండుటెట్లు । గాన సర్వజీవ శ్రీ గణములు
కర్మచేం । గలిగి కర్మ ఫలము శ్రీ గాంచుచుండ॥ ౨౦౨॥ క॥ మును జేయు
కర్మఫలమని । తన యాపత్కాలమందుం శ్రీదలంచును నరుండ।ట్లనెంతు
రెల్లవారలు । మును వెన్కను గర్మజన్మ శ్రీ ములుః గల్గుటచేత॥ ౨౦౩॥
ఆ-వె॥ మున్ను జన్మలేక శ్రీ యున్నను నీజన్మ । గలుగుటకును లేదు శ్రీ
కారణంబు।పూర్వ కర్మఫలముం శ్రీ బొంద నీ జన్మయ్యె।నిపుడు గర్మపిదప శ్రీ
నిచ్చుజన్మ॥ ౨౦౪॥ సీ॥ ముందు వెన్కను జన్మ శ్రీ ములులేక యున్న చో-
ననుభవం బింకలేక శ్రీ యట్లైగాన । జీవ హింసయు నేమి శ్రీ సేయరా దన
నేల - దబ్బరలాడరా శ్రీ దనంగ నేల । జారచోరత్వముల్ శ్రీసల్పరాదన నేల శ్రీ
మద్యపానము దోష శ్రీ మనంగ నేల । మాయవాదుల పొందు శ్రీ మానంగా
మన నేల - నాఢ్యుల సేవించు శ్రీ మనంగ నేల॥ ఆ-వె॥ శాంతి బొంద నేల శ్రీ
జనులు సత్కార్యముల్ । సేయ నేల దైవ శ్రీ చింత యేల।ధర్మవృత్తియేల
దలంపంగ నివియెల్ల । జన్మమంటం జేసి శ్రీ సలుపవలసె॥ ౨౦౫॥ ఆ-వె॥
మగుడి జన్మలేని శ్రీ మాటసత్యంబన । సుజన దుర్జనులును శ్రీజూడనొకటె।
మంచిచెడ్డ లొకటె శ్రీ మఱి సనాతన ధర్మ । మెత్తి పోవునుగద శ్రీ యిట్ల
నంగ॥ ౨౦౬॥ క॥ ఇలజన్మభయము చేంగద । సలలితముగ నూరిజనులు శ్రీ
చాలాకష్టం।బులునొంది పరముం గన్గొని । తొలగుదు రాకర్మజన్మ శ్రీదుఃఖ
విపత్తుల్॥ ౨౦౭॥ క॥ భవము మును వెనుక లేదను।నవి వేకులు నిపుడు
పుట్టు శ్రీటది యేల పురా । భవ ఫలము లేక యున్నను। భువి నేలక యుంద

అన్ని ƒ పోలికలేలా॥ ౨౦౭॥ ఆ-వె॥ కర్మజన్మగతులు ƒ క్రమముగాఁ బెద్దల । వలనఁ దెలియుటకును ƒ దెలివి లేక।నోట వచ్చినట్లుƒమాట లాడెడువా ర।నేక సంద గలరుƒలోకమందు॥ ౨౦౯॥ క॥ జ్ఞానికిఁబాయు నుదను వ । జ్ఞానగతిః బేధమేమి ƒ సమ మిద్దఱనః । జ్ఞానియు ముక్తుం డగు న।జ్ఞానియుఁ గర్మాంకురమున ƒ జన్మము లొందుః॥ ౨౧౦॥ఆ-వె॥ అదియు నెట్టులనిన ƒ సమర వేల్చిన విత్తు । నిలను నెందునైనƒమొలవ నట్లు । విమలజ్ఞానవహ్ని వేల్చిన కర్మయుఃƒవిత్తు చచ్చుజన్మ ƒ వేత్త కేది॥ ౨౧౧॥ క॥ ఏవిధ బాధల నైనను।నేవేళను నైన నిలను ƒ నెచ్చట నైనః । జీవన్ముక్తుఁడు కాయముఁ । బోవిడిచిన ముక్తుఁడగునుƒబూర్ణేం దుముఖి॥ ౨౧౨॥ ఆ-వె॥ దేహమెవ్వడు నరుఁడు ƒ దెలియంగవలె నది। గోరి తెలియకున్నఁ ƒ గొఱఁతగల్గ । దైననీకు నివుడు ƒ నామరణాంక ముల్ । కొన్ని దెలియ పఱతుఁ ƒ గొమ్మవినుము॥ ౧౨౩॥ క॥ ఏవస్తువు

## మరణచిహ్నములు.

తాఁజూచిన । నావస్తువు ఛిద్రముగను ƒ నగుపడుచున్న । నీవిశ్వము నొకవింతై । భావంబునఁ దోఁపఁగల్గఁ ƒ బంచత్వంబుః॥ ౨౧౪॥ సీ॥తన దృష్టికిని నరుంƒధతి గనుపడకున్నఁ-దోయంబుల శిరము ƒ దోఁచకున్న। వీనుల నాదంబు ƒ వినఁబడ కుండిన-నడుగుల జాడ చూƒపడక యున్నఁ। దరణి బింబము మధ్య ƒ తెరపిగాఁదోఁచినఁ - జుక్కలునల్లగాఁƒజూడఁ బడిన । గరము నిటలముంచఁ ƒ గా మణి బంధంబు-కనులకు మందమైƒ గానఁబడిన॥ ఆ-వె॥ నరుక్కడైనఁ జంద్రుఁ ƒ డైనను విడువక । ననిశమొ క్కరీతి ƒ నడిచిరేనిఁ । బసఁగ మృత్యుభయము ƒ ప్రాపించు నరులకు। వాని వాని కొలఁది ƒ వనరుహాక్షి॥ ౨౧౫॥ క॥ ఈకరణిని సుజ్ఞానముఁ । జేకొని నటియించు పరమ ƒ సిద్ధునకును నే । లోకమున సములు నధికులు। ప్రాకటముగ లేరు వెదకి ƒ పట్టన నెందుః॥ ౨౧౬॥ ఆ-వె॥ తరుణిదెలియఁ గల్గు ƒ ధర్మమర్మంబులు । దెలిపి తిప్పుడెల్లఁ ƒ దేఁటపడఁగఁ । గొఱత యేల యింక ƒ గొప్ప రహస్యంబు । మఱియుఁ గలుగు నచల ƒ మార్గ మొకటి॥ ౨౧౭॥ క॥ మిన్నయగు సర్వమునకును।బన్నుగ నా కేవలాత్మƒ భావముఁ రయకే । యెన్నెన్ని నీవు దెలిసిన । నన్నియు వ్యర్థంబులగును ƒ నబ్జదళాక్షీ॥ ౨౧౮॥ ఆ-వె॥ అరయసాంఖ్యతార ƒ కామనస్కములకుఁ। జేరుగడయు నగుటఁ ƒ జేసిబుధులు। నచల భావమియు ƒ రతివ దానికిఁ గ్రింది । భావములను దెలియ ƒ పఱతురెందు॥ ౨౧౯॥ చ॥ ధరఁ బరిపూర్ణ భావమును ƒ దప్పకపొందుట యుత్తమోత్తమం । బరుదుగ సాంఖ్య

తారకము ǂ లాయమనస్కముఁ బొందమధ్యమం బరుదుగ ముద్రయోగములు ǂ పట్టుటయు న్నధమంబ యెంతయుఁన్ । సరఁగునఁ బుణ్యపాపములు ǂ సల్పుటయు న్నధ మాధమంబగున్॥ ౨౨౦॥ ఆ-వె॥ సుదతి మున్ను నెఱ్ఱఁగఁజూపి చేఁ పనుబట్టు । పగిదిముందు నెఱుక ǂ భావమెల్లఁ। గఱపినాఁ డనునట్టి ǂ యెఱుకచేఁ బరిపూర్ణ । భావమరసి యెఱుకఁ ǂ బాయవలయు॥ ౨౨౧॥ చ॥ అనవుడు నత్తలోదరియు ǂ నా దనుజాంతకు నా దయాంబుధిన్ । గనుఁగొనిపల్కెఁ దారకము ǂ గాంచితిమీకృపచేత నిప్పుడున్ । వినఁదగు ధర్మమర్మములు ǂ వింటిని సంశయమెల్లఁదీఱెనా। మనవి వహించి యీయచల ǂ మార్గము దెల్పుమి జీవితేశ్వరా॥ ౨౨౨॥ క॥ కర్మాంధకార భాస్కర । మర్మా మర్మావిభేధ ǂ మానితబోధా । ధర్మా ధర్మ విహీనా । నిర్మల సగుణ ప్రదేప ǂ నిర్గుణరూపా॥ ౨౨౩॥ మాలిని॥ చలనరహితగాత్రా ǂ సర్వభూతాత్మ సూత్రా । విలయనిలయ నాశా ǂ విశ్వ దీపప్రకాశా కలుష విగత సంగా ǂ కర్మసంతాప భంగా। సలలిత గుణహర్తా ǂ సర్వలోకేశ భర్తా॥ ౨౨౪॥

గద్య॥ ఇది పోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర
నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ
సంవాదంబను - సుజ్ఞాన శాస్త్రంబునందుఁ
జతుర్థాశ్వాసము - సమాప్తము.



శ్రీసద్గురు వేనమః.

# శ్రీ కృష్ణ రుక్మిణీ సంవాదం బను
# సుజ్ఞాన శాస్త్రము



## పంచమాశ్వాసము.

క॥ పరిపూర్ణ కేవలాత్మా । పరహంస సమేత భూత ǂ పంచాతీతా పరమపద నిత్యమంగళ । పరతత్వా ధీసముక్త ǂ బంధవినాశా॥౧॥ వ॥ అవధరింపు మక్కంవారి యా హంసయాన కిట్లనియె॥ ౨॥ చ॥ అలికుల వేణి లోకముల ǂ నన్ని చరింపఁగవచ్చుఁ గొండలు । న్నలువుగ నెత్తవచ్చు

నటులం బుధు లెల్లను దాఁటవచ్చు భూ। తలమున దూరవచ్చు దివిఁ
దాల్మినిఁ బ్రాకఁగవచ్చుఁ గాని యీ। యిలఁ బరిపూర్ణ భావమును

అచలభావము.

నేరికిఁ బట్టుట దుస్తరంబగున్॥ ౩॥ ఆ-వె॥ మొనసి వివిధయోగముద్రలు
గనవచ్చు। దేహతత్త్వమెల్లఁ దెలియవచ్చు। నందవచ్చు తారకా
మనస్కంబుల। నందరాదు కేవలాత్మబోధ॥ ౪॥ క॥ భక్తికివశ్యము గా
దది। ముక్తికిఁ జూపడదు బంధమునఁ దగులదు పో। యుక్తికిఁ జిక్కదు
మఱియే। శక్తికి సాధ్యంబుగాదు సతి యచలంబున్॥౫॥ ఆ-వె॥ భావ
మునకుఁ దగులు వడదు సూయచలంబు। చూపరాదు కనులఁ జూడ
రాదు। నోట నిట్టిదనుచు నుతింపఁగారాదు। రమణిమదికిఁ గోచ
రంబుగాదు॥ ౬॥ క॥ భామిని యేమని చెప్పుదు నామమురూపంబు లేక
నంతయు బయలై। కామాది గుణవికారము। లేమియు లేకున్న దదియు
నేమనరాదన్। ౭॥ ఆ-వె॥ రూపముండెనేని రూపింపఁగావచ్చు। నామ
ముండెనేని - నరయవచ్చు। గుణములుండెనేని గుర్తెఱుఁగఁగ వచ్చు।
నేమిలేనిదాని నెఱుఁగుటెట్లు॥ ౮॥ సీ॥ గాలిచేఁ గూలదు రాలచేఁ బ
గులదు-కత్తికిఁ దెగదగ్నిఁ గాలిపోదు। అబ్ధిలో మునుఁగ దీయవనిలో
నణఁగదు నింగిఁ బ్రాకదు లోక సంగిగాదు। ఎండ కెండదు వాన కెంత
యుఁదడుపదు చలికి వణఁకదెందు జంకుపడదు। బాదల కందదు
పాశాళి చేఁగట్టు-పడదు మృత్యువుచేత భంగపడదు। చేతి కందదు
సూస్వతస్సిద్ధమగుచుఁ। బుట్టినది గాక నదియెవు గిట్టులేక। బట్టబయ
లయ్యు నొకభంగిఁ జట్టువలెను। నలరు పరిపూర్ణ బ్రహ్మంబు నరసి
చూడ॥ ౯॥ క॥ పొందుగ రస్ఫురదనూచన। నొందిన నితరంబు లేక
యుండును బయలై యెందునఁ జూచినఁ గనుపడు। సందింతయు లేక
సర్వ సంపూర్ణంబై॥ ౧౦॥ క॥ ఇది యిదియిదియిదిగానిది। నదియిది
యదియనుచు నెఱుఁగు। నదిగానిదియై సదనాతీతం బగుచును। గదలక
గనుపించు నదియె గను మచలంబౌ। ఆ-వె॥ పంచభూతగోత్రభాను
సుధాకిర। ణాబ్ధులమరమూర్తు లఖిలజీవ। భువనజాలమెల్లఁ బుట్టక
పూర్వమే। గలదు కేవలాత్మ కమల గంధి॥ ౧౨॥ క॥ పుట్టిన వెనుకను
జగములు। పుట్టక యున్నప్పుడొక్క పోలిక నెందున్। బట్టబయలగుచు
నుండిన। యట్టిదె యచలంబుగాని యాత్మయు నగునే॥ ౧౩॥ మ॥ పర
మాత్ముండన మాయ బట్టబయలే బ్రహ్మంబు భావింపఁగాఁ। బరిపూర్ణం
బగు దాని నిట్టిదనుచున్ బల్కంగరాదేరికి। న్నరయంగా నది నిర్వికార

మతులం బాధార శూన్యంబువో। నిరుపాధిక్యము నిర్గుణంబు నజముల్ నీరంధ్రమై భాసిలున్॥ ౧౪॥ ఆత్మదైవంబంచు నారయవలదింక-నాత్మ దేవుండైన నచలపట్లు। నిలచి యుండవలదె నిమిషంబులోఁ బోవు-నాత్మ దేవుండెట్లు లగుఁదలంపఁ। దనువు వచ్చినపుడె - తానును వచ్చెను - దానుండువఱకును దనువు నుండుఁ। దాను బోయినపుడె తనువు దగ్ధంబగు-దనువుఁ బాసినపుడె తాను లేక॥ తే గీ। మాయమై పోవు నాయాత్మ మాయగాక। దలఁచి చూడంగ నాయాత్మ దైవమగునె యాత్మయని నను బరమాత్మ యనినఁబరమ। హంస చైతన్యమనసాక్షి యనినమాయె॥ ౧౫॥ సీ॥ అన్న పానంబులా ద్యఖిల వర్తనములు-నాత్మకు లేవు దేహంబునకన। దేహంబునందునా దేహియున్నప్పుడే-యన్న పానంబుల నారగించు। స్వప్నసుషుప్తులు జాగరంబును నొందు-నఖిల కార్యంబుల నాచరించు। నాత్మయాకాయంబు నందు లేనప్పుడు-కలయు నిద్రయు మేల్కొ గాంచు టేది॥ తే-గీ॥ యన్న పానంబులను జేయు టది యు నేది। నకల కార్యంబులను నింక సల్పు టేది। గాన సర్వంబు దేహి దేగాని దేహ। మేమి సేయదు జడమది మీన నేత్ర॥౧౬॥సీ॥ఆత్మయే గల్పించె నరయఁ ద్రిమూర్తుల-నాత్మయే గల్పించె నసుర సురల। నాత్మయే గల్పించె నష్ట దిక్పాలుర-నాత్మయే గల్పించె నర్క విధుల। నాత్మయే గల్పించె నక్షత్రవితతుల - నాత్మయే గల్పించె నగపయోధు। లాత్మయే గల్పించె నా పంచభూతంబు - లాత్మయే గల్పించె నఖిల జగము॥ తే-గీ॥ లాత్మ గల్పించె పశుపక్షు లాదివివిధ। సస్య వర్గంబు నరులాది సకల జీవ। జాల మొనరింప హరియింప మూలమాయ। నాత్మయే గాన వేఱొక్క టరయ లేదు॥ ౧౭॥ క॥ పుట్టినదిగా దచలము ను। బుట్టింపదు దేని నదియుఁ బొలియదెవుడుఁ దా। నెట్టివికారము లొందదు। పట్టదు మఱి యెట్టిజోలి బయలున కెపుడున్॥ ౧౮॥ ఆ-వె॥ తెలివిజగములెల్లఁ దెగినను శేషించి। నిలిచియుండు బయలు నిక్కముగను। నట్టి బయలు దేవుఁ డగుఁగాని నాశమై। పోవు మాయ యాత్మ దేవుఁడగునె॥ ౧౯॥ క॥ అనవుడు నాత్మయె నిజమని। మును జెప్పితి రిప్పుడదియు ముఖ్యము గాదలఁచని చెప్పనేమి కారణ। మని యడిగినఁ గాంతకనియె మార గురుండున్॥ ౨౦॥ ఉ॥ మాయె దలంప నాత్మయును మాయని మున్ను గ నీకుఁజెప్పినన్। మాయ విచార మేల యని మానుదు పద్మదళాక్షి యందుకై। మాయగు నాత్మ నిక్కమని మాటికిఁ జెప్పితి బీఱచిక్కగా। మాయ విడంగఁ బోదనియు మాయ

విచారము౯ జేయకుండిన౯॥ ౨౧॥ చ॥ తనువును జూడఁజూడమును ౯ తథ్య ముగాఁగను దోఁచుఁ దోఁచిన౯। దనుఁ గనుఁగొన్న నాతనువు ౯ తానును గానని తోఁచునంతలో। నెనయఁగ గేవలాత్మమది ౯ నెంచియుఁ గాంచి నతోడ తోడనే। తనువును దాను విశ్వమును ౯ దబ్బరగాఁగను దోఁచు గావున౯॥ ౨౨॥ ఆ-వె॥ ముదితయోనమాలు ౯ మొదటి మెట్టగు గుణిశ। తంబు రెండవదియుఁ ౯ దలఁప లిపుల। నరసి కూర్చి పల్కు ౯ నది మూడవది గ్రంధ। మమరఁ జదువునదియు ౯ నవలిమెట్టు॥ ౨౩॥ తే-గీ॥ అట్లు సాంఖ్యంబు మొదటి మె ౯ ట్టగును దార। కంబు రెండవ మెట్టగుఁ ౯ గాంచఁగ నమ। నస్కమును మూడవదియగు ౯ నచలభావ। మరయు నాలవమెట్టగు ౯ నట్లుగాన॥ ౨౪॥ చ॥ త్రిరముగ నాత్మతత్వమును ౯ దెల్పక మాయఁ గోసిమున్నుగాఁ। బరమపదంబుఁ జెప్పినను ౯ బట్టుట దుర్లభ మెంతవారికి ; న్నిరవుగ నోనమాలుమఱి ౯ నేర్పక మున్నుగఁబెద్ద పుస్తకం। బరుదుగఁ జేతికిచ్చినను ౯ నాతఁడునుం జదువంగనేర్చునే॥ ౨౫॥ ఆ-వె॥ చెట్టు మొదలుఁబట్టి ౯ చివరనుబోయి కూ। ర్చుండు వాని భంగి ౯ సూరిజనుఁడు। నాత్మ తత్వమ నెడు ౯ నావృక్షమును మొదల్। పట్టిపోవు పరమ ౯ పదమునకును॥ ౨౬॥ ఉ॥ చుక్కలలోన నేదొయొక ౯ చుక్కను జూపెడు వాఁడు వానిలోఁ। జుక్కను నొక్కటి న్గొలుతఁ జూపియుదానికి నావలీవల౯। జుక్కల గుర్తుఁజేసి యల ౯ చుక్కనుజూపిన యట్లువేత్తయు౯। బెక్కులు గుర్తుల౯ గనిన ౯ పిమ్మటఁ జూపును గేవలాత్మను౯॥ ౨౭॥ ఆ-వె॥ మొదలు పట్టకుండ ౯ మొనసి శాఖాగ్రాన। కెగసి పోవఁగలరె ౯ యెవ్వరైన। నట్లు మొదలు నాత్మ ౯ నరయక పరిపూర్ణ। భావమొందరాదు ౯ బ్రహ్మకైన॥ ౨౮॥ ఉ॥ ఏటిని దాఁటునంతకును ౯ నేదొక సాధన యుండఁగావలె౯। ఏటిని దాఁటి గట్టునకు ౯ నెక్కిన పిమ్మట నేలసాధనల్। ధాటిగ విశ్వమాయలను ౯ దాఁటియునొ బయలందువానికి। న్నేటికి సాంఖ్యతారకము ౯ లేటికి నా యమనస్కము ద్రలు౯॥ ౨౯॥ చ॥ కరమునఁదాల్చి దీపమును ౯ గామితవస్తువుఁగాంచి యంత సు। స్థిరముగనుండు వానికిని ౯ దీపము నక్కఱలేని చందమా। యెఱుకను వెల్గుచేత బయ ౯ లెంతయుఁగాంచిన వానికావల। న్నెఱుకను దివ్వెతోడనిఁక ౯ నెంతయుఁ గార్యము లేదు చూడఁగ౯॥ ౩౦॥ ఆ-వె॥ బొట్టుఁ బాయఁదంచి ౯ పొసఁగఁదండులములు। సంగ్రహించునట్టి ౯ చందమునను। మాయఁబాయ మాయ ౯ మది విచారించి య। మ్మాయఁ దొఱఁగి యచల ౯ మందవలయు॥ ౩౧॥ క॥ సత్యము నచలమునోట న

సత్యము నిలయూటఁ జేసి * శాస్త్రంబులకుఁ । గృత్యమగు లోకమున
కును। బ్రత్యుత విరోధమచల * భావంబింతే॥ ౩౨॥ ఆ-వె॥ ఇలకు శాస్త్ర
ములకు * నెంత విరుద్ధంబు। నైన నిజముకేమి * హానియేను। శాస్త్రలో
కములకు జడియక బాహాట। ముగను దెలుపు వాఁడఁ * పూర్ణబోధ॥
౩౩॥ క॥ పరిపూర్ణము సేవించుటె। త్థిరముగ జాగ్రతయటంచుఁ * దెలియుము
విశ్వం। బరయుటె స్వప్నము గావునఁ। బరిపూర్ణము గాంచి కలను
బాయుమసీవుఁ॥ ౩౪॥ ఆ-వె॥ బయల నంత మనినఁ * బరిపూర్ణమనినను।
నచలమనినఁ గేవ * లాత్మయనినఁ। బరమ గోప్య మనినఁ * బరమ
పదంబన। బట్టబయలు కాఖ్యఁ * పరఁగుఁజూవె॥ ౩౫॥ చ॥ గరిమఁజరాచరం
బులను * గానిది సర్వము నొక్కటైనదై। మఱుఁగును మాయమర్మ
ములు - మాటలు మోసము లేమిలేనిదై। హరిహర పద్మగర్భులకు *
నందఁగ రానిదియెందునున్నదై। యరయఁ బరా పరంబులకు * నావల
యైనది కేవలాత్మయుఁ॥ ౩౬॥ సీ॥ అన్న పానంబుల * నాచ రింపదు
జగా - లేలపెదుఁడన్ను * నెఱుఁగ దెపుడు। పుట్టదు గిట్టదు * భోగింప
నేరదు * కదలదు మెదలదు * కర్తగాదు। జాగ్రతనొందదు * స్వప్నంబుఁ
జెందదు-నిద్రను బొందదు * నిమిష మేది। సేయదు చూడదు * చెప్పదు
వినదేమి * గూడదు వీడదు * గుర్తుపడదు। బాధలొందదు సుఖముల *
పాలుపడదు। మహిమఁ జూపదుమాయల * మాటు పడదు। అహముఁ
జెందదు సూకేవ * లాత్మబయలు। నాది మధ్యాంతములు లేక * యలరు
చుండు॥ ఉ॥ పూనదుమాన దెందునను * బొందదు చెందదులోకమాయలఁ।
గానదుమ్యానమానములఁ * గఁడదు డిందదు కర్మభంగుల। న్నానదుహాని
వృద్ధులను * నందదు చెందదు సర్వకాలముల్। రానిది పోనిదే బయలు
రాకడ పోకడమాయె సర్వముఁ॥ ౩౭॥ సీ॥ అండాండములు మాయ।
పిండాండములు మాయ - బ్రహ్మాండములు మాయ * బ్రహ్మమాయ।
హరిహరాదులు మాయ - యమరేంద్రుఁడును మాయ-పంచభూతాది
దిక్పతులు మాయ। సూర్య చంద్రులు మాయ * సురలు దైత్యులు
మాయ - తారకాంబుధిగిరి * తరులు మాయజగము లెల్లను మాయ *
జగదీశులును మాయ-సకల జీవులు మాయ * సాక్షి మాయ। యరయ
నవతారములు మాయ * నరులుమాయ। నరక స్వర్గంబులును మాయ * నట
నమాయ। మాయయె యెంచ సర్వంబు * మాయగాని। దచల పరిపూర్ణ
మొక్కటే * యరసిచూడ॥ సీ॥ అచలమా హరిగాదు * అజరుద్రులును
గాదు శబ్దాది భూత పం * చకముగాదు। దిగ్గజంబులుగాదు * దిశా

లకులుగాదు-నరసుర దైత్యావా నరులు గాదు । తరణీందులునుగాదు తారకంబును గాదు-తరులశాదలు పర్వతములు గాదు । గరుడ యక్షులుగాదు గంధర్వులును గాదు సిద్ధ విద్యాధర శ్రేణిగాదు । ఉరగకిన్నర పూరుష యుతముగాదు । శారదా లక్ష్మిగిరిజాది సతులుగాదు । ప్రమథులును గాదు నావిఘ్న పతియుఁ గాదు । పూజలునుగాదు వందనం - బులునుగాదు॥ ౨౦॥ సీ॥ కల్పవృక్షముగాదు కామధేనువు కాదు - హంసపక్షి గరుడఁ డాదిగాదు । ఆది శేషుండుగ దష్టవసులుగాదు - నవరత్న లోహపం చకముగాదు। సప్తదీవులుగాదు సప్తాంబుధులుగాదు సప్తర్షులును గాదు శాంతిగాదు । వరసత్యలోకాది వైకుంఠములుగాదు - కైలాస దేవలోకములుగాదు । వెలయఁగానెల్ల యవతార ములునుగాదు । జగచతుర్దశశక్తి పంచకముగాదు । దేశికులుగాదు శిష్యాది తెగలుగాదు । అంతరముగాదు బాహ్యంబునరయఁగాదు॥ సీ॥ సకలవేదపురాణ శాస్త్రంబులునుగాదు ఘన భాష్యసూత్రాది కములుగాదు । స్మృతియును నితిహాస శ్రుతి సూక్తములుగాదు - దలఁపఁజౌషష్టి విద్యలును గాదు । తెలియనేఁబదియాఱు దేశ భాషలుగాదు - నామరూపాఘ పుణ్యములు గాదు । నళసాంఖ్య తారక లమనస్కమునుగాదు-ముద్రయోగవిశేష ములును గాదు। స్నాన సంధ్యాదులును గాదు జపముగాదు । సప్తకోటి మహామంత్ర చయము గాదు । తపము నుపవాసవిధి నిషేధములు గాదు । జ్ఞానకర్మంబులునుగాదు సారసాక్షి॥ ౨౧॥ సీ॥ వెలియు వెల్గునుగాదు చీఁకటియునుగాదు - అరయ నూళ్లునుగాదు అడవిగాదు । అంతరంగము గాదు । ఆశ్రమంబులుగాదు-అనువొందు కృష్ణాజి నాదిగాదు । మహానీయ దండక మండలంబులు గాదు-కాషాయవస్త్ర సంగతులుగాదు। ఆసనంబులు గాదు అభ్యాసములు గాదు-రుద్రాక్షతులసి పేరులును గాదు । ఒనరఁడలలను జోడిసేయుటయుఁగాదు । సొరిదిగడ్డంబు జడలుఁబెంచు టయుఁగాదు । నామమును భూతియుఁదాల్చు నటనగాదు । కట్టుటయుఁగాదు నగ్నయుఁ గాదు బయలు॥ సీ॥ పరఁగజుల్కనగాదు భారంబు గాదు శీ-తోష్ణ కఠినమృదు లొనరఁగాదు । షడ్రసంబులు గాదు సద్గంధములు గాదు - షడ్వర్ణ కలిత సం చయముగాదు। పురుషుఁడు స్త్రీయును పుంసకంబును గాదు - జడముగాదదియు న జడముగాదు । వర బాల్యయౌవన వార్ధకంబులుగాదు - పరికింపదీర్ఘ కుబ్జములుగాదు । ప్రాణమునుగాదు అచలంబు బ్రతుకుగాదు । భంగము

నుగాదు నిశిగాదు ఽ పవలుగాదు । వార తిథి పక్ష మాస ఋతుఽవయన వత్స । రములు యుగ కల్పకల్పాంత ఽ రములుగాదు॥ సీ॥ మెలఁత ధర్మా ధర్మ ఽ ములును వేద్యావేద్య-ములును జోద్యాచోద్య ఽ ములునుగాదు। తలఁప సత్యాసత్య ఽ ములును నిత్యానిత్య - ములును ఖండాఖండఽములు నుగాదు । కలయ సాధ్యాసాధ్య ఽ ములు చలాచల నిరా - కారసాకా రాది ఽ గతులుగాదు । ఎలమి లోకాలోకఽములును గాలాకాల-ములును భావాభావ ఽ ములునుగాదు॥ తే-గీ॥ గోపురములు గాదారయ గుళ్లు గాదు । పరఁగ విగ్రహములు గాదు ఽ భక్తిగాదు । దానములుగాదుతీర్థ యా ఽ త్రలును గాదు । యాగములు నాదిగాదు సూ ఽ యచలమెన్న॥ ౭౫॥ తే-గీ॥ అఖిలమునుగాదు సర్వ శూ ఽ న్యంబుగాదు । దలంపఁగన్ను లకెదుటఁ బ్ర ఽ త్యక్షముగను । జూడఁ గనుపించు నదియెట్లు ఽ శూన్య మగును । లేని దరయంగ మాయయే ఽ లేదుగాక॥ ౭౬॥ శా॥ ఫాలాక్షా మర విష్ణుపద్మజులకున్ ఽ బ్రత్యక్ష దైవంబునై । కాలాకాలము లేవిలేక బయలై ఽ గన్పించు నా బ్రహ్మమున్ భావింపన్ బవనాంబుపర్ణ ఫల ముల్ ఽ భక్షించుచున్ యోగులై । చాలాకాలము కానలందుఁ దప ముల్ । సాధించరేగానకన్॥ ౭౭॥ తే-గీ॥ ఎందాఁగలదు సూబయలంచుఽ నెంచఁబోకు । పంచభూతాదిసర్వ ప్రఽపంచయుతము । నీవునేనునుగా కను ఽ నిల్చినదియె । బయలు ప్రత్యక్షమగు బట్ట ఽ బయలుచూవె॥ ౭౮॥ ఆ-వె॥ నీకుముందువెనుక ఽ నిరుపార్శ్వములయందుఁ। జాలుమూలలాదిఽ సర్వదిశల । దాపుదవ్వులందుఽలోపల వెలుపలఁ। గ్రిందమీఁదఁ గలరుఽ కేవలాత్మ॥ ౭౯॥ క॥ ఒరగదు పెరుగదు విఱుగదు । తఱగదు మర్మంబు గాదు ఽ దాఁగదదెందున్ । జరుగదెఱుఁగదు మొఱఁగదు।పరిపూర్ణం బదిగొచూడు ఽ ప్రత్యక్షముగన్॥ ౮౦॥ తే॥ పుట్టిగిట్టెడు మాయలఁఽ బట్టువడదు । అదియందదిందు నం ఽ దనఁగరాదు । సర్వపరిపూర్ణమై యెందు ఽ సందులేక । నిండియున్నది పరికింప ఽ నేమిగాదు॥ ౮౧॥ క॥ ఖండాఖండములగుచును । నుండినదేమాయమాయె ఽ హుళ్ళిక్కియగున్ ఖండాఖండములొందక । యుండినదే బయలటంచు ఽ నూహింపంగన్॥ ౮౨॥ ఆ-వె॥ తలఁపబేరులేని ఽ దానికి బయలని । పేరుమాయపుట్టి ఽ పెట్టె నట్టిబట్టబయలు గన్న ఽ భ్రమరూప మైనట్టిమాయ వాసిపోవుఽ మధురవాణి॥ ౮౩॥ క॥ చూచితి మందురు కొందఱు । చూచినదేమియును లేదు ఽ శూన్యంబునఁ దాఁ।జూచిన తోఁచినదృష్టిక । గోచరమైపోవు తానె ఽ కానఁగనులేకన్॥ ౮౪॥ తే-గీ॥ తాను బ్రహ్మంబుగనఁబోవఁ ఽ

దానె లేదు । బ్రహ్మమేఁ గంటినంచు । బల్కు టెట్లు । సూర్యబింబముం బొడఁగన్న / శూన్యమైన । చీఁకటేదింక రవిజాడఁ / జెప్పుటకును॥ ౫౫॥ క॥ ఉన్నదియున్నది బయలని । యున్నధిపలుమాఱులెఱుకె / యూయుచ లంబుగ్ । గన్నది లేకయెపోయె । న్నున్నయచలమెఱుఁగ నేమి / యున్నది యింకన్ ౫౬॥ ఆ-వె॥ ఏమి లేని దాని / నే నెట్టు లెఱిఁగింతు । నీవు నెఱుఁగు టెట్లు / నిక్కముగను । నున్న దేమిగాక / యున్న దేయున్నది । లేనిమాయ లేనె / లేదెపుడును॥ ౫౭॥ క॥ తోఁచినదిగాదు సర్వముఁ ॥ జూచిన దియుఁ గాదుసర్వ / శూన్యముగాఁదాఁ । దోఁచినదెల్లనుమాయే । చూచినదియుమాయె బయలుఁ / జూడఁగ వశమే॥ తే-గీ॥ బట్టబయలందుఁదోఁచు ప్రపంచమెల్ల । లేకగనుపించుఁబరికింప / లేకపోవు । నెండమావులఁదోఁచెడు / నీళ్ళకరణి । వెదకిచూచిన లేకుండు / విధముగాను॥ ౫౮॥ క॥ బ్రమచేతఁదోఁచు సర్వము । భ్రమచేతనె లేకపోవు / భ్రమయేగాంచున్ । భ్రమలేని వారి కెప్పుడు । భ్రమదోఁచద దెందు బట్ట / బయలున కంటెన్॥ ౫౯॥ ఆ-వె॥ భ్రమయనంగ భ్రాంతి / భ్రాంతి యన్ననుమాయ । మాయ యనఁగ స్వప్న మగుఁదలంప । స్వప్నమందెనిద్ర / జాగ్రత కలలాదిఁ । బొందు చెందు లేక / పోవుభ్రాంతి॥ ౬౦॥ క॥ మాయయె లోకము లెల్లను । మాయెపుట్టించుఁ బెంచుమాయేద్రుంచున్ । మాయే భ్రమయుచు నుండును । మాయే కొన కేమి లేక / మటుమాయ మగున్॥ ౬౧॥ ఆ-వె॥ సర్వసాక్షిద్రష్ట / చైతన్యమనఁబర । మాత్మయెఱుకపరసు / హంసయన్న / నాత్మజ్యోతిమాయ / హంకార మన్నను । నొక్కటంచుఁ గనుము / యుత్తలాక్షి॥ ౬౨॥ క॥ అంతర బాహ్యము కల్పిత । మంతయుఁ బరిపూర్ణ మనుచు । నచలంబనుచున్ । సంతసము నెఱుఁగఁబడుధీ । మంతులకును లేదు లేని / మాయదలంపన్॥ ౬౩॥ ఆ-వె॥ ఆత్మకంటె మాయ / యవనిలో నేదింక । వేఱుగలుగ దాత్మ / విశ్వమునకు । విశ్వమెల్లమాయ / వెదకి చూడఁగ లేని । దాత్మ గానమాయ / యనఁగవలసె॥ ౬౪॥ చ॥ జననమునామరూపములు / జాతియు నీతియుఁ బాపపుణ్యముల్ । ఘనమునునీచముల్ లయము / కష్టసుఖంబులు బంధమోక్షముల్ । మనమును నింద్రియంబులును / మానసము న్ధ్యానము మంచి చెడ్డలున్ । గనుఁగొన గేవలాత్మకును / గల్గవు సర్వము మాయకేదగున్॥ ౬౫॥ సీ॥ ఈయుత్త బట్టబై / యెప్పుడు నొక భంగి నున్నది గానివే / యొక్కవిధము । గాదింతకును ముందు / గా నేర దిప్పుడు-గాఁ బోవదికమీఁదఁ / గా దెవుడును । సర్వకాలములందు / సర్వదేశములందు-సర్వవస్తువులందు / సందు లేక । సర్వ

సంపూర్ణమై చలన మించుక లేక - పరిపూర్ణమేకమై పరంగునేండు॥ తే-గీ॥ జలచరానీకములవెన్ని జలధియందుఁ। బుట్టిగిట్టిన నెఱుఁగనిఁ బోల్కిఁగాను। నెండమావుల రీతిని నుండు నగము। లెల్లనుండినఁ బోయిన నెఱుఁగకుండు॥౧౭॥ క॥ పుట్టినమాయేమాయను। బుట్టించును గాని మాయఁ బుట్టును గిట్టుల్। ఎట్టివొ యెఱుఁగని యాబయు। లెట్టులఁ బుట్టించు భ్రాంతి నెఱుక జగంబుల్॥౧౮॥ సీ॥ సత్యంబునందున సత్యమే పుట్టు న-సత్యమే గతిఁబుట్టు సత్యమందు।।నరులకు నరులునేఁ కరులకుఁ గరులునే - ఘోటకాదులకును ఘోటకములె। సారమేయములకు సారమేయంబులే - కీట కాదులకును గీటకములె। యేజాతి పక్షుల కాజాతిపక్షులే - యొకజాతి యందు వే ఱొక్కజాతి॥ తే-గీ॥ పుట్టకేజాతి కాజాతె పుట్టుచుండ। సత్యమగు బట్టబయుట నసత్యమైన। జగము లేరీతిఁ బుట్టును సర్వజగము। కలయ మేల్కనిచూడ నొకక్కటి యులేదు॥ ౧౯॥ ఆ-వె॥ తోలునొల జనులు తాలుమాటలుఁదోచి। పలుకుటింతెగాక భ్రాంతులగుచు। బ్రహ్మమెఱుఁగలేక బహురీతు లెంతురు। గజము నంధకులును గన్నయట్లు॥ ౨౦॥ వ॥ అది యెట్లంటేని వినుము॥ సీ॥ నలువు రంధకులొక్క స్థలమునఁ గూర్చుండి-కరిఁజూడఁ గోరినఁ గరుణ నొకఁడు। గజముఁ దెచ్చియునిల్పఁ గాలు తొండము తోఁక - చెవులొక్కొక టొకండు చేతఁదడవి। వారణంబును రోటి వలెనున్న దనెనొకం-డొకఁడు రోకలిభాతి నున్నదనియు। నొకఁడు చీఁపురు భంగినున్నదని వచించె-నొకఁడు చేటను బోలియున్నదనియె॥ ఆ-వె॥ మించియొకరి నొకరు మెచ్చక నల్వురు। నైరి నాల్గు దెఱవు లట్టి విధము। నిక్కమైన బ్రహ్మమొక్కఁడు నెఱుఁగక। పరిగణింత్రు వేఱు పద్దతులను॥ ౨౧॥ క॥ కమఠాకృతి నిలఁగొండఱు। తమ కపటముఁ దెలియనీక తగనచలంబుల్। దమరెఱిఁగిన క్రియ సాధుల।క్రమమున లోకులకుఁ జూడఁగనిపింతురొగిన్॥ ౨౨॥ ఆ-వె॥ ఎఱుక పుట్టకయును నెట్లన్నవినునారి। కేళమందుఁ జేరు నీళులట్టు। లెఱుక నాశమరయ నేనుఁగుమ్రింగిన। వెలఁగపండు గుజ్జు విధము దెలియ॥ ౨౩॥ క॥ బయలన్నది బయలగునా। బయలను భావంబునెపుడు బ్రహ్మంబగునా। బయలనియెడి పల్కగునా। బయలను గుర్తెపుడుఁగాదు పరమపదంబుల్॥ ౨౪॥ తే-గీ॥ ఏమియును లేని మాయయే యెఱుక జగము। లెఱుకకె యెఱుక గనుపించు నిహాపరంబు। లెఱుకయే సర్వమును గుర్తు నెఱుఁగు మఱచు। నెఱుకయే లేకపోవుఁదా నెన్నఁడుడకు॥

౨౫॥ క॥ పరిపూర్ణంబును నెఱుకను । నెఱుకే గుఱ్తెఱుఁగు నెఱుక నెఱుఁ
గదు బయలు । న్నెఱుకే పరిపూర్ణముగని । యెఱుకే స్మృపయంచు నెఱుకే
కెఱుకేమాయుర్ ॥ ౨౬॥ తే-గీ॥ ఎన్ని త్రిప్పల నొందిన నెఱుకెగాని య
చలమే త్రిప్పల నెఱుఁగ దరసిచూడ । భ్రాంతిమూలమై యెఱుకయే
పరఁగునట్టి । యెఱుకయే భ్రాంతిశూన్యమై యొగుఁ దరుణి॥ ౨౭॥ చ॥
గరిమను బూర్ణతత్వమును గాంచిన యట్టి మహాత్ము లెంతయు । న్నెఱు
కను లేనిదంచు వచియించిరి గావునఁ గేవలాత్మనుర్ । బరువడిఁ గాంచి
నీవెఱుకఁ బాయుము లేనిదియంచు నెప్పుడుర్ । మరలను భ్రాంతిపుట్ట
దను మానము లేదిఁక మానినీమణీ॥ ౨౮॥ క॥ ఉన్నదియిదియున్నది
యిది । యున్నది యిదియనుచు నెఱిఁగి యుత్తదియెఱుకే । యున్నది
తాఁగన్నది మది । నెన్నఁగనది లేదు లేని దెఱుకయెసుమీ॥ ౨౯॥ క॥
మాయ బయలందుఁ గలదని । తోయజదళనేత్రనీకుఁ దోఁచుచు నున్నర్ ।
బాయక నీవిప్పుడునా । మాయను చూపింపవలదె మఱిబయలందుర్॥
౩౦॥ ఆ-వె॥ ఎండమావులందు నుండునే యుదకంబు । లేక తోఁచు
నట్లు లోకములును । మాయకే స్వభావమైగానుపించును । గాక
నిక్కముగను గలదె మాయ॥ ౩౧॥ క॥ ఉన్నది మాయయని గనిన । నున్న
దికలగన్న వాని యెప్పనఁగలమే । ల్కొన్నగతి బయలుగాంచిన ॥
యున్న దనకు మాయగల్ల దంబుజ వదనా॥ ౩౨॥ ఆ-వె॥ అనుభవంబుఁ
గంటి । మందు రీభువిఁ గొంద । అనుభవంబు గలదె । యచలమందు ।
ననుభవంబు శూన్యమైపోవునిద్రను । నలిచియుండవలదె నిక్కమైన॥
౩౩॥ ఉ॥ తానుశరీరము నొక్కటిగ తథ్యము నమ్మిన వచ్చు దేహముర్ ।
గాన నవశ్యమీ బయలు గాంచియు జాగ్రతనొంది స్వప్నముర్ । మానియుఁ
దాను దేహములు మాయయటంచుఁ దలంచునట్టియా । మానవుఁడెన్ని
కల్పములు । మాఱినఁ బుట్టునె యీజగంబునర్ ॥ ౩౪॥ ఆ-వె॥ మాయదోఁ
చుచుండు మానవునకు భ్రాంతి । స్వప్నమగును గాని జాగ్రతగునె ।
బయలు గాంచి మాయఁ బాయంగఁ ద్రోచిన । ఘనుఁడె జాగ్రతయును ।
గన్నవాఁడు॥ ౩౫॥ క॥ తెలివిని నమ్మియు నచలముఁ । దెలియక పామ
రులు మాయఁ దేలి మునుఁగుచుర్ । దెలియరు సర్వము నెఱిఁగెడు । తెలివే
మాయయనుచీవు దెలియుము యన్లే॥ ౩౬॥ ఆ-వె॥ రమణివినుము
తెలివి రాకపోకల చేత । దినము రాత్రికరణిఁ దిరుగుచుండు । నట్టి తె
లివిచేత । నచలంబు నర్సించి । యట్టి తెలివిఁ వీడ నచలుఁడగును॥ ౩౭॥
క॥ సరసీజాక్షుఁడు చీఁకటి । నెఱుఁగక భాసిల్లునట్లు నిక్కంబుగనో ।

తరుణీమణిమెన్నఁటికినిఁ। బరిపూర్ణంబెఱుఁగదీ ప్రపంచముచూడన్ ॥౮౮।
ఆ-వె॥ స్వప్నమందుఁ గన్న ౼ స్వానుభవంబెల్ల। మేల్కాంచిచూడ ౼ జాలనట్లు। జగము పుట్టి పెఱిగి ౼ సమయుటలెల్లను। నేమి లేదువట్టి ౼ దెల్ల భ్రాంతి॥ ౮౯॥ క॥ జీవుఁడె భ్రాంతికి బనుచును। భావించిన లేని మాయ ౼ బ్రహ్మంబగునే। జీవుఁడె భ్రాంతికి మూలము। భావింపఁగ బ్రహ్మము నకు ౼ భ్రాంతియుఁగలదే॥ ౯౦॥ ఆ-వె॥ బయలుగానలేక ౼ బహుజన్మముల నెత్తిగట్టికుడుచు చుండు ౼ కర్మఫలము। తనదు జన్మకర్మ ౼ తాను బాయఁగ లేని। జీవుడెట్లు తమకు ౼ దేవుఁడయ్యె॥ ౯౧॥ క॥ శివుఁడే తనువుకు మూలము। శివుఁ డేగినఁ దనువుకల్లె ౼ జీవుండిల్లే। శివుఁడెట్లు బ్రహ్మమనఁదగు। భవనాశము లేని బయలె ౼ బ్రహ్మముగాకన్॥ ౯౨॥
ఆ-వె॥ బయలు గగనమంచుఁ ౼ బామరుల్ కొందఱు। పల్కుచుందు రట్లు ౼ భ్రాంతిపడకు। చదలుబయలుగాదు ౼ శబ్దమేగుణము ని। శ్శబ్దమగును సార ౼ సాక్షి బయలు॥ ౯౩॥ క॥ బయలందెపుట్టు సర్వము। బయలందే యడఁగునంచుఁ ౼ బల్కుదురజ్ఞుల్। బయలందుఁబుట్టిగిట్టిన బయలే పెను మాయ యనఁగఁ ౼ బడునటుగానన్॥ ౯౪॥ ఆ-వె॥ పుట్టుగిట్టు లేని ౼ బట్టబైలందునఁ। బుట్టుటెట్లుమాయ ౼ గిట్టుటెట్లు। మాయ వచ్చినట్లు ౼ మగుడిఁ బోయినయట్లు। దోఁచుటెల్ల భ్రాంతి ౼ తోయజాక్షి॥ ౯౫॥ క॥ అనవుడు జగములు నిజముగఁగనుపడుచుండంగ నెట్లు ౼ కల్లని యెంతున్। వనజాక్షనాదుసందియ। మును దీర్చు మటన్నసతికి ౼ ముక్తుఁడనియెన్॥ ౯౬॥ ఆ-వె॥ కలయ స్వప్నమందు ౼ గజములు గుఱ్ఱాలు। రథములొంటె లధిక ౼ రథికవరులు। సేనలెన్నరాని ౼ సేనాధిపతులును। నెట్లుదోఁచె మేల్కనెట్లుపోయె॥ ౯౭॥ చ॥ సరసిజనేత్ర యాశశివి ౼ షాణము చొప్పున రజ్జుసర్పమా। కరణిసిఁ గొయ్యతస్కరుని ౼ కైవడివంధ్యత నూజు చాడ్పునన్। దిరముగ శుక్తిరౌప్యమగు ౼ తీరున నామృగతృష్ణ నీరుగాఁ। బొరిఁబొరియేమిలేనిపరి ౼ పూర్ణమునందునఁ దోఁచువిశ్వమున్॥ ౯౮॥ ఆ-వె॥ నెలఁత వినుము నభము ౼ నీలమైగాన్పించు। పోల్కినరయ గగన ౼ పుష్పమట్లు। స్వప్న సానుభవము ౼ చందంబు మఱియు నా। యింద్ర జాలముగను ౼ నిలయుఁదోఁచు॥ ౯౯॥ క॥ కనుపడుసర్వము భ్రమయే। గనుఁగొన్నది భ్రమయెగాని ౼ గాదచలంబున్। గనుపడునది గనుఁగొన్నది। గనుఁగొనగాలేనిదంచుఁ। గాంచుమునీవున్ ౧౦౦॥
ఆ-వె॥ లేనిమాయఁజూచి ౼ లేదనఁడగుగాని। యచలమెపుడు లేదనంగఁడగదు। బయలుచూడ నెందుఁ ౼ బ్రత్యక్షమైయుండుఁ। గానిమాయ

చూడఁ గానఁబడునె॥ ౧౦౧॥ క॥ ఇక్కడనక్కడఁదోఁచియు। నెక్కడఁ
గనరాదు మాయ నిక్కంబైనన్ । నిక్కడ నక్కడ నెక్కడ । నొక్క
టిదై యచలమట్టు లుండఁగవలదే॥ ౧౦౨॥ ఆ-వె॥ వట్టి రజ్జుఁ జూచి
బిట్టులుక్కుటేగాని । పరఁగఁ ద్రాటియందుఁ బాముగలదె । భ్రమసిలేని
పోని భ్రాంతి నొందుటెగాని । తలఁప నచలమందు నిలయుఁగలదె॥
౧౦౩॥ క॥ దారునదాటునఁజూచియుఁ । జోరుండని భ్రమసితిరిగి చూచిన
నదియున్ । దారువగునట్టు లచలము । నారయఁగా లేనిమాయ యగు
పడ దెందున్॥ ౧౦౪॥ ఆ-వె॥ మరుమరీచికలను మంచి జలంబని పోయి
చూడలేక పోవునట్లు । భ్రాంతిచేతఁదోఁచఁబడువిశ్వమెల్లను । నరయ
లేకపోవు నచలమందు॥ ౧౦౫॥ క॥ కమలాక్షి శుక్తిరజిత । భ్రమఁ
జెందినశుక్తియందు రౌప్యంబేదా । క్రమమున లేకయ దోఁచిన। భ్రమ
జగములులేవుబట్ట బయలున నెపుడున్॥ ౧౦౬॥ ఆ-వె॥ నెమ్మిశశకము
నకుఁ గొమ్ములున్నవే । గొడ్డురాలునకును బిడ్డగలదె । నాకసమునఁ
బుష్ప మమరంగ నుండునే । వట్టిదేమిలేని బట్టబయలు॥ ౧౦౭॥ చ॥
ఘనముగ స్వప్నమందునను గాంచినవెల్లను నిక్కమట్లుగాఁ । గనుపడు
చుండుజాగ్రతను గాంచినయెంతనె స్వప్నమంతనన్ । దనుఁగనుఁగొన్న
సర్వమును దబ్బరలై జనునట్టులాబయల్ । గనుగొని మేల్కనొంది
నను గన్పడుటెట్లిఁకస్వప్నలోకముల్॥ ౧౦౮॥ ఆ-వె॥ జగములెల్ల
నిజమె జాగ్రతయందున । స్వప్నమందుఁ గొంత సత్యమయ్యె।నిద్ర
యందు మునిఁగె లయునుదానును । నింకనేమిగలదు నీరజాక్షి॥
౧౦౯॥ క॥ మెలఁకువె జాగ్రత యనినను । గలయందున జాగ్రతయును
గలదెట్లనినన్ । గలయందు నెఱుకలేకయె । కలవిధమును జెప్పగలదె
గాఢసుషుప్తిన్॥ ౧౧౦॥ ఆ-వె॥ జగమె సత్యమంచు జాగ్రత దెల్పెను।
నిలయుస్వప్నమంచుఁ గలయుఁదెల్పె । మెలఁకువయును గలయు మిథ్య
యంచును నిద్రఁ । దెల్పెనింక మాయ దెలియనేది॥ ౧౧౧॥ క॥ మెలఁ
కువ నిక్కంబై నను । గలయును నిక్కంబెగాని కల్లనఁదగునే । మెలఁకు
వఁగని కలమిథ్యన । మెలఁకువయును సుప్తియందు మిథ్యయగాదే॥
౧౧౨॥ ఆ-వె॥ ఎన్నజాగరమున నున్నంతవఱకును । సత్యముగను
దోఁచు జాగరంబె । కలనుగాంచుతఱినిఁ గలనిక్కమై తోఁచుఁ ।
గానజాగ్రతయును గలయునొకటె॥ ౧౧౩॥ క॥ మెలఁకువనుండునుజ్ఞ
ప్తియుఁ । గలయందున జ్ఞప్తిగలదు గావునమేల్కన్ । గలయొక్కటి
గాకున్నను । గలయును జాగ్రతయునునేది గాఢసుషుప్తిన్॥ ౧౧౪॥

ఆ-వె॥ నీవు నన్నుఁ గనుట / నేను నిన్ను గాంచుట । నేను జెప్పుటయును / నీవు వినుట । నీవు నేను జగము / నిఖిలంబు కలయని । దెలియు బట్టబయలు / కలయుఁగాదు॥ ౧౧౫॥ సీ॥ ఇలలోనఁ దిరిపంబు / నెత్తి జీవించెడు-నెటి పేదయొకచోట / నిమ్మ్రలించియుంగడ కోటీ రమహాది భూషాంబర-తతు లెల్లఁ దనమేనఁ / దాల్చినట్లు । గొమరైన నొకకొల్వు / కూటంబులో రత్న-సింహాసనమున వసింపించినట్లు । హితులు మంత్రులు పురోహితులు సేనాధిప-వందిమాగధభట / వర్గమన్య । రాజు లెల్లను సేవింపఁ / రాజ్యమెల్ల । నేలినట్లుగఁ గలఁగాంచి / మేలుకొనినఁ । గల్లయయ్యెను రాజ్యంబు / కొల్లవోయె । రక్ష లేదాయె నెప్పటి / బిక్షగాఁడె॥ ౧౧౬॥ క॥ కలలోఁ దోఁచిన సర్వము । మెలఁకువయందు నను చూడ / మిథ్యయగునటుల్। మెలఁకువను బయలుఁ గాంచినఁ । గల జగములు లేకపోవుఁ / గనుఁగొను చుండఁగ॥ ౧౧౭॥ ఆ-వె॥ పోదు బట్టబయయి / పోఁగొట్ట వలెనన్న । రాద దిందునందు / రాఁ దలంప । బహుళ యత్నముననును । బ్రహ్మాదులును బట్టి । నిల్పవలెనటన్న / నిలదు మాయ॥ ౧౧౮॥ క॥ సర్వము గుర్తెఱుఁగుదునని। గర్వంబునఁ గేవలాత్మఁ / గాన కలయునా । సర్వజ్ఞకంటె మేలగు । సర్వము గుర్తెఱుఁగనట్టి / శ్వానంబరయన్॥ ౧౧౯॥ తే-గీ॥ ఉన్నదీ బట్టబయలు ను-న్మోన్నఁటికిని । నున్న దనరాదు మాయయు / నున్నగాన । జగము లెల్లను దోఁచుట / స్వప్నభాతి । నెన్నివిధములఁ జూచిన / నేమి లేదు॥ ౧౨౦॥ చ॥ తడయక దారుగుర్తెఱుఁగఁ / దస్కర భ్రాంతియు లేనిచొప్పునన్ । విడువక శుక్తిఁ గన్గొనిన-వెంటనె రౌప్యము లేని పోలికన్ । దొడరిన రజ్జు నారసినఁ / దోడనె సర్పము లేని చాడ్పునన్ । గడువడిఁ బూర్ణ తత్వమును / గాంచినయంతనె లేదు విశ్వమున్॥ ౧౨౧॥ తే॥ బట్టబయలందు జగమును / పుట్టు గిట్టు ననుటకంటెను లేదంట / ఘనము వంధ్య । సతికి సుతుఁడును నుదయించి / చచ్చిపోయె । ననుటకంటెను బుట్టలే / దనుటె మేలు॥ ౧౨౨॥ క॥ జలజాక్షి లేని మాయను । గలదని పిమ్మటను లేదు / కల్లను టెల్లన్ । బలువుగ మేనన మేధ్యము । నలఁదియు నది గడిగికొన్న / యట్టివిధంబగున్॥ ౧౨౩॥ ఆ-వె॥ కానలేని మాయ / కలయని దలపోయఁ । గలయటన్న మాయ / దొలఁగిపోయె । మాయ శూన్యమైన / మఱి యేమి లేదాయె । నేమి లేని బయలె / యేకమాయె॥ ౧౨౪॥ క॥ మెలఁకువనొందిన వెంటనే । కలనిలువక పోయినట్లు / గనుపడు మాయల్ । నిలుచునె యచలముఁ గాంచిన । మెలఁకువయును నిద్రభంగి / మిథ్యయయిచనున్॥ ౧౨౫॥ ఆ-వె॥ ఎన్న లేని మాయ / మెఱు

కఁ బాసిన మీఁద నున్న బట్టబయలు నెన్నుటకును। నెఱుకలేక పోయె నేమున్న దామీఁదఁ। దోఁచుచుండుటకును జూజటకును॥ ౧౨౬॥ ఉ॥ ఆరయ విశ్వమీ బయలు నందునఁ దోఁచుచు నుండ లేని దే యూరక లేని భ్రాంతియును నుండినకై వడి నుండు టే మునన్। దారువునందుఁ దస్కరుఁడు ద్రాటి సెఁబన్నగ న్నుండ మావులన్। వారివిధంబు గన్పడుట వానికి నెన్న స్వభావ జన్యమా॥ ౧౨౭॥ క॥ పరిపూర్ణంబే శాశ్వత। మరయంగా లేనిమాయ యఖిల జగంబుల్। పరిపూర్ణమందుఁ దోఁచినఁ। బరికింపఁగ వలయు లేని భ్రమయది యనుచున్॥ ౧౨౮॥ సీ॥ పంచముద్రలు పట్టి బాధలుపడ నేల యష్టాంగయోగంబు లవియు నేల। సాంఖ్యతారకములసాధింపఁగా నేల యమనస్కభావంబు నంద నేల। పరఁగ నెమ్మనము బట్టి నిల్పఁగ నేల - యింద్రియాదుల గుది యింప నేల। శాంతసూనృతములఁ జరియింపఁగా నేల-చదువులెల్లను మించి చదువ నేల॥ తే-గీ॥ చీఁకుఁబడి కానఁ దపములఁ జేయ నేల। సంతతంబును జపములు సల్ప నేల। కనులు మూసినఁ దెఱచినఁ గానఁబడుచు। నచలమే సాధనము లేక యలరుచుండ॥ ౧౨౯॥ సీ॥ బూటకవేషముల్ పొట్టకూటికెగాని-పొందుగా ముక్తికె-ప్పుడును గావు। ముద్రలన్నియు దేహమున కవస్థకె గాని-మొనయ జన్మవినాశమునకు గావు। అఖిలయోగంబులు నలజడికేగాని - గర్మరాహిత్య సంగతికిఁ గావు। బహు మహాత్యంబులు। ప్రజల మెప్పుకెగాని - యారయ జన్మశూన్యతకుఁ గావు॥ సాంఖ్యమును దారకామనస్కంబులాది। త్రిప్పలకుఁ గాని జన్మ సిద్ధికినిఁ గావు। మొదలు కర్మలు భవనాశములకెగాని। కోరితమ్మును దరియించు కొఱకుఁ గావు॥ ౧౩౦॥ తే-గీ॥ అవని బూరుగు ఫలముల కాశఁ జేసి। పక్షులను గాచి నిష్ఫలం బందినట్లు। నిజముఁ గానక బహుమాయ నిష్ఠలందు। బరఁగుచుండుట నిష్ఫలం బగును గాదె॥ ౧౩౧॥ క॥ అనలంబె గాని నిఖిలంబును నెద్దిదహింప లేని పోలికమాయన్। జనఁ జేయ నచలభావంబును గాక యన్యమొకటి పుడమిం గలదే॥ ౧౩౨॥ క॥ నేననను నహాము వహించిన। మానవులకు నెల్ల నిక్క మై తోఁచు నిలన్। నేనను నహామే మాయగఁ। గానెడు వాఁడెల్ల మిథ్య గా భావించున్॥ ౧౩౩॥ క॥ నీవును నేనే లోకము। నీవును నే లేక యున్న నిర్లోకమగున్। గావున లేకయ దోఁచివ। యీవున నే లేదు సుమ్మి యీ బయలందున్॥ ౧౩౪॥ ఆ-వె॥ నీవు నేననియెడు నీ విశ్వమాయను। లేనిదంచు భ్రాంతి మానినపుడె। ప్రతియు లేనిబట్ట బయలన్న నేకమై। యుండు దాని నెఱుఁ

గక నొందుతేక॥ ౧౩౫॥ క॥ సర్వము తానని చూచిన । సర్వంబును దన
నుఁదా నె క సత్యంబగు నా । సర్వంబు తాను మిథ్యయె । సర్వంబును
గానిబయలు క జాడనుగనినన్॥ ౧౩౬॥ ఎ॥ ఆ-వె॥ ఎప్పుడైనఁ జూచి క
యెఱుఁగకయుండిన । హారినిఁగలనుగాంచిక హస్తిమిడియు । కరణినెఱుక
యనెడు క కలలోన నచలంబుఁ । గన్నయపుడె మాయకగతముఁ బొందు॥
౧౩౬॥బి క॥ తోయజ మిత్రునిఁ బొడఁగని । యే యెడలన్ లేకతిమిర క
మేగినయటుల క న్నాయచలము సేవించిన । మాయే తా నిల్వకేగు క
మటుమాయముగన్॥ ౧౩౬సి॥ తే-గీ॥ అన్నమునుదిన్న నాకఁలిక యడఁగి
నట్లు । తృష్ణ యుదకంబుఁ గ్రోలినఁ క దీఱుభంగి । బయలుఁ జూపించి
శిష్యుని క భ్రాంతి మాన్పు । గురుఁడె దైవంబు పరుఁడు నా క గురుఁడె
గురుఁడు॥ ౧౩౬'డి॥క॥ పరిపరి మాయలచేతను। బరిపూర్ణంబెఱుఁగ లేకక
భ్రమగొనితా మే । దరియింపలేని గురువులు । పరులను గడ తేర్చఁగలరె
భ్రాంతియగాకన్॥ ౧౩౬॥ ఇ॥ ఆ-వె॥ గురుఁడు శిష్యునకును క గుర్తుగాఁ
గనుపించి । బయలు బ్రహ్మమంచుఁకబరఁగఁజూపి।మాయశూన్యమైన క
మార్గంబుఁదెల్పక । భ్రాంతివీడగలదెక బ్రహ్మకైన॥౧౩౩॥ క॥ బట్టబయ
లనుచు బ్రహ్మము । గుట్టెఱిఁగిన వాఁడె గురుఁడు క గురువులకెల్ల। న్నట్టి
ఘన మర్మమెఱుఁగక । పొట్టకునై దిరుగువాఁడు క భువి గురుఁడగునే॥
౧౩౮॥ ఆ-వె॥ కేవలాత్మ గుర్తుకభావింపవేత్తకు । నిలయఁటన్న గుర్తు క
నేమిలేదు । మాయ జనులకెల్లక మాయ విశ్వమె గుర్తు । కోరి చూడ
బయలు క గుర్తులేదు॥ ౧౩౯॥ క॥ గురుఁడని శిష్యుండని యీ । యెఱు
కను గలదోఁచి యచలక మెఱిఁగించి తుద। న్నెఱుకను దెరఁ దొలఁగించిన
గురుఁడేడి శిష్యుడేడిక గుర్తెదింకన్॥ ౧౪౦॥ తే-గీ॥ బట్టబయలందు గురు
శిష్యకభావములును । నేకమైనను గురుశిష్య క లెవరులేరు । కర్పూరా
గ్నులు వేర్వేఱఁగానుపించి । యేకమై రెండులేక లయించినట్లు॥ ౧౪౧॥
క॥ అనలంబు వొడమి దారునఁ । దనరంగా దానిఁగాల్చి క తాఁ జెడిన
గతిన్ । దనువందు జ్ఞానవహ్నియుఁ । దనువును దగ్ధంబుఁజేసి క తానును
సమయున్॥ ౧౪౨॥ తే-గీ॥ జ్ఞాన మజ్ఞానములు నాది క లేనిబయలు। దెలి
యకే జ్ఞాని నేనంచు క దిరుగనేల । యచలభావంబు నొందిన క యట్టి
వాఁడు । జ్ఞానియునుగాఁడు నరయ న క జ్ఞానిగాఁడు॥ ౧౪౩॥ చ॥ పరమ
పదంబుగానకను క భ్రాంతిని వీడకయున్న మానవుల్ । సరవి సుషుప్తి
నుండియును క జాగ్రత యేగతివచ్చు నాగతిన్ క బొరిఁబొరిచావు పుట్టు
వులఁ క బొందుచు నుండుదురట్టి గోప్యమున్ ।మరణముఁరాక మున్నెఱుఁ

గుణమాన్యులెధన్యులుజన్మశూన్యులున్॥ తే-గీ॥ దేవుఁడే లేఁడటంచును। దెలివిలేని। పామరులు కొండఱందురు పాటిదప్పి। పరఁగసర్వంబుమిథ్య యైబ్రహ్మమెందు। నిండి నిబిడీకృతంబునై నెగడుచుండ॥ ౧౮౫॥ ఆ-వె॥ బ్రహ్మమేది మాకుఁ బట్టి చూపుఁడియంచుఁ। బరఁగఁ గొండఱంద్రు బట్టిచూపు నదియు నెల్లమాయ యగుఁ గేవలాత్మను। బట్టిచూప వశమె బ్రహ్మకైన॥ ౧౮౬॥ ఉ॥ కాయముతోడ స్వప్నమునఁ గన్పడు దేవుఁడటంద్రు కొండఱున్। గాయము రాకపోకలును గల్గినమాయయు దేవుఁడెట్లగున్। మాయ నెఱుంగ కెప్పుడొక। మూఢ్కిని నాబయలుండఁ గాన శా। మాయను నమ్మువారలకు మాటికి సమ్మతి మాయ మాట లున్॥ ౧౮౭॥ ఆ-వె॥ తమరుఁగలదటంచు దైవంబునకు మేను। గల దటంచు నెట్లు దలంపవచ్చు। దనువులెల్లఁగర్మ తంత్రంబుచేనయ్యె। దైవమునకుఁ గర్మ తనువుగలదె॥ ౧౮౮॥ చ॥ కనుఁగొన బ్రహ్మకైన మఱి గానఁగ రాకయ యుండ దేవుఁడున్। గనుపడు టెట్లు మర్త్యులకుఁ గన్పడెనేనియు లోకమేటికం। చని యిటుకొండఱందు రిల నజ్ఞులెఱుం గని కారణంబునన్। ఘనముగ బూర్వ తత్వమును గాంచినవారికి లోకమున్నదే॥ ౧౮౯॥ క॥ తనువలచినదే రంభగ। ఘనముగఁదామ నిఁగినదియె గంగగలోకం। బున ఘనము నెంచరల్పులు। గనుఁగొని నీచస్వభావ క్రౌంచములట్టుల్॥ ౧౯౦॥ వ॥ అదియెట్లనిన॥ సీ॥ ఒక్కడ నంచల నొక కొన్నిఁటిఁగని బకంబు లిట్లని వానిఁ గడసిపల్కె। నెవరొ కాళ్లు మొగంబు పెట్టెనమీనివా సంబెద్దియట విశేషంబు లెవ్వ। నఁగను నంచలము మా నస సరోవరమున్కి కమనీయరత్న ములు గలవని నను। నత్తలో నావుడు నవి యెఱుంగమఁటన్న-నత్త లుశూన్యమైనట్టికొలను॥ తే-గీ॥ పర్ణవర్జితమైనట్టి- పాదపంబు। కరణిఁ దలపోసి చూడంగఁగాదె యహహా। యంచు నవ్వంగ సాగెనుగొంచ లెల్ల। నట్లునిజమును దూషించునరులు వారి।వారి మతము లె హెచ్చని వాదుకొంద్రు॥ ఆ-వె॥ జనకైన హరునకైన హరికైనను।సురలకైన ధరణి నరులకైన।గురుఁడులేక దెలియఁగూడు నే బ్రహ్మంబు। దెల్ప నెవరికైనఁ దెలియఁగాక। ౧౯౧॥ క॥ పరిపూర్ణ మెఱిఁగి యెఱుకను। సరిపుచ్చిన వేత్తవేత్త జాడనెఱుంగున్। గురుతేమి యితర జనులకు। నరయంగా నాతఁడుండు నందఱివలెనే। ౧౯౨॥ ఉ॥ పుట్టును గిట్టు కర్మమున-బొం దఁడు చెందఁడు నామరూపముల్। గట్టిగ దేవుఁ డెవ్వరికిఁ గానఁగరాఁ డనులోకసామ్యమున్। వట్టిదిగాదు సర్వమును వర్జితమైనదె కేవలాత్మ

యా। గుట్టు నెఱుంగ రాదు గురుఽగోప్యముగావున నెంతవారికిన్। ౧౫౪॥
క॥ ఎన్నెన్ని చిత్రములకును। నున్నది నేననుచు మాయ ఽ యుత్తదిబయ
లే। యున్నదని జూడఁ దెలిసిన। నన్నిఁటికిని మూలమైన ఽ యదిశూన్య
మగున్॥ ౧౫౫॥ చ॥ కరిఁకతిరూపమారయఁగఁఽగన్పడుచున్నను భ్రాంతి
జన్యమై। కరియును గల్పితంబనుచుఁ గాంచినవారువు సత్యమైన యా।
కరణిని విశ్వరూపమును ఽ గల్పిత మంచుఁ దలంచి సర్వమున్।నితరము
పూర్ణ తత్వమిదిఽనిక్కమటంచును గాంచఁ గాదగున్॥ ౧౫౬॥ క॥ఎఱుక
జగంబులు మిథ్యగఁ। బరిపూర్ణం బెఱిఁగి యెఱుకఁ ఽ బాపినమీఁద।
న్నెఱుకేది యెఱుకజాలం। బెఱుకతో సరిపోయె మాయ ఽ యేమున్న
దిఁకన్॥ ౧౫౭॥ ఆ-వె॥ రూపు నామక్రియలు ఽ రూఢిగా లేనిది కేవలాత్మ
యంచుఁ ఽ గీలెఱింగి। నామరూపక్రియలు ఽ నఖిలంబు మాయగ। నెఱిఁగి
నపుడె భ్రాంతి ఽ నిరసనంబు॥ ౧౫౮॥ చ॥ తిరముగ నామరూపములు ఽ
దేవునకెన్నఁడు లేవటంచు నే। నెఱింగియు రూపనామములు ఽ నెల్లనశించు
నటంచు నెంచుచు। న్నరుదుగ నామరూపముల ఽ యందున భ్రాఁతినిఁ
జెందు పామరుల్। ధరఁ బరిపూర్ణమున్నదనిఽ తాము నెఱుంగరుమాయ
దక్కఁగన్॥ ౧౫౯॥ తే-గీ॥ తా మెఱుంగని దోషాన ఽ దైవమిలను। నెవ్వ
రికిఁ గానరాఁడని ఽ నెంతురెల్ల। గురుఁడు సూచింప బ్రహ్మంబుఽనెఱుఁగు
లేక। గానంబడుచుండు నఖిలంబు ఽ కల్లయగుచు॥ ౧౬౦॥ క॥ విని యొ
రులు సెప్ప బయలని। గనియును గనలేరు మాయ ఽ గప్పియుజనముల్।
విని వినియును జెపుడయ్యేను। గనకనియును గ్రుడ్డియయ్యెఁ ఽ గానరు
దీనిన్॥ ౧౬౧॥ ఆ-వె॥ సత్యమైన బయలు ఽ జూడనుగానక। దబ్బరైన
మాయఁఽదగులుకొనియు। మాయతోడఁజచ్చి ఽ మాయతోఁబుట్టుచు।
మాయఁ గానలేరు ఽ మాయపరులు॥ ౧౬౨॥ క॥ సత్యంబు ముష్టిపండు
న। సత్యం బదటికి రుచియుఁ ఽ జక్కెర భంగిన్। సత్యంబు జనవిరోధ
మ। సత్యము జనరంజకంబు ఽ సత్యంబిదియున్॥ ౧౬౩॥ ఆ-వె॥ ఇంతి
నీవు నింక ఽ నేమాయలేవని ప్రతియులేవి బట్ట ఽ బయలుఁగాంచి। భ్రమ
ను దొట్రుఁజేయ ఽ భవనాశముల దిర్గు। నావ మునిఁగిపోవు ఽ నచలవార్ధి॥
౧౬౪॥ క॥ ఎన్నివిధంబులఁజెప్పిన।నున్నది యీబట్టబయలు ఽ నొక్కటి
యెందున్ ఽ సున్నని దెలియుము విశ్వం। బెన్నఁటికిని భ్రాంతి పుట్ట ఽ
నేరదు నీకున్॥ ౧౬౫॥ తే-గీ॥ స్వప్నమందునఁ దోఁచిన ఽ చందముననుఽ
లేనిదే జగంబున్నట్లు ఽ గానంబడును। గాన నఖిలంబు భ్రమయని ఽ
గాంచి మాయ। భ్రాంతివీడిన సర్వంబు ఽ బట్టబయలు॥ ౧౬౬॥ చ॥ నెల

వుగ నెండమావులను ꣳ నీళ్లనులేక యెఱుంగఁ బిమ్మటన్ । జలముల
పోల్కిఁ దోఁచినను ꣳ సత్యముగాదని చూచుకైవడిన్ । వెలయఁగ బూర్ణ
తత్వమున ꣳ విశ్వము లేదని నిశ్చయించియున్ । గలవలె లోకజాలములు ꣳ
గన్పడుచున్నను నమ్మరార్యులున్ ॥౧౬౭॥ ఆ—వె॥ భ్రమసి లేకతోఁచు ꣳ
భ్రాంతి యున్నదియంచుఁ । బల్కరాదు బట్టబయలునందు । నేమి పుట్టు
చున్న ꣳ దేమి పెంపగుచున్న । దేమి పోవుచున్న ꣳ దేమిలేదు॥ ౧౬౮॥
ఆ—వె॥ లేనిమాయయెందు ꣳ లేదనిచూచిన । నున్నదేమిలేని ꣳ యుత్త
బయలె । బయలు నున్నదన్న ꣳ భ్రాంతియు లేదాయె । భ్రాంతిలేని
బయలె । బ్రహ్మమాయె॥ ౧౬౯॥ సీ॥ పరమ రహస్యమే ꣳ బట్టబయ
లనియు – సూక్ష్మంబులోనసే ꣳ మోక్షమనియు । వచియించు పెద్దల ꣳ
వాక్యమే సత్యంబు – గానియే సాధనల్ ꣳ గాదు తలఁప । సాగరంబులు
దాఁటి ꣳ చనుదెంచుటయుఁగాదు – కొండలు తలకెత్తి ꣳ కొనుటగాదు।
భూమిలోనికిఁజొచ్చి ꣳ పోవుటయునుగాదు ꣳ అంబరంబునకెక్కు ꣳ టది
యుఁగాదు । ఇంకనేకష్టములునుగా ꣳ దెవ్వరైనఁ । బరమ గురుమూర్తి
కరుణను ꣳ బడసిరేని । పరమ గుహ్యమైనట్టి యా ꣳ బట్టబయలు। సూక్ష్మ
మున నుండునది మోక్ష ꣳ సూచనరయ॥ ౧౭౦॥ క॥ లయమైన సర్వ
జగములు । బయలుండు నటంచుఁ దెలిసి ꣳ బ్రహ్మాదిసురల్ । బయలు
నకు మ్రొక్కుచుందురు । బయలే ప్రత్యక్షమైన ꣳ బ్రహ్మంబనుచున్॥
౧౭౧॥ తే—గీ॥ ఎఱుకజేతనుగల్గు నీ ꣳ రేడు జగము । లకును కర్తయా
నదియు నె ꣳ ఱుకయెగాని । అచల మన రాదు కర్తయు ꣳ నచలమునకు।
మొదలె కర్తృత్వ భోక్తృత్వ ꣳ ములును లేవు॥ ౧౭౨॥ క॥ లక్షిత లక్ష్యా
లక్ష్య వి । లక్షణముగు బట్టబయల ꣳ లఘు గురుకృపచే । లక్షలుగని
శాస్త్రంబులు । లక్షింతురు కర్మవిదులు ꣳ లయమగు మాయన్ ॥౧౭౩॥
క॥ మనమును నిల్పిన దాకను । ననువుగ మోక్షంబులేదఁ ꣳ టందురు
యోగుల్ ।మనమెట్లు తామునిల్పిరో। మనమును నిల్పంగవశమె ꣳ మహి
నెవ్వరికిన్॥ ౧౭౪॥ తే—గీ॥ గగనభాగంబుగాలినఁ ꣳ గలసి మనము।నాయె
దానికిఁ జలనంబు ꣳ నణఁగుటెట్లు। బయలుసందున నిల్పు టెట్ ꣳ బ్బంగి మనము
నిసునిచెంగటం దిమిరంబు ꣳ నిలువఁగలదె॥ ౧౭౫॥ సీ॥ ఈయుత్తబట్టబై ꣳ
లేమియులేఁని– ద్వాదశాక్షరినాత్మఁ ꣳ దలఁపవలయుఁ।గొప్ప మూలము
లేని ꣳ గుర్తెఱింగెడు కాయ–మేమిలేనిపదాలు ꣳ నెన్నవలయుఁ । గలలోనఁ
దోఁచిన ꣳ కాయమేలాగో య–లాగె పంచదశాక్ష ꣳ రనఁగవలయు ।
మఱువక యీమాడు ꣳ మంత్రముల్ నిరతంబు ꣳ పఠియించివానితా ꣳ

త్పర్యములను। దెలిసి మూలంబులేని దీ దేహమనుచు। భ్రాంతివీడియు సర్వంబు బయలటంచు। నెఱిఁగియెంతయు నెఱిఁగిన యెఱుకవిడుచు। నట్టివారలె యశరీరు లనఁగవలయు॥ ౧౭౬॥ ఆ-వె॥ నెలఁత వినుమ యింక నీ స్వస్వరూపంబు। బట్టబయలుగాని భ్రాంతిచేత। వెలయఁ దోఁచుచుండు విశ్వరూపంబైన। మాయ నీవుగావు మధురవాణి॥ ౧౭౭॥ క॥ పరిపూర్ణంబే నేనని। యెఱిఁగియు నీ దేహమాత్రయేఁ గా ననుచుఁ। బరికింపుము నీకన్యము। మఱియేమియు లేదఖిలము మాయ తలంపఁ॥ ఆ-వె॥ భ్రాంతిలేని బట్ట బయలైన నీకును। బ్రాణ మరయ లేదు బ్రతుకులేదు। బ్రతుకులేని నీకుఁ బరఁగఁ జావును లేదు। చావు లేని నీకు జన్మ లేదు॥ ౧౭౯॥ క॥ జననంబులేని నీకును। మనమాత్రయుఁ గల్గదెఱుఁక మఱవులు దేహం। బును లేదు కష్టసుఖముల। యనుభవ మును గల్గదెఱుఁగ వఖిలమునీవుఁ ౧౮౦॥ ఆ-వె॥ దేహియుండెనేని దేహంబునుండును। దేహముండెనేని తెల్వియుండు। దెల్వియుండె నేని తిరిగిచావునుండుఁ। జావుగలిగెనేని జన్మముండు॥ ౧౮౧॥ ఏమియుఁగాకయు బయలును। నేమియు ననరాకయుండు నీయందెపుడు। న్నేమిపుట్టుచున్నదో। యేమేమియునాశమౌనొ యెఱుఁగవునీవుఁ॥ ౧౮౨॥ ఆ-వె॥ ఎఱుక నేనటంచు నెన్నకుమెఱుకచే। నెఱిఁగి కేవలాత్మ యేయటంచు। నెఱుఁగు నెఱుక నాకు గురుదక్షిణగనిమ్ము। డిమ్మతడవు లేక యిందువదన॥ ౧౮3 క॥ గురునకు నొసఁగిన యెఱుకను। మఱల నుగ్గైకొనఁగఁ బోకు మదియేదలఁపఁ। గురుదోషమంచుఁ దెలియుమ। యెఱుకనుసరిపుచ్చి పిదప। నెఱుకై యున్నఁ॥ ౧౮౪॥ ఆ-వె॥ కలనుపట్టి దంచుఁ గాంచినఁమీదట। ననుభవములుదబ్బ రైనయట్టు। లెఱుక లేనిదంచు నెఱిఁగినపిమ్మట। నెఱుకచేష్టలెల్ల నిక్కమగునె॥ ౧౮౫॥ క॥ ఎఱుకను జాలము మృషయని। యెఱుఁగక నిక్కంబుగాఁగ నెం చెదరజ్ఞుల్। ఎఱుకనఁగ మాయగావున। నెఱుకెప్పుడు లేనిదంచు నెంచుమునీవుఁ॥ ౧౮౬॥ తే-గీ॥ పరగఁగొందఱుపరిపూర్ణ భావమెఱిఁగి। యెఱుక విడువక యేముందు రెప్పటట్లు। లెఱుకవిడువక పరిపూర్ణ మెఱిఁగియున్న। నేమి కార్యంబు వారలు నెఱుకవారె॥ ౧౮౭॥ క॥ ఎఱుకనఁగస్వప్నమంచును। నెఱిఁగి ప్రవర్తించునదియె యెఱుకవిడుచు టా। నెఱుక పనులెల్ల నిజమని గురు తెలుఁగుట యెఱుకవిడువ కుండుట యరయఁ॥ ౧౮౮॥ సీ॥ కలలోనఁదోఁచిన కాయంబులకు నీ తనువు లకును నెచ్చు తగ్గుగలదె। వాని నెవ్వరుగొంచు వచ్చిరి మఱలను -

నెవ్వరుగొనిపోయి రేమిలేదు । తమకుఁదామేవచ్చి తమకుఁదామే
దోఁచి - తమకుఁదామే లేదు దలఁచిచూడ । నిజముగా రాలేదు నిజము
గాఁబో లేదు - సర్వంబుభ్రాంతిచే సంభవించెఁ । గాన నీకును దేహంబు
గానియెఱుక । గాని యింద్రియములు గాని గలవఁటంచు । నెన్నడై
నను భ్రమఁజెంది యెంచవలవ । దట్టులెంచు టెస్వప్నంబు నగుఁదలంప॥
౧౮౯॥ ఉ॥ కొండలమందనేల యిఁకఁ గోమలిచించినవెన్కపత్రము ।
న్నెందుననున్న బాధ్యునకు నేమిభయంబును లేనిపోలికన్ । ముందు
గురూక్తిచే నెఱుక మూలము ద్రుంచినవాఁడు జన్మముల్ । బొందెడ
నంచు సందియముఁ బొందునె యెందుననైన నెన్నఁడున్। ౧౯౦॥ ఆ-వె॥
తానునుండుటయును దానులేకుండుట । నవనిఁదనదువర్తనంబులాది।
లేనికలయటంచుఁ గానకకలనుండు । మనుజుఁడొందు జనన మరణ
ములను॥ ౧౯౧॥ క॥ కలయందెపుట్టిపెరుగుఁను। గలయందే యనుభవించుఁ
గష్టసుఖంబుల్ । కలయందెనాశమొందును । గలఁబాసిన జన్మమేది
కలయేదింకన్॥ ౧౯౨॥ సీ॥ కలలోనఁదాఁబుణ్య కథలెల్లవిన్నట్లు-వివిధ
తీర్థములుసే వించినట్లు । యజ్ఞాద్రివ్రతముల నాచరించిన యట్లు -
చెలఁగిదానములెల్ల జేసినట్లు । సకలసత్పుణ్యముల్ సల్పియుస్వర్గాది-
భోగంబులను దాను బొందినట్లు । తిరిగిపుట్టియు నేక నరులఁ జంపినయట్లు-
మించియన్యలతోఁ ర।మించినట్లు॥ తే-గీ॥ ఘోరపరవిత్తములుచాలఁగొన్న
మాడ్కి । నఖిలపాపంబు లొనరించి నరకలోక । మనుభవించిన
యట్లుండి మగుడిమేల్క । వడసి చూడంగ సర్వంబు వట్టిదయ్యె॥
౧౯౩॥ క॥ కలయే సత్కర్మంబును । కలయే దుష్కర్మమగును గావున
నెఱుకే। కలయని మేల్కానువారికిఁ । గలయనుభవమెట్లుదోఁచ గలదా
మీఁదన్॥ ౧౯౪॥ ఆ-వె॥ ఎఱుక యున్నవఱకు మఱపును । నుండును
మఱవు గలుగువఱకు నెఱుకయుండు । నెఱుకయనెడుజ్ఞప్తి యెప్పుడు
దోఁచిన । నదియు లేనిదంచు నరయుమీవు॥ ౧౯౫॥ క॥ కలలేనిది
జాగ్రతయును । గలదని భావించువాఁడె కలమనుజుండున్ । గలవంటిదె
జాగ్రతయని । దలపోసినయతఁడె కలను దాఁటినఘనుఁడౌ।౧౯౬।క॥
కలదనిచూడకు మెఱుకను గలదని చేయకుమ యెట్టి కార్యము లిఁయున్।
గలదని దలఁచకు సర్వము । కలయని భావింపజన్మ గలుగదు నీకున్॥
౧౯౭॥ సీ॥ ఎఱుకయేస్వప్నమూ యెఱుకయే జాగ్రత - యెఱుకలే
కున్నను నేమిలేదు । స్వప్నంబుచిన్నయు బద్ధంబుసర్వ ప్ర-పంచంబు
పెద్దయు బద్ధమయ్యె । జాగరంబును లేదు స్వప్నమేమియు లేదు-నిద్రఁ

బోవుటలేదు ఽ నిర్ణయములు। సేయుటయును లేదు ఽ చిత్తవృత్తియెగాని-
యుంటవింటయుఁగంట ఽ తింటలేదు॥ తే-గీ॥ బంధమోక్షములును లేదు ఽ
భవము లేదు ఽ నాశములు లేదు సంసార ఽ నటన గల్గ । దరయ నెఱుక
యుఁగ గలో-ఽ [illegible] నెడ । జాగ్రతనుగన్న యశరీర ఽ జన్ములకును॥
౧౯౮॥ క॥ వేదాంతమసఁగ నేమని। వాదింతురు కొందఱిపుడు ఽ వసుదనల
చతు । ర్వేదాతీతంబగుటను । వేదాంతంబనుచు బుధులు ఽ వీక్షింతు
రొగిన్॥ ౧౯౯॥ క॥ వీక్షించి కాంచనందని । నిక్షేపమునైన రోయ ఽ నేర్తు
రుమూఢుల్ । ద్రాక్షఫలంబులు దినుటక । పేక్షించిన జంబుకందు ఽ విధము
దలంపన్॥ ౨౦౦॥ వ॥ అదియెట్టిదనిన॥ సీ॥ నక్కయొక్కటి మూఁడు ఽ నాళ్ల
శాహారంబు - చిక్కకనాఁకట ఽ సొక్కుచనుచు । నటగోస్తనీలత ఽ లల్లి
బిల్లిగనల్లి - పండిక్రాలిన ఽ ఫలములరసి । యాఫలంబులు దిందు ఽ నని
హర్షమునవాని - నందుకోఁబో ఽ నవియుందకున్న । నపుడు తానెన్ని
య ఽ త్నములు గాంచిన - నవి లభింపమిఁ జేసి ఽ యాత్మవిసిగి॥ తే-గీ॥
పరఁగనీప-క్వ దిన్నా ఽ పండ్లుపులియు । నంచునొక సొడ్డుపెఁబెట్టి ఽ
యరిగెనట్లు । లచల భావంబు లోకులు ఽ నందలేని । కతనఁ జుల్కఁగఁ
జూతురు ఽ గా దెజగతి॥ ౨౦౧॥ చ॥ జనన వినాశశూన్యమును ఽ సర్వము
మీఱిన పూర్ణభావమున్ । ఘనముఖులాత్మ మెచ్చెదరు ఽ గాకను నల్పులు
మెచ్చ నేర్తురే । వనజవిరోధి రాకకును ఽ వారిధు లేచెల రేగుఁ గూపముల్ ।
దొనలు కొలంకు లేఱులును ఽ దుచ్ఛపుఁగాల్వలుఁ బొంగనేర్చునే॥ ౨౦౨॥
చ॥ హరి కరికుంభముల్ చిదుప ఽ నాటవి రాలిన దంతమౌక్తికా ।
లెఱుకలు గూర్చి పేరులుగ ఽ నెంతయుఁ దాల్తురు శుక్తిముక్త్యము । ల్లెఱుఁ
గరువారి వీనికిని । నింతకుఁగల్గిన తారతమ్యముల్ । సొరిది నిజస్వభా
వమును ఽ సూన్మృత భావముఁగాన లేరొగిన్॥ ౨౦౩॥ తే-గీ॥ అరయనే
భ్రాంతి లేనిదీ ఽ యచలమార్గ । మునకుమించిన దేలోక ఽ మునను లేదు।
నిదురవచ్చెడివఱకును ఽ నీవు చచ్చు। వఱకు దీనిని నీమది ఽ మఱవకుండు॥
౨౦౪॥ క॥ ఏవఁక మనము పాఱిన । నావంకకు నింద్రియంబు ఽ లన్నియు
నేగున్ । గావున సద్గోష్ఠినిమన । సేవిధమునైనఁ జొరగఁ ఽ జేయఁగవల
యున్॥ ౨౦౫॥ క॥ ఇదియే పరమ రహస్యం । బిదిసత్యము నమ్ముసంశ ఽ
యింపకుమిఁక నా । హృదయమున నింతకంటెను । గుదురగు మార్గంబు
లేదు ఽ గురుసాక్షి సతీ॥ ౨౦౬॥ ఆ-వె॥ ఇదియు బ్రహ్మవలన ఽ నెఱిఁగె
వసిష్ఠుండు అతనివలన జనకుఁ ఽ డతనివలన। శుకుఁడు శుకునివలన ఽ సారది
సాందీపులు । గనియె నతనివలనఁ ఽ గంటినేను॥ ౨౦౭॥ క॥ పరిపూర్ణమెఱుఁగ

మునులకు । సురలకుదుర్లభము నీకు ౹ సూటిపటిచితిక్ । నర నృగు
దూర్వాసులకును । దిరముగ నుద్ధవునకేను ౹ దెల్పితినిదియుక్॥ ౨౦౭॥
ఆ-వె॥ పరమపదమునందు ౹ భ్రమయందరికిఁగల । దంచుఁజేరవశమె ౹
యుండటికినిఁ । గలయ నచలగురుని ౹ కరుణకన్యంబగు । వాంఛలేక
యుండు ౹ వారుదక్క॥ ౨౦౮॥ శా॥ ఏమార్గంబులు దొంగత్రోవల
రయుక్ ౹ హేయంబులైవానిచే । సామాన్యంబగుఁదప్పిపోవుభవముల్ ౹
సంకెళ్లుగా నేర్పడుక్ । రామాదీనిని నమ్మిన జన్మమునకుక్ ౹ రారెవ్వ
రుక్గావున । న్నేమార్గంబులుసాటిగావుధరలో౹నిరాజమార్గంబుతోక్॥
౨౦౯॥ ఆ-వె॥ అనుచుఁదెల్పుశౌరి ౹ యదుగుదమ్ములకును । మ్రొక్కి
హస్తములను ౹ మొగిచి నిలిచి । శాంత రుక్మిణియును ౹ ఘనమైన
భక్తితో। దేవదేవుసన్ను౹తించెనట్లు॥ ౨౧౦॥ దండకము॥శ్రీవాసుదేవాయ
చింతస్వభావాపర బ్రహ్మనిష్ఠామ సర్వేంద్రియాతీత సంసార తాపత్ర
యాభంగనిస్సంగనిర్మోహనిష్కర్మనిత్యాత్మ భక్తాంబుజవ్రాత మార్తాం
డసర్వప్రభూతాంతరాత్మా చిదాత్మాపరాత్మా పరంజ్యోతి రూపపరే
శాపరంధామసద్రూపచిద్రూప లక్షావిలక్షాత్మ రాండాండ పిండాండ బ్ర
హ్మాండ భాండోదరా సర్వసంపూర్ణ సర్వజ్ఞ సర్వేశసర్వోత్తమా సత్య
సంకల్ప సద్వేదవేదాంత సిద్ధాంత శ్రీశౌనకాగస్త్య కౌండిన్యమైత్రేయ
వాసిష్ఠ వాల్మీకికణ్వాత్రి గార్గేయ శ్రీనారద వ్యాస శ్రీవత్స మార్కండ
మాండవ్య శాండిల్య నానా మునిస్తోమ హృత్పద్మ సంధానరూపా నిరా
కారనిర్వేద్య నీరంధ్రనిర్బంధ నిర్ముక్తనిష్కార్య మానావమానావిహీ
నాత్మతద్భూతపంచ ప్రపంచాది శూన్యా భవన్నాశ హీనాపరః కేవ
లాత్మా భవద్దివ్యరూపంబవాచ్యంబవేద్యంబసాధ్యంబచోద్యంబభేద్యం
బబాధ్యంబబోధ్యంబవిశ్వంబరూపంబనంతంబచింత్యంబవర్ణంబనాకా
రమాద్యంత రాహిత్యమైయొప్పు నీరూపుబ్రహ్మాది దేవేంద్రబృందారకుల్
గూడ,గీర్తింపలేరయ్య నీమూర్తిగీర్తింప నేనెంతదానన్భవద్దివ్యమానస
కృపా వీక్షముంజేసి నీ స్వస్వరూపంబు నా స్వస్వరూపంబు గాఁగంటి
మేల్కంటి స్వప్నాభవిశ్వాది భ్రాంతుల్ సమస్తంబున న్బాసిపోనయ్యె
నేవేళనుక్ నొక్కరీతిక్గనక్ నిర్గుణంబెందు నేకంబుగానుండు నీబట్టబై
లందు నేభ్రాంతియుక్ లేదు నా స్వస్వరూపంబు పూర్ణాచలం బౌటనేఁ
గంటి నాకల్మషాల్ పాటెనాశంకయుక్ దీటెనా భ్రాంతిపోకారెనాయిష్ట
మొప్పారె నానోము ప్రాప్తించె నాజన్మ మీడేరె ధన్యత్వముక్ గంటి
నుంతైననాకుక్ గొఱంతేమియుక్ లేదు శ్రీకృష్ణదేవా నమస్తేనమస్తేనమ

స్తేనమః॥ ౨౧౨॥ క॥ అని యిట్లు వేఁడుసతిఁగని । వనజోదరుఁడప్పుడధిక ఽ
వాత్సల్యమునన్ । వనజాక్షిని దీవించెను । మనములరఁగ జన్మరహిత ఽ
మగునీ కనుచున్॥ ౨౧౩॥ తే-గీ॥ దీవనయుఁగాంచి రుక్మిణీ ఽ దేవి చక్రి ।
పాదసేవ యొనర్చ్చి ఽ భక్తిపదముఁ। దెలియ గురుశిష్య ధర్మంబుఁ ఽ దెల్పు
మనిన । నింతిఁ గనుఁగొని కంసారి ఽ యిట్టులనియె॥ ౨౧౪॥ చ॥ గురుఁడరు
దేర ద్రొక్కకయె ఽ గూరుచునుండఁగ రాదు శిష్యుఁడున్ । గురుఁడను
దానునేకముగ ఽ గూడిపరుండఁగ రాదు శయ్యపై । గురునకు మున్న తా
నుగను ఽ గూర్కఁగ రాదు భుజింపరాదు పో । గురియును దప్పరాదితర ఽ
గర్వాల జేరఁగ రాదు భక్తుఁడున్॥ ౨౧౫॥ చ॥ పరమును జూపు నా గు
రుఁడు ఽ బంధుగుఁడైన హితుండునైనఁడా। నరయఁగ దమ్ముఁడైనఁ దన ఽ నం
దనుఁడైన మతంగుడైనఁ బో। నర సఖిసోదరాత్మజులు ఽ నాకనునీచుఁడు
నాఁగ నలక్ష్యమించకన్ । గురుడె పరాత్పరుం డనుచుఁ ఽ గొల్వక
ముక్తుఁడుగాఁడు భక్తుఁడున్॥ ౨౧౬॥ ఆ-వె॥ జననియు జనకుండు ఽ సకల
ఋణంబులు । పరముఁ గన్నయపుడె ఽ పాసిపోవు ఽ నట్టి పరముఁ దెల్పు ఽ
నట్టి యాగురుసేవఁ । జేయకున్న ఋణముఁ ఽ బాయరాదు॥ ౨౧౭॥ క॥
గురుకరుణవడసి నిరతము । మఱిమఱి యాపరమునందె ఽ మదినిల్ప
నగున్ । గురుభక్తిలేకయుండిన । నరునకు దూరంబు ముక్తి ఽ నళినద
ళాక్షి॥ ౨౧౮॥ ఆ-వె॥ గురుఁడు దెలిసినంత ఽ యొఱిఁగితి గురుఁడు నా ।
కెక్కు వేమియంచు ఽ నిక్కరాదు। యడుగు కీటువిడచి ఽ యామీఁదగోడను
బెట్టి నిల్పఁగలరె ఽ దిట్టలైన॥ ౨౧౯॥ క॥ పరమునకంటెను దెల్పినఁ
గురుఁడే యధికుండుగాన ఽ గురుభక్తుండున్। గురుఁడే బ్రహ్మయు విష్ణువు।
గురుఁడే శివుఁ డింద్రుఁడంచు ఽ గొల్వంగవలయున్॥ ౨౨౦॥ ఆ-వె॥ వెలఁ
దిపరులు దూఱ ఽ వినరాదు గురునిఁ దా । దూఱరాదు ఆజ్ఞ ఽ మీఱ
రాదు । గురుఁడు మదినినొప్ప ఽ కుండున దెద్దియుఁ । జేయరాదు మంచి ఽ
శిష్యుఁడైన॥ ౨౨౧॥ చ॥ గురుఁడు ననుగ్రహంబొసఁగఁ గోరిన కాలముఁ
బుచ్చరాదు స।త్వరగతినీయకుండిననుదత్తర బెట్టఁగ రాదు సాగురుం ।
డిరవుగ బోధఁజేయునెడ ఽ నెంతటి కార్యములున్నఁబోవకా। దరయఁగఁ
దెల్పకుండిననునాతని నొక్కఁగ రాదు శిష్యుఁడున్॥ ౨౨౨॥ ఆ-వె॥ వెల
యనితరమైన ఽ వేడుకలెవ్వియుఁ। గోరిచేయరాదు ఽ గురునియింట । మంచ
మెక్కరాదు ఽ మద్యపానంబాది । కృత్యములను జేయఁ ఽ గూడదెపుడు॥
౨౨౩॥ క॥ గురుఁడుండు నాశ్రమమునకుఁ । గరితురముగ లెక్కపోవఁ ఽ
గారాదెపుడున్। వరభక్తిపాదచారిగ । నరుగంగావలయు శిష్యుఁ ఽ డతివిన

యమునన్॥ ౨౨౪॥ ఆ-వె॥ పరఁగధరణికెల్లఁ ర ప్రభువుతానైనను।దన
ప్రభుత్వ మేమి ర తనదుగురుని । యెదుటఁ జూపఁగఁదగ ర దెంతవాఁడై
నను । గురునిభృత్యు పగిదిఁ ర గొల్వవలయు॥ ౨౨౫॥ క॥ గురుమూర్తికిఁ
గనుపించక । మఱుఁగంగా రాదుదొంగ ర మార్గమునందున్ । మఱికపట
వినయభక్తులు । గురునకు నొనరింపరాదు ర గురుభక్తుండున్॥ ౨౨౬॥
ఆ-వె॥ ఒనరఁగురుఁడుతనకు ర నొసఁగు ప్రసాదంబు । నెవ్వరికినిఁ దానువ
నీయఁదగదు । తానె గుడువవలయుఁ ర దనకుమహాప్రసా । దంబుగాఁగ
శిష్యుఁ ర డాదరమున॥ ౨౨౭॥ క॥ గురుఁడొసఁగిన తృణమైనను।బరమధ
నంబది యటంచు ర భావింపఁదగున్ । గుఱుఁడీయకున్న నెద్దియుఁ । బర
గంగా ముట్టరాదుర భక్తుండెపుడున్॥ ౨౨౮॥ ఆ-వె॥ గురునిఁబాసియొంటిఁగ
గూర్చుండఁగారాదు । ఆజ్ఞచేయఁగఁదగ ర దరయగురుని । మోసవుచ్చ
రాదు ర గాసిపెట్టఁగరాదు । ప్రజ్ఞదెల్పరాదు ర భక్తుఁడబల॥ ౨౨౯॥ క॥
గురువును నేరములెన్నడు। నరపశువును భక్తుఁడనగ ర న్యాయంబగునే।
గురుఁడే దైవంబనుచును । స్థిరముగ సేవించువాఁడె ర శిష్యుఁడుగాకన్॥
౨౩౦॥ ఆ-వె॥ కల్లలాడరాదు ర గర్వించి గురునితో । నెదిరిపల్కుట
దగ ర దెన్నఁటికిని । బగనుబూనరాదు ర భక్తుని దండించి । గురుఁడుగీ
ము వెడలఁగొట్టెనేని॥ ౨౩౧॥ క॥ గురునకు సరియగుదైవము । ధరణి
నిఁదనుఁగన్న తల్లిదండ్రులుమనుజుల్ । వరబంధుజనములాప్తులు।పరమా
త్ముఁడు గాదుకాదు । పరమపదంబున్॥ ౨౩౨॥ తే-గీ॥ కులమునభిమాన
మును లజ్జగలిగిగురుని । చెంతవర్తింపఁగఁదగదు ర శిష్యునకును।కులము
నభిమానమునుసిగ్గుఁ ర గూలఁబెట్టి । సల్పదగు సేవకింకరు ర చందము
నను॥ ౨౩౩॥ క॥ ఇల సర్వతీర్థయాత్రలు । పలుమఱుసేవించి నంతఫలము
నరునకున్ । గలుగును సద్గురుమూర్తినిఁ । దలఁపగా నొక్కమాఱు ర
దర్శించుటచేన్॥ ౨౩౪॥ తే-గీ॥ ఘనతరంబుగ భయభక్తిఁ గల్గిగురుని।
పాదుకాసన శయ్యల ర భక్తుఁడేమి । వందనంబులుఁగావింప ర వలయుఁ
గాని । పాదముల్ వానికిఁదగుల్ప ర రాదెపుడును॥ ౨౩౫॥ క॥ గురుఁడును
బోవుచునుండఁగ । గురువెనుకనె పోవవలయు ర గురుభక్తుఁడున్ ।గురు
నీడఁద్రొక్కుమున్నట।నరుఁగఁదగదుభక్తుండెంతయుఘనుండైనన్॥ ౨౩౬॥
ఆ-వె॥ ఆసనములు శయ్య ర లంబరభూషణ । వాహనంబు లాదిగవస్తు
వులను । భక్తినొసఁగవలయు ర భక్తుండుగురునకుఁ । జిత్తమందుసంతో
సించునట్లు॥ ౨౩౭॥ క॥ మఱి దేహమున్న పఱకును । స్మరియింపుచు
నుండవలయు ర సద్గురుమూర్తిన్ । దురితపువర్తనుఁడైనను । గురునకు

లోభంబుఁజేయఁ ॽ గూడ దెదియున్॥ ౨౩౮॥ ఆ-వె॥ పరమగురుని
స్వామి ॽ ప్రభువు దేవయంచును । జేరిపిల్వవలయు ॽ శిష్యుఁడెపుడు। నరుఁ
డటంచు నెంచి ॽ నరులనందఱివలెఁ। బేరు పెట్టితానుॽ బిల్వఁదగదు॥ ౨౩౯॥
క॥ గురువును గురుమంత్రంబును । మఱచియుగురునిందఁ జేయు ॽ మంకు
జనుండున్ । తరణిసుధాకరులుండెడిఁ। వఱకునుయమలోకమందుॽవాస
ముఁజేయున్॥ ౨౪౦॥ ఆ-వె॥ గురునివలనఁ బరము ॽ గుర్తుగాఁదెలిసిన।
గురుఁడు శిష్యునందుఁ ॽ గూర్మిలేక । గాంచరాదు ముక్తి ॽ గావునభ
క్తుండు । గురుని ప్రేమ గాగఁ ॽ గొల్వవలయు॥ ౨౪౧॥ క॥ గురునాజ్ఞఁ
బొందనిదెటా । గురువైభవి శిష్యజనులఁ ॽ గూర్చియు బహుగా। గురు
బోధఁదెల్పువాఁడే । గురువంచకుఁడనఁగ బరఁగుఁ ॽ గుంభినిలోనన్॥
౨౪౨॥ తే-గీ॥ చెలఁగిసద్గురు సేవయుఁ జేయుచెట్టు । లనిన స్థానాంగ
భావాత్మ ॽ లనగఁనాల్గు । విధములైన శుశ్రూషల ॽ వేసరకను। జేయ
వలయును భక్తుండు చెలువుమీఱ॥ ౨౪౩॥ క॥ హరిగిరిజర దిక్పాలక। సరసి
జగర్భాదులిచ్చు ॽ శాపమునైనన్ । గురుమూర్తి దీర్చు । జాలును। గురు
శాపముమాన్పలేరు ॽ కుంభినినెవఱున్॥ ౨౪౪॥ ఆ-వె॥ గురుఁడుతన్ను
మిగులఁ । గొట్టి తిట్టుటెల్ల । తన్నురక్షఁజేయఁ ॽ దలఁచిగాని। శిష్యుల
వలన ॽ దానుॽసిద్ధిఁబొందుటకునై। గాదతనిని జెఱుపఁ ॽ గాదుచూవె॥
౨౪౫॥ క॥ శిక్షింపఁ దలఁచువాడే। శిక్షించు భయంబుఁ జెప్పి ॽ చేయిం
చుఁబనుల్ । రక్షింపఁదలఁపకుండిన । శిక్షింపఁడు పేక్షఁజేసి ॽ చెప్పండె
దియున్॥ ౨౪౬॥ ఆ-వె॥ మధువు వలయు నతఁడు ॽ మధుమక్షికములకు।
జెడిసి పాఱమధువుఁ ॽ బడయఁడట్లు । గురుఁడు శిష్యవరునిఁ ॽ గొట్టినది
ట్టిన నోర్చిబోధఁగొనుట ॽ యొప్పుధాత్రి॥ ౨౪౭॥ సీ॥ అలకాశియాదిగా ॽ
నఖిలతీర్థములకు - గురుపాదతీర్థమే ॽ గొప్పగాఁగ । వరస్వర్గకైలాస ॽ
వైకుంఠముల కంటె-గురునిలయమె మహా ॽ గొప్పగాఁగ । హరిహర
బ్రహ్మాది ॽ సురసంఘమునకంటె-గురు మూర్తియే మహా ॽ గొప్పగాఁగ।
ధర సమస్తప్రసాదంబుల కంటెను-గురు సుప్రసాదమే ॽ గొప్పగాఁగ ।
పరమ గురుమూర్తి సేవించు ॽ భక్తునకును । బదవు లేటికి మూర్తులॽ
భ్రాంతియేల । సకలతీర్థంబు లేటికి ॽ జన్మఁదెచ్చు । జన్మరహితంబు
గురుపద ॽ సంభవంబు॥ ౨౪౮॥ క॥ గురుపాద తీర్థమునకును। సరివేయవ
పాలుగాదు ॽ జగతి సకలసా। గర పర్యంతము గల్గిన। వరతీర్థము లందుఁ
గ్రుంకు ॽ వలనిఫలంబుల్॥ ౨౪౯॥ చ॥ విడువగవచ్చు రాజ్యమును విత్త
ముగేహము బంధువర్గమున్ । విడువఁగవచ్చు సోదరుల ॽ వేగమొయా

పుత్రులఁ దల్లిదండ్రులన్ । విడువఁగవచ్చు సౌఖ్యమును • వేడ్కఁ జెలంగఁగ
నాలుబిడ్డలన్ । విడువఁగవచ్చుఁ బ్రాణమును • వీఁడగరాదిల భక్తిమార్గ
మున్॥ ౨౫౦॥ చ॥ సతిగుఱి గల్గు దూరమునఁ • జందన వృక్షములున్న
వానిపై తీతినవె వంటకట్టెయులు • సేతురు చేరువనున్న యటుగన్।సత
తము నింట నుండినను • చౌకదనంబు బుధాళి కెంతయున్ । హితవుగ
గొప్పపూజ్యత వ • హింతురు దూరమునందునుండినన్॥ ౨౫౧॥ఆ-వె॥
అనుడు సద్గురూత్తమునియందు భక్తియు।నౌర యెంతయొప్పనె ననుచు
నాత్మ । నెన్నికొనుచు మిగుల • నీగ్రంథఫలమును • జెప్పుమనినఁజక్రి
చెలియఁజూచి॥ ౨౫౨॥ క॥ ఎఱిఁగితివి యెఱుఁగ గలిగిన • పరమార్థంబైన
సూక్ష్మ • భావములెల్లన్ । గొఱఁత య్యేనేమొ వినుమిఁక । నెఱిఁగించెద
గ్రంథఫలము • నిందుని భాస్యా॥ ౨౫౩॥ ఆ-వె॥ భక్తిఁ దెల్పుచోట • ముక్తి
మార్గమునుండు । ముక్తి దెల్పుచోట • భక్తియుండు । భక్తిముక్తి దె
లియఁ • బడని గ్రంథంబులు చదువనేల పెక్కు • చదువులెల్ల॥ ౨౫౪॥
సీ॥ సతిమనయిరువుర • సంవాదరూపమా - నీమోక్షగ్రంథంబు • నింపు
మీఱఁ । జదివి వ్రాసినవిన్న • జనులకు సుగుణంబు - లాయురారో
గ్యంబు • లతిశయిల్లు । నిష్టంబులీడేరు • నిఖిలాఘ చయములు-పాయు
సంకటములు • వాసిపోవు । పుత్ర పౌత్రాద్యష్ట • భోగముల్ చేకూఱు-
దారిద్ర్యరుగ్నతల్ • దొలఁగుఁదుదకుఁ॥ తే-గీ॥ బుణ్యలోకంబులొందు
దుర్ • పొలుపుమీఱ । దేశికుని కృత మర్మంబుఁ • దెలిసిదీని । యను
భవంబును దెలిసిన • యట్టివారు । ముక్తులగుదు రెవ్వారైన • మోహ
నాంగి॥ ౨౫౫॥ క॥ ఎందాఁకఁ బంచభూతము । లెందాఁక నగాబ్ధితారక
లినశశిజగముల్ । ఎందాఁకనుండు నీకథ । యందాఁకిలఁ జెలగుఁగాత
మార్యస్తుతమై॥ ౨౫౬॥ చ॥ అనవుడు భక్తిముక్తులను • నందఁగఁజేయుట
మీకటాక్షమా । ననిమది నెంతునీవరయ • నాకువిభుండవు సద్గురుం
డవై । ననుగురుబోధ దేర్చుటకు • నాదగుభాగ్యము గాదె దేవకీ।తనయ
విముక్తిఁ జేయ నను • ధారుణి మీరలు పుట్టుటెంతయున్॥ ౨౫౭॥ క॥
పరహితము సేయునదులును । బరహిత మొనరించునభ్ర • పాదపతతు
లా । శరణిని నీలోకంబుల । బరహితమే యాచరించు ప్రాజ్ఞులుమీరల్॥
౨౫౮॥ క॥ అని వినుతించుచు రుక్మిణి । తననాథునిఁగొల్చి భక్తిఁ • దప్పక
పూజల్ । ఒనరించుచు సేవించుచు । ననుపమ మోదాబ్ధి వాలకేలాడెడి
వేళన్॥ ౨౫౯॥ సీ॥ తరుణివిడిదికేగు • తఱిఁజెప్పవచ్చిన - చొప్పున వే
కువజాక్కవాడిచె । బడఁతికి దేహాది • భ్రమలూడెననుభంగిఁ-గలువ

లంతంతఁ జొ ౯ క్కుముగముడిచె । ముదిత కజ్ఞానాంధ ౯ మునువిచ్చిచనె
వను ౯ భాతినంతంతకుఁ ౯ బాసెఁదమము । రమణికిగుణవికాశరముల్లె
డిందిన - సరణి చుక్కల విలా ౯ సంబుమాసె॥ తే-గీ॥ జ్ఞాననేత్రంబు విక
సించె ౯ చానకనిన । గతినిఁదామరలెల్లవిశ్కాసమొందె । నాత్మజన్మంబు
తెలవాతెననిన పోల్కి । దినకరుండును బొడిచెఁబ్రాగ్దిక్కునందు॥ క॥
అంతటఁ బతియాజ్ఞను దన। యంతఃపురమునకు నేగెయనయము సతిబల్
వింతగ సముచితకృత్యము । లెంతయు సల్పుచునుభక్తినేమఱకుండెన్॥
౨౬౦॥ క॥ వేదాంతవేద్యనామా । వాదభేదాంతధీమ ౯ వర్జితకామా।
ఖేదామోదాంతసీమా । నాదద్రూపాంతసీమ ౯ నాముకవిరామా॥ ౨౬౧॥
మాలిని॥ భ్రమచయలయ యుక్తా ౯ భావ విశ్వాతిరిక్తా । యమరనికర
మాన్యా ౯ యాదిమధ్యాంతశూన్యా । నిమిషవిజితపాపా ౯ నిర్గుణానంత
రూపా । సమహితకులదూరా ౯ సర్వహీనావికారా॥ ౨౬౨॥ క॥ మంగ
ళము పరమగురునకు । మంగళముచిదాత్మునకును ౯ మంగళముభవా।
భంగవిగతునకు స్థిరునకు । మంగళపజరుద్రవినుత ౯ మగుబయలునకున్॥

గద్య॥ ఇది షోలకం - లక్ష్మీనృసింహార్యపుత్ర, సాధుజనమిత్ర
నారసింహ నామధేయ ప్రణీతంబైన శ్రీకృష్ణ రుక్మిణీ
సంవాదంబను - సుజ్ఞాన శాస్త్రంబునందు
సర్వంబును బంచమాశ్వాసము.

స్వస్తి.



# పంచపాది సీసము.

మంగళగిరితూర్పు । మాటెయిప్పటములోని -
దైనమల్లెంపూడి । యనెడువీట
ఘనుఁడు బొమ్మారెడ్డి । కన్నయవరగర్భ -
జనితుఁడై సత్పుణ్య । చరితుఁడగుచు
నలపెదకోటయ్య । యనునామమున గ్రామ -
మునసబు నధికార । మును వహించి
జనులెల్లసద్ధర్ముఁ । డనఁగ న్యాయాన్యాయ -
ములనుగణించి తీ । ర్పులు నొనర్చ
సజ్జనోత్తముఁడంచు । సర్కారు జనములు -
ప్రస్తుతింప మెలఁగు । భవ్యమూర్తి

తే-గీ॥ రుక్మిణీ కృష్ణ సంవాద । రూపమగుచుఁ
బరఁగు నీమోక్ష గ్రంథంబుఁ । బ్రౌఢిమెఱయ
ధనసహాయంబు వలనను । ధర్మరీతి
నచ్చువేయించె బుధజనుల్ । మెచ్చ మొదట,

సీ॥ అస్మద్గురుఁడగుచు । నలరు శ్రీపోకల - శేషాచలార్యులకు
జ్యేష్ఠపుత్త్రుఁ । డగు వేంకట నృసింహరావునాయుఁడు-
భవ్యచరిత్రుఁడౌ । పండితునకు । క్షితి నేరచించిన । శ్రీ
కృష్ణరుక్మిణీ । సంవాదమనెడు సుజ్ఞానశాస్త్ర । మనెడు
నీ సద్గ్రంథ । మును సరిచూడంగ - నవల రిజిష్టరు ।
నాదిగాఁగ॥

తే-గీ। సర్వకర్తృత్వమొసఁగితి । సత్యముగను । గందుకూరను
సీమలోఁ । గలుగు పమిడి । పాటి పుర వాసుఁడను నేను ।
భాసురముగఁ । బోలకం నారసింహా నా । ముండనొగిని॥

# శ్రీ భగవద్గీత.

(నోరి గురులింగ శాస్త్రి టీకాతాత్పర్యముతో)

ఇది పదునెనిమిది అధ్యాయములుగల మహాగ్రంథము. గీతాశాస్త్రమున్నచోట శ్రీహరియు సమస్తదేవతలును, మహర్షులు సమస్త పుణ్యతీర్థములును నుండును. ఈ గ్రంథమును శ్రద్ధాభక్తులతో పఠించువానికి సమస్తకష్టములు తొలగిపోవును. అతిరహస్యమగు యీ గీతాశాస్త్రమును శ్రీకృష్ణుడు మహాభారత యుద్ధభూమిలో అర్జునకు ఉపదేశించెను. ఈ గ్రంథము మహాపవిత్రమైనది. విశేష ఆశ్చర్యకరమైనది. మానవులు అవలంభింపవలసిన ధర్మమార్గముల నన్నిటిని లోకోపకారార్థమై శ్రీకృష్ణపరమాత్మ యీ గ్రంథములో విపులముగ వివరించి యుండెను ఈ గ్రంథము శ్లోకం టీకా తాత్పర్యముతో చేరినది క్యాలికోబైండు. 4 0

# శ్రీకృష్ణరుక్మిణీ సంవాదంబను

## సుజ్ఞానశాస్త్రము.

ఈ గ్రంథమునగల విషయములు:— ద్వారకాపురవర్ణన, శ్రీకృష్ణరుక్మిణీ సంవాదప్రారంభము. సాధన చతుష్టయములు, చతుర్విధ పురుషార్థ లక్షణములు, గురుమూర్తి ప్రభావము, దైవ లక్షణము, భాగవత లక్షణము, జీవహింస లక్షణము, శ్రమలక్షణము, కుల లక్షణము, పిండోత్పత్తి లక్షణము, ప్రాప్తకర్మ లక్షణము, భక్తి లక్షణము, కర్మ లక్షణము, యమదండన వివరము, యోగలక్షణము, అష్టాంగ లక్షణము, పంచముద్ర లక్షణము, ప్రపంచోత్పత్తి లక్షణము, సాంఖ్య లక్షణము, తారకలక్షణము, జీవాత్మ పరమాత్మ లక్షణము, తను చతుష్టయ నిర్ణయము, షట్చక్ర నిర్ణయము, హంసలక్షణము, భగవంతుని విశ్వరూప లక్షణము, కాలప్రమాణము, మిథ్యాజగల్లక్షణము, మరణచిహ్నములు, అచలభావము మున్నగునవి గలవు. వెల 1 4 0

---

వలయువారు:— **వెస్టువార్డు అండు కంపెని.**

చాకలపేట, మదరాసు—21.